శ్రీ.

# ప్రభావతీప్రద్యుమ్నము.

7/149

ఇయ్యది,

సనాతన కవిపుంగవుండగు పింగళసూరనార్యకృతంబైన

ప్రబంధరాజంబుననుసరించి,

కోటామురాజ్యలక్ష్మీమనోహరుండగు

శ్రీ. శ్రీ. రాజావత్సవాయ వేంకటసింహాద్రి జగత్పతి రాజాబహద్దరు

మహారాజావారి కంకితంబుగా,

నేతత్సంస్థానాస్థానస్థిత సత్కవీశ్వరుండగు,

బ్రహ్మశ్రీ-హోతా వేంకటకృష్ణకవిప్రణీతంబై

విరాజిల్లునేడంకములనాటకము.

మొదటికూర్పు 1050 ప్రతులు.

చెన్నపట్టణము.

ఆనందధూమ ముద్రానిలయంబునన్ముద్రితము.

1911.



వెల. పోస్టేజీవగైరాఖర్చులుగాక రు. 1-0-0.




# పీఠిక.

---

చదువరులారా!

పూర్వకాలంబునఁ గాళిదాసాదిమహాకవులు కొంద ఱెట్టి రసవంతమైనగాథయైనను శ్రోత్రపర్వంబగుటయేఁ గాక నేత్రపర్వంబుఁగూడ నయ్యెనేని మఱియు శ్లాఘనీయంబగు ననితలంచి యభిజ్ఞాన శాకుంతలాది మహానాటకంబులను సంస్కృతభాషలో రచియించి దృశ్యప్రబంధములకు మార్గప్రదర్శకులై యందలి పరిశ్రమాధిక్యతను గమనించియే "నాటకాంతమ్ కవిత్వమ్" అని వక్కాణించిరి. ఇటీవల గీర్వాణభాషయందు నాంధ్రభాషయందు సమానప్రజ్ఞగల కవిశల్లజులు కొంద ఱా సంస్కృతనాటకంబులనే యాంధ్రీకరించి యమితమైన మాతృభాషచే రచియింపఁబడిన నాటకములలోని రసమును మితమైన యాంధ్రభాషచే సమగ్రముగఁ బ్రచురింపఁ బ్రయత్నించి ప్రప్పుళోకాలువైచిరి. అందువలన నుభయభాషల గౌరవంబునకును కొంత కలుగుననియెంచి మఱికొందఱు కవిబుధులు దివ్యమో యదివ్యమో దివ్యాదివ్యమో యొక యితివృత్తముంగొని భావరసాలంకారలక్షణసమన్వితంబుగ నాంధ్రభాషలో నిజేచ్ఛ నాటకంబులను రచియింపఁదొడంగిరి. ఆంధ్రభాషయందును విశేషించి దృశ్యప్రబంధములయందును మిక్కుటమైన యభిరుచికలవాఁడ నగుటచే నేను నట్టిపూనిక వహించి యిదివరలో కొన్ని నాటకములను రచియించియు నంతటితోఁ దనివినక మఱియొక నాటకంబు వ్రాయఁదలంచి యేతత్ప్రోద్యమంబున కెట్టికథారచనంబు సర్వజనసమాదరణీయం బగునోయని నేనిట్లు వితర్కించితిని:—

సనాత నాంధ్రకవితాశిరోమణులలోఁ జేరెన్నికఁగన్న పింగళి సూరనార్యకృతంబులగు 1 రాఘవపాండవీయము 2 కళాపూర్ణోదయము 3 ప్రభావతీప్రద్యుమ్నము, నాఁబరగు నాంధ్రకావ్యరత్నంబులలో ప్రభావతీప్రద్యుమ్నంబను నమూల్యకావ్యరత్నంబు నాయకరత్నంబై విరాజిల్లుచు చదువరుల హృదయంబులను మరందతుందిలంబులుగఁ జేయుచున్నదను విషయంబు తదీయగ్రంథరచనామృత నిషేవణాయత్తచిత్తులగు మనీషులందఱకు ననుభవనీయంబే కదా. కావున నవకోమలరసాల కిసాలయపుట్టికలోనింపిన యమృతరసంబు నుదృక్కరంబుల గ్రహియించి చూచువారలుఁగూడ నానందింపవలనుబడుటకై శ్రవ్యప్రబంధంబగు వద్దాని నేడంకముల దృశ్యప్రబంధంబుగ రచియించి ప్రఖ్యాతివడసెదఁగాక—"

అని కృతనిశ్చయుండ నైతిని. నాయీసాహసంబునకు గుణదోషవిమర్శన నైపుణీ విశారదులగుకోవిదులలుంగ నవసరములేదు. సత్కార్యమైనచో నెద్దానినైన శక్తికొలంది ప్రయత్నించుట వివేకవంతులందఱకు సహజమే కదా. కావున.

చ. జడనిధిఁగట్టురామునకు శక్తిగణింపక యూఁతఁగొల్పఁగా
నుడతయుఁదోఁకతోనిసుక నుద్ధతిఁబోయదె వార్ధిలోన నా
వడువున సూరనార్యుని ప్రబంధముఁ జక్కని నాటకంబుఁగా
దొడరితి నేరచించుటకు దోషము లెంచకుఁ డీ దయామతిన్.

మఱియు నేతత్కావ్యరచనామృతంబునఁ గడుపారఁగ్రోలియున్నవాఁడనగుటచే దానియందు నాకుంగల మిక్కుటమైన యభిమానముచేతను నేనిటవరలో రచియించియున్న దృశ్యప్రబంధంబులను చదివిచూచి హర్షించిన సుహృద్వరులుచేసిన హెచ్చరికచేతను మదీయపోషకులును ద్యుమణికుల సుక్షత్రియాన్వయ నభోంతరాళ క్షపానాథులును శ్రీమద్వత్సవాయవంశపయఃపారావారరాకాసుధాకరులు నగు శ్రీశ్రీ రాజా వేంకట సింహాద్రి జగపతి రాజాబహద్దరు మహారాజావారి ప్రోత్సాహంబుచేతను నేనింతటి సాహసంబూనరించి దైవానుగ్రహంబువలనను సుహృదోత్తములగు సుధీమణుల వత్సలత్వంబువలనను ప్రభువాల్లభ్య లక్ష్మీప్రసాదంబువలనను కృతకృత్యుండ నైతిని. మఱియు లేఖికప్రమాద జనితంబులగు కొన్నియు ముద్రణప్రభూతంబులగు కొన్నియు దోషంబు లీగ్రంథంబున నచ్చటచ్చటఁ గాన్పించవచ్చును. వానినెల్ల వత్సలభావంబున సరిచూచి తెలిపినచో రెండవకూర్పునందైన సవరణఁ జేసికొందునని కవితాపోషకులగు విద్వన్మహాజనులను వినయపూర్వకముగఁ బ్రార్థించుచు నింతటితో విరమించుచున్నాఁడను.

ఈనాటకమాడగోరువారికి పాత్తమందలి ప్రస్తావనలో చుక్కలుగల భాగములను మానవచ్చును.

తుని
గోదావరిజిల్లా
18-మార్చి 1911 సంII రం.

ఇట్లు
విబుధజనవిధేయుఁడు
హోతా. వేంకటకృష్ణయ్య.

## ఈ నాటకములో వచ్చు ముఖ్యపాత్రములు.

### పురుషులు.

ప్రద్యుమ్నుఁడు—శ్రీకృష్ణునికుమారుఁడు. (కథానాయకుఁడు)
శ్రీకృష్ణుఁడు— ప్రద్యుమ్నునితండ్రి.
ఇంద్రుఁడు— నాకాధిపతి.
గదుఁడు, సాంబుఁడు. } ప్రద్యుమ్నునిసోదరులు.
వజ్రనాభుఁడు— రాక్షసులఱేఁడు. (ప్రభావతితండ్రి)
రోమంధసుఁడు. తామ్రాక్షుడు. కఠోరదంష్ట్రుడు. } ఈముగ్గురు వజ్రనాభునిమంత్రులు.
యజ్ఞేశ్వరసోమయాజులు. అగ్నిహోత్రచయనులు. } ఈ యిద్దరు బ్రాహ్మణులు.
భద్రుఁడు—అంతర్నాటికావేషుండగుప్రద్యుమ్నుఁడు.
అసితాంగుఁడు—అంతర్నాటికావేషుండగు శ్రీకృష్ణుఁడు.
అనేకాక్షుఁడు—అంతర్నాటికావేషుండగు నింద్రుఁడు.

### స్త్రీలు.

ప్రభావతి—వజ్రనాభునికొమరిత (కథానాయకురాలు)
రాగవల్లరి—ప్రభావతిచెలికత్తియ.
శుచిముఖి—{ దేవకార్యార్థినియు కామరూపిణియునగు హంసనారి (ప్రభావతిచెలికత్తియ)

---

# శుద్ధపట్టిక.

ఈగ్రంథముఁ జదువుటకుఁ బూర్వ మీక్రిందిసవరణలు చేసికొనఁ జదువరులు ప్రార్థితులు.

| పుట | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 3 | 21 | కమనీయంబగు... దివ్యతర | కమనీయోగ్రగదాయుధంబువర |
| 11 | 15 | అలరిశ్రీ... బనెడుసాధ్వి | పణతిశ్రీ... బయనుసాధ్వి |
| 12 | 5 | శ్రితచకోరికల | శ్రితచకోరముల |
| ,, | 7 | కుమత...రము | కుమతి...రము |
| 13 | 6 | ద్రాంబాసతీరత్నముల్ | ద్రశ్రీసతీరత్నమున్ |
| ,, | 7 | సతీమణులనన్ | సతీమణియునా |
| 16 | 23 | భాగ్యోదయులన | భాగ్యోదయులగు |
| ,, | 24 | దమోదళితైక | తమోదళనైక |
| 17 | 7 | మరీచీనీరాజిత | మరీచినీరాజిత |
| 23 | 17 | నాలోజించి | నాలోచించి |
| 24 | 8 | మొల్లములమల్లియల | మల్లికలమొల్లముల |
| 26 | 14 | అనేకసార్లు | పెక్కుసార్లు |
| 32 | 6 | నీనేమంటివి | నీవేమంటివి |
| 41 | 8 | యేణంబోలేకయేణాక్షి | యేణంబొక్కయేణాక్షి |
| 43 | 9 | జీవచిత్తురుపెట్టిదో | జీవచిత్రమదెట్టిదో |
| 53 | 27 | కానరాఁడాతఁడెం | యతండిప్పుడెం |
| 58 | 15 | నీకువాదాచెలి | నీకువాదాచెలీ |
| ,, | 27 | నిలికులవేణుల | నలికులవేణుల |
| 60 | 26 | కోలీ | కోమలీ |
| 63 | 21 | పు ♦ ప్షమ్మెయయ్యుఁ | పు ♦ ష్పమ్మెయయ్యుఁ |
| 64 | 20 | పలువిధ | బహువిధ |
| 135 | 10 | సోమశరణ్యుఁడన్ | స్తోమశరణ్యుఁడన్ |
| 144 | 8 | గావించితిని | గాంచితిని |

గ్రంథకర్తయగు

## బ్రహ్మశ్రీ, హోతా వేంకటకృష్ణయ్యగారు.



చ. నెరవరి హోత్రువంశజుఁడు ◆ వేంకటరత్నతపఃఫలంబు న
బ్బురముఁగ వేంకమాంబయను ◆ బుట్టిన పుత్రుఁడు దిక్తటంబులన్
విరివిగఁ గీర్తిఁగాంచినవి◆వేకియు వేంకటకృష్ణసత్కవీ
శ్వరుఁ డితఁ డెల్లచోఁ బొలుచు ◆ సారవచోవిభవాభిరాముఁడై.



శ్రీరస్తు.

శ్రీహయగ్రీవాయ నమః.

శుభమస్తు - అవిఘ్నమస్తు.

# ప్రభావతీప్రద్యుమ్నము.

## దేవతారాధనపూర్వకకృతిపతిప్రశంసనము.



సంప్రాప్తికిఁ గూర్మమై నిలిపి యద్రిన్ క్షీరవార్ధిన్ సుధా
గ్రాసంబున్ గలిగించి సర్వవిబుధవ్రాతంబుఁ బాలింప ను
ల్లాసంబందు రమామనోహరుఁడు లీల న్వత్సవాయాన్వయ
శ్రీసింహాద్రిజగత్పతీంద్రునకిడున్ శ్రీభోగభాగ్యోన్నతుల్.

మ. గిరిజార్ధాంగతటిద్ద్యుతిన్ శిరముపైఁ గ్రీడించుగంగాఝరీ
స్ఫురితధ్వానవిశేషగర్జనలఁ బెంపుం జెందుశర్వాంబుదం
బురుకారుణ్యసువృష్టిసత్సనయనంశోద్భాసి సింహాద్రిభూ
వరువాంఛాంకురము ల్ఫలింప నిడు నైశ్వర్యంబు సత్కీర్తులన్.

మ. గరిమ న్నాలుగుమోముల న్నిగమ ముత్కంఠ న్పఠింపంగ బం
గరపుస్వీణియ మీటు భారతి నిజాంకంబందునిల్వంగ స
త్కరుణన్ సర్వచరాచరప్రథితలోకస్ఫూర్తి నాబ్రహ్మను
స్థిరత న్వర్ధిల శ్రీజగత్పతి కిడున్ దీర్ఘాయురారోగ్యముల్.

సీ. చలిమలయల్లుని వలపించునాజగ
న్మోహను నలరించుముద్దుగుమ్మ
నెత్తమ్మిగద్దియ నెలవైననెఱజాణ
కడలినోములపంట గౌరిదంట

జాబిల్లి సైదోడు సరసంపుగోనముల
కలికి పూవిల్తునిఁ గన్నతల్లి
కలుషము లడఁగించు చెలి నల్వజనని
పున్నెములకు గనియైన నెలఁతమిన్న

గీ. కులుకుకొమ్మించుజిగిడాలు గలవలంతి
రదనజితకుందపఙ్క్తి సంపదలదాంతి
యనిశమును వత్సవాయసింహాద్రిజగప
తీంద్రుసదనంబున న్వసియించుఁగాత.

సీ. తారకాసురునిసంహారార్థ మొనఁగూడె
నేదేవికిని గుమారోదయంబు
దగ్ధుఁడై నట్టిచిత్తజుజీవ మిడి రతీ
భామ కేదేవి సౌభాగ్య మొసఁగె
మహిషదానవనాథు మర్దించి యేదేవి
దేవతావళిబాధఁ దీర్పఁ గలిగె
కినియ గంగను శిరంబున నిల్పఁగా నిచ్చె
నేదేవి కర్ధాంగ మీశ్వరుండు

గీ. అట్టిమృత్యుంజయునిరాణి యబ్జపాణి
దృగ్వినిర్జితచకితైణి దివ్య మధుర
వాణి యలివేణి సైకతశ్రోణి యెపుడు
జయము భద్రంబు మత్కృతిస్వామి కొసఁగు.

చ. అతుల కలాకలాపయుత యై విబుధప్రమదాప్తి వల్లకీ
గతుల ఘటింప రమ్యముగ గానము సల్పుచు నంచతత్తడిన్
గుతుకముతో మనోవిభునిఁ గూడి చరించెడుశారదాంబ యీ
కృతి ననవద్యలీల వెలయింపఁగ నా రసన న్వసించుతన్.

క. శాంతుఁ దాంతుఁ బుణ్యాసు
ఖాంతుఁ సుజ్ఞానవిదళితాజ్ఞానోగ్ర

ధ్వాంతున్ మత్కృతిపతికిన్
జింతల నెడఁబాప నాదిశేషు భజింతున్.

చ. ప్రమథగణంబుత న్గొలువఁ బార్వతియున్ బరమేశ్వరుండుఁ బా
ర్శ్వములనెసంగ ముద్దుగొలుపన్ రజితాచలమందు సర్వలో
కములకుశోభనమ్ములిడఁగా నటనమ్మొనరించుసామి యా
విమలగజాస్యుఁ డీకృతి నవిఘ్నము గా నెరవేర్చుఁ గావుతన్.

చ. పొలసులదిండి మబ్బులడపుంబెనుగాలిగ నబ్ధిదాటి దు
ర్గలితపులంకఁ జొచ్చి రఘురాముని ముద్రిక నిచ్చి సీతకున్
దెలివిఁ దొలంగ లక్ష్మణుమ్మృతిం గనకుండఁగఁ జేసినట్టిని
ర్మలుఁడతిశాంతుఁడౌచు హనుమంతుఁడు మత్కృతిభర్త నేలుతన్.

క. జననీదాస్యము నీఁగఁగఁ
జని వజ్రిని గెలిచి యమృతసంగ్రహుఁడై వి
ష్ణునివాహన మగుగరుడుని
ననయముఁ గృతిపతియఘంబు లడఁప భజింతున్.

క. ధీరోదారున్ బార్వతి
గారాబుకుమారు శూరుఁ గ్రౌంచవిదారున్
దూరీకృతకల్మషవి
స్తారున్ గృతిపతికిఁ బౌరుషం బిడఁ గొల్తున్.

మ. క్రమమై నందకమున్ సుదర్శనము సత్కౌమోదకీపాంచజ
న్యములున్ శార్ఙ్గము నాగనొప్పు హరియుద్యత్ఖడ్గమున్ జక్రమున్
గమనీయంబగుకంబు దివ్యతరశంఖంబున్ ధనస్సున్ సదా
ప్రమదంబొప్పఁగ సింహగోత్రధరణీపాలున్ గృపన్ బ్రోచుతన్.

సీ. జలధికుమారి కుచమ్ముల యన నురమందు
వనమాలయై గ్రాలు వైజయంతి
కౌస్తుభ వనమాలికల క్రింద సిరిబొట్టు
లా గొప్పు శ్రీవత్సలాంఛనంబు

బృందాటవిని గోపబృందంబు నలరింప
గారవించెడు మురళీరవంబు
నీలమేఘంబున క్రాలుక్రొమ్మించన
హరిమేన మెఱయు పీతాంబరంబు

గీ. మానితంబుగ వర్షావసానమందు
తరణిరుచిఁగల్గు నాయింద్రధను వనంగ
నలరు వెన్నుని బర్హిబర్హంబు నోలి
నొసఁగుఁ గృతిపతికిని శుభాభ్యుదయములను.

ఉ. జీవనముం గ్రహింపుచును జీవనమిచ్చుచు జీవకోటికిన్
జీవనజంబులో వెలయు శ్రీఁ గృతిభర్తగృహంబునందు స
ద్భావముతోడనిల్ప దళితంబుగఁ జేయుచుఁ దన్మరందసం
భావన షట్పదంబులఁ గృపన్ దనియించురవిన్ దలంచెదన్.

మ. భువనాహ్లాదకరుండు షోడశకళాపూర్ణుం డుమానాథమా
ళివిహారుండును దక్షపుత్రికలఁ బాలింగూడు బృందారక
ప్రవదాన్యుండు నపారదుగ్ధజలధిప్రాంచత్కుమారుండు కై
రవమిత్రుం డమృతాంశు మత్కృతిపతిన్ రంజిల్లఁగాఁ జేయుతన్.

గీ. సర్వభక్షకుఁ డయ్యు నిచ్చలును బరమ
శుచి యనఁ జరాచరముల విశుద్ధ తేజ
మున వెలుఁగు భూతమయుఁడుఁ బావనుఁడుఁ గర్మ
సాక్షి మత్కృతిపతిపాపసమితి నేర్చు.

ఉ. భూనుతపావనుం డఖిలభూతమయుండు నదృశ్యమూర్తి స
న్మానితలీల జీవుల కనారతముం శరణంబు నా జగ
త్ప్రాణుఁడు వాయుదేవుఁడు మహాబలుఁడై తునిరాజ్యశోభితా
స్థానుని మత్కృతీశు జవసత్వసమన్వితుఁ గా నొనర్చుతన్.

క. పుణ్యుఁడు భువనారాధ్యుఁడు
ధన్యాత్ముఁడు దేవతావదాన్యుండగు ప

ర్జన్యుఁడు మత్కృతిపతికి న
గణ్యకృపావృష్టిఫలసుఖంబు లొసంగున్.

ఉ. దేవభిషగ్వరుల్పరమదివ్యచరిత్రులుఁ బుణ్యలోకసం
భావితమూర్తు లార్తజనబంధులు గుంతిసపత్నిమాద్రి మున్
భావనఁ జేయఁబుత్రులఁ గృపం దయచేసినపూజ్యు లశ్వినీ
దేవత లెప్డుశ్రీజగపతిన్ సుఖిగా విలసిల్లఁ జేయుతన్.

ఉ. వింతచికిత్సలం దనరి వేల్పులఁగావఁ బయోధిఁబుట్టి భూ
కాంతుఁ బరీక్షితుం గవఁగాఁ జనుతక్షకు నాత్మనైపుణిన్
గొంతఁ గనంగఁ జేసినయకుంఠితవైద్యవిశారదుండు ధ
న్వంతరి మత్కృతిప్రభుని వైద్యమునం సహకారిగావుతన్.

శా. వేదోల్లాసులు సిద్ధసాధ్యులమరుల్ విద్యాధరుల్ కిన్నరుల్
మోదంబార మహర్షిసంఘముతపోముఖ్యుల్మునుల్యోగులున్
బ్రోదిన్వేంకటసింహగోత్రపతికిం బూర్ణప్రభావంబు సు
శ్రీదీర్ఘాయురభీష్టముల్ కలుగనాశీర్వాదముల్ సేయుతన్.

ఉ. ప్రాకటయోగదర్పణవిరాజితరామచరిత్రమెల్ల న
స్తోకమనీషసాంస్కృతికశోభితకావ్యముఁగా రచించి సు
శ్లోకతసృష్టిఁ జేసెను విశుద్ధగతిం గవితాకుమారివా
ల్మీకి నుతింతు సద్గుణసమేతుని నాదికవీంద్రు భక్తిమై.

క. వ్యాసుని యోగాభ్యుదయవి
లాసుఁ బురాణేతిహాసలక్షణకవితా
భ్యాసుని సద్బుధహృదయని
వాసు నవిద్యాంధకారభాస్కరుఁదలఁతున్.

ఉ. సారవచోవిశుద్ధికయి సంస్కృతసత్కవి భారతీవరుల్
భారవి మాఘు బాణు శివభద్రు మయూరునిఁ గాళిదాసునిన్
భూరిసుధీసమేతు భవభూతిని దండిని హీరు మల్హణున్
జోరుని శంకరాదుల విశుద్ధమనీషుల సంస్మరించెదన్.

ఉ. సన్నుతిఁ జేయుదుం గవనచాతురి కాంధ్రకవీంద్రకోటి న
భ్యున్నతి సద్యశస్తనుసముజ్జ్వలవర్తుల సచ్చరిత్రులన్
నన్నయ శంభుదాసు సిరినాథునిఁ దిక్కనసోమయాజిఁ బో
తన్నను సోమనాథుని ముదమ్మున భాస్కరమంత్రిముఖ్యులన్.

సీ. ధర నాంధ్రకవితాపితామహుం డనుపేర
విలసిల్లునలసాన పెద్దనార్యు
శ్లేషార్థకలితవిశేషసత్కవితాప్ర
భావంబుచే మించుభట్టుమూర్తి
కిసలయమృదులసాంద్రసయుక్తసత్కావ్య
మహితుఁ డౌముక్కుతిమ్మనకవీంద్రుఁ
బాండురంగాధ్యక్షుపదభక్తి శోభిల్లి
కీర్తిఁగాంచినరామకృష్ణసుకవి

గీ. భూరిగుణధుర్యుఁ బింగళి సూరనార్యుఁ
బ్రౌఢకవి ధూర్జటిని రామభద్రుఁ గీర్తిఁ
గన్నపిల్లలమఱ్ఱివీరన్న విశ్వ
నాధకవి నెంతు శేముషీసాధనముగ.

ఉ. పేరిమిఁ గంధగంధము వివేకము లేక పరార్థసంగ్రహా
స్ఫారకవిత్వవైఖరుల సల్పుచుఁ గబ్బము లెన్ని యేనహం
కారమునన్వివాదములఁ గల్పనఁ జేసికవీంద్రకోటికిన్
భూరియశంబుఁ బెంచు కుకవుల్పరమాప్తులటంచు నెంచెదన్.

క. దోషోదక మేదుచు గుణ
శేషక్షీరంబుగొనుచు శేముషి భాషా
యోషామణి హితులైన మ
నీషాసత్కవిమరాళనికరముఁ దలఁతున్.

క. శాంతుఁడు ధీనిధి కరుణా
స్వాంతుండ సద్గురుండు సరసుఁ డవిద్యా

ధ్వాంతప్రభాకరుండగు
పంతుల శ్రీరామశాస్త్రి భక్తినుతింతున్.

క. అని యిష్టదేవతావం
దనము సుకవిలోకపూజనముఁ గుకవిజనం
బును నిందసలిపి గురుపద
వనజంబుల కెరగి భక్తిపరవశలీలన్.

వ. నే నొక్కనాఁడు సుఖాసీనుండనై యాత్మగతంబుగ.

ఉ. పాంచభౌతికంబు క్షణభంగురముల్ జలబుద్బుదంబు జీ
వించు నశాశ్వతంబుగ నశించును దేహ మొకప్పుడెప్పుడో
గాంచి బుధుండు సత్కృతిముఖంబునఁ బొల్చినఁ గీర్తిచంద్రికా
భ్యంచితమూర్తియై నెగడు నంచుఁదలంచుచు నుండ నత్తఱిన్.

సీ. ఏదానఘనకృపావృష్టిచే నాశ్రితా
భీష్టసస్యము ఫలియించుచుండు
నేత్యాగగుణిమహోదితోదయంబుచే
దారిద్ర్యఘోరసంతమసమడఁగు
నేవితరణచంద్రుఁ డావిర్భవించిన
దీనచకోరాళి తృప్తిఁజెందు
నేవదాన్యసుకల్పవృక్షసమాశ్రయం
బునవనీపకశుకంబులు చెలంగు

గీ. నట్టిమహనీయధవళితాశాంతకీర్తి
చంద్రికాపుంజరంజితోజ్జ్వలవిహారి
యమలశ్రీవత్సవాయవంశాబ్ధిచంద్రుఁ
డైనసింహాద్రిజగపుడుత్యాదరమున.

చ. వినుతమహీసురోత్తములు వేదవినోదులు శాస్త్రపండితుల్
గుణమణిహారులౌనృపులుఁ గోవిదులౌసచివుల్ కవీశ్వరుల్
ఘనులగుగాయకుల్ సఖులుఁ గాలవిదుల్గణికల్ భిషగ్వరుల్

దనుఁగొలువన్సభాస్థలి ముదంబునఁ గూర్చుని చిద్విలాసుఁడై.

వ. నన్ను సగౌరవంబుగ బిలువంబనిచి యర్ఘాసనంబునఁగూర్చుండ నియమించి యఖండవాల్లభ్యలక్ష్మీకటాక్షవీక్షణాసారంబుల నన్నుందేరల్చి సాదరవచోమృతంబు వర్షింపుచు సకలకలుషనివారణంబును శుభవిభవకారణంబును సర్వాభీష్టఫలావాప్తినిదానంబు నగు భవ్యకావ్యాధిపత్యసంపాదనకుతూహలాధీనమానసుండై యిట్లనియె.

ఉ. వీనులవిందుఁగొల్పుటకు శ్రీ వేంకటకృష్ణకవీంద్ర ! సత్తసం
తానములందు నన్నుచితంబుఁగ శాశ్వతకీర్తిలక్ష్మి కా
స్థానము భూరిభవ్యఫలదం బొకసత్కృతి యాటచేత నిం
పౌనొకనాటకంబును మదంకితసత్కథగా రచింపుఁడీ.

వ. మఱియు,

సీ. వరరోహిణీ సుధాకరవిజయమును సం
  ప్రీతిమైమున్ను కల్పించితీవు
దివ్యమై ఖరిద్రాపదీస్వయంవరమును
  బృథ్విపై వెలయ ఘటించితీవు
ప్రౌఢి శశికళాసుభద్రార్జునీయన
  త్ప్రథునాటకముల నిర్మించితీవు
భవ్యప్రభావతీప్రద్యుమ్ననాటకం
  బెలమిమత్కృతిగా రచింపవలయు.

గీ. లలితపల్లవమృదులపేశలమరంద
రససమంచితకవితా విరాజమాన
హారోత్పసద్వంశదుగ్ధపయోధిచంద్ర!
కీర్తిగుణధుర్య! వేంకటకృష్ణయార్య!

చ. అని కొనియాడి నాకు కనకాంబరకంకణరత్నహారవా
హనఘనసారచందనసమంచితవీటికలిచ్చి నెమ్మొగం
బునఁ జిఱునవ్వొలర్పఁగ నపూర్వకృపామతి గౌరవింపఁగా

కొనియుదితుండనై తమినిగుడ్వఁగనిట్లనుకొంటి నాత్మలోన్.

ఉ. భద్రతగంటి వత్సవయవంశపయోబ్ధి సుధాకరుండు సిం
హాద్రిజగత్పతీంద్రుఁ డనఘాత్మకుఁ డర్థిసురద్రుమంబు ని
ర్నిద్రయశోవిహారుఁడు వరించెను నాకృతికన్య నింకసం
పద్రమణీయవైఖరుల వర్ధిలఁగల్గెడఁ దత్కృపాప్తిచేన్.

వ. అని యమందానందకందళితహృత్కుశేశయుండనై నందనందనప దారవిందవందనకృతార్థశీలుండగు శ్రీ రాజా వత్సవాయ వేంకట సింహాద్రిజగత్పతి రాజాబహద్దరు మహారాజునకు నిరంతరాభ్యుదయ పరంపరాభివృద్ధికరంబుఁగాఁ దదీయవంశావతారం బాకించుక యభి వర్ణించెద.

సీ. శ్రీజానినాభిరాజీవమధ్యంబున
ప్రష్ట పుట్టెను జగత్సృష్టికొరకు
విశ్వనిర్మాతకావిర్భవించె మరీచి
యతనికి కశ్యపుండవతరించెఁ
బ్రభవించెఁ గశ్యపబ్రహ్మకు బ్రహ్మాండ
భాండదీపకుఁడగు భాస్కరుండు
వారిజమిత్రుండు వైవస్వతునిగాంచెఁ
గనియెవైవస్వత మనువు సుతుల

గీ. దత్కు నిక్ష్వాకునృపుని దద్వంశమునను
బొడమిరి కకుత్స్థుఁడును రఘుపుంగవుండు
దశరథుఁడునాత్మతీయభూధవునకొదవె
రాముఁడుగుణాభిరాముఁ డుద్దామయశుఁడు.

వ. ఏతాదృశమహాపురుషభూషితంబైన సూర్యాన్వయంబున వత్సవాయ వంశంబు క్రమంబుగ సుప్రసిద్ధంబయ్యె నందు.

ఉ. శ్రీకమనీయసద్గుణవిశిష్టమహోన్నతవత్సవాయస
త్ప్రాకటవంశవార్ధిశశిభాసురసాధ్విని సీతయాంబ న

స్తోకతఁ బెండ్లియాడి పరిశుద్ధయశఃపటలప్రసాధితా
శాకలితుండునా నెగడె శక్రసమానుఁడు జోగిరాజిలన్

చ. వరగుణుఁడైన జోగి నరపాలున కుజ్వలసీతయాంబకున్
స్ఫురదకళంకరూపజితపుష్పశరుండు కుమారరత్న మ
బ్బురముగఁ బుట్టి సద్గుణవిభూతిఁ దలిర్పఁగ నచ్చయాంబన
త్కరము గ్రహించి యేలెను ముదంబున సూరపరాజు ధారుణిన్.

క. ఆవరదంపతులకు ల
క్ష్మీవిష్ణులకొదవినట్టి చిత్తజుఁడనఁగా
నావిర్భవించె జనులను
గావ జగన్నాథరాడ్జగతీంద్రుఁ డిలన్.

సీ. సర్వసర్వంసహాధూర్వహోన్నతభుజో
త్సాహపాలితధర్మసంగ్రహుండు
ననుపమగుణరత్నహారభూషితతనూ
రమ్యసౌందర్యవిభ్రాజితుండు
పరగండభైరవస్ఫురసంగరాభీల
పటువిక్రమార్జితభద్రయశుఁడు
భోగభాగ్యోదయస్ఫూర్తిధిక్కృతపురం
దరవైభవశ్రీవిధానచణుఁడు

గీ. నిఖిలభూతదయాన్విత నిత్యసత్య
వర్తనరతుండు శ్రీవత్సవాయవంశ
జలనిధిసుధాంశుఁ డీమహీచక్రమేలె
నందితాత్ముండు శ్రీజగన్నాథశౌరి

క. ఆధరణీజాని జగ
న్నాథనృపాగ్రణి ప్రియంబునన్ గైకొనె సా
ధ్వీధర్మలసితసుగుణా
రాధితరాజ్ఞాసుభద్రరాడ్వంశమణిన్.

ఉ. శ్రీయుతు లాసతీపతులు చేరిరమాచ్యుతులో యనన్ రతీ
కాయజులట్లనిత్యమునఖండ పరస్పరరాగ పూర్ణులై
వేయివిధంబులన్మెలఁగి విశ్రుత సద్గుణవర్తి సూర్యనా
రాయణరాణ్మహీపతివి రాజితకీర్తిని గాంచి రింపుఁగన్,

మ. విభవప్రోద్దాముఁడు సద్వదాన్యుఁడుఁ గళా విస్ఫారతన్ భోజస
న్నిభకీర్తి ప్రభవిష్ణుఁడై యతుల నిర్నిద్రప్రభావాఢ్యుఁడై
సభలందున్నతికెక్కు వత్సవయ రాజాసూర్యనారాయణ
ప్రభుఁ డీక్ష్మాతలమేలె నింద్రునిబలెన్ ప్రావీణ్య మేపారఁ గన్.

మ. జగతిన్ బ్రస్తుతిగన్న సాధ్వియగురాజాబుచ్చి సీతయ్య డం
బుగ శ్రీసూర్యనరాయణాధిపునిసమ్మోదంబున న్గూడుచున్
సుగుణోల్లాసినియైకనెన్ సుతుల శ్రీజోగిజగన్నాధరా
డ్జగపు న్వేంకటసింహాగోత్రధరణీజాని న్బహద్దర్మణిన్.

వ. అందు

గీ. ప్రబలి జోగిజగన్నాధరాజవాళి
యలరి శ్రీబుచ్చిరామయాంబనెడు సాధ్వి
వేంకటసుభద్రయాంబను పెండ్లియాడి
యేలి పదునాల్గునెలలిల నేగెదివికి.

సీ. అభ్యాగతులకు మృష్టాన్నసత్రములుంచి
ధరపై వెలయుసురసురభియనఁగ
హాళికులకుజీవనాధారమగుకృపా
ఖండవృష్టినొసంగు ఘనుఁడనంగ
విద్యార్థులకుఁ గలావిఖ్యాతికై పాఠ
శాల నిల్పినకల్పసాలమనఁగ
దుష్టుల శిక్షించి శిష్టుల రక్షింపఁ
బృథ్విరంజిలుమహావిష్ణువనఁగ

గీ. నక్షయఖ్యాతి గుణరీతి నతిశయించు

వత్సవయవంశదుగ్ధాబ్ధివనజవైరి
సత్యశీలుఁడు సింహాద్రిజగపతీంద్ర
రాజబిరుదాంకుఁడగు మహారాజశౌరి.

సీ. వత్సవాయాన్వయ వార్ధినుప్పొంగించి
శ్రితచకోరికల రక్షించి మించి
బంధుమానస కైరవము తెలర్పఁగఁజేసి
కుమతచిత్తాంధకారముఁ నడంచి
ఖలులహృదబ్జ వికాసంబుఁ దొలఁగించి
నతలోకదైన్యసంతాప ముడిపి
సకలజనాహ్లాదసంపాదన మొనర్చి
దిశలెల్లఁ గీర్తిచంద్రికల నించి

గీ. సత్పథంబున మెలఁగి నక్షత్రము లన
దనరు వేంకట శ్రీసుభద్రయ్యసాధ్వి
పరమకల్యాణి రాజా సుభద్రయాంబ
రమణ పెండ్లాడె సింహాద్రిరాడ్వ్విభుండు

సీ. సింహాద్రిజగపతిఁ జేరినలక్ష్మినాఁ
దనరు వేంకటసుభద్రయ్యగారు
ఘనవత్సవాయ నందనకల్పకంబు నాఁ
దనరు వేంకటసుభద్రయ్యగారు
పూనికాశీయన్నపూర్ణ యిందుండెనాఁ
దనరు వేంకటసుభద్రయ్యగారు
దివినొప్పు కామధేనువు మహి నిల్చెనాఁ
దనరు వేంకటసుభద్రయ్యగారు

గీ. దివ్యగుణవల్లి పరమసాధ్వీమతల్లి
దంతులూరికులాబ్ధి నుద్భవముఁ జెంది
తునిమహారాజ్ఞియై కీర్తిఁగని వెలుంగు

ధరను వేంకటశ్రీసుభద్రయ్యగారు.

తే.గీ. పావనసుశీల రాజా సుభద్రయాంబ
యవని శ్రీవేంకటసుభద్రయాంబతోడ
ఛాయపోలిక సింహాద్రిజగపతిప్ర
తాపమార్తాండుఁగొలుచుచుఁ దనరుచుండు.

శా. రాజా వేంకట శ్రీ సుభద్రయు సుభద్రాంబాసతీరత్నముల్
రాజీవాలయభూసతీమణు లనఁ రాజిల్ల వైకుంఠ వి
భ్రాజిష్ణుం డగువిష్ణువోలె ధనసంపత్పుత్రపౌత్రాప్తిచే
సౌజన్యోన్నతకీర్తి వర్ధిలు గృతీశస్వామి యెల్లప్పుడున్.

క. అని మత్కృతిపతివంశముఁ
గొనియాడి యొకింత శక్తికొలఁది నిఁకను నే
నొనరించెదఁ దద్విభునకు
జను లెల్ల నుతింపఁదగిన షష్ఠ్యంతంబుల్.

షష్ఠ్యంతములు.

క. ఏతాదృశగుణఖనికిన్
బూతచరిత్రునకుఁ బరమభూతదయాసం
జాతమహాఖ్యాతిజయో
పేతఖగస్థంభునకు సువృత్తరతునకున్.

క. అరినికరానిలదర్వీ
కరునకు నిజవితరణప్రకంపితశిబిభా
స్కరసుతదధీచిసురతరు
వరజీమూతునకుఁ బుణ్యవర్ధిష్ణునకున్.

క. పరధనపరదారోత్సవ
పరాఙ్ముఖున కఘతమఃప్రభాకరునకు మే
దురసత్యశీలునకును
స్థిరధర్మాత్మునకు బంధుచింతామణికిన్.

క. ఘోటకగజశిక్షణవి
స్ఫోటభిషక్శిల్పిరత్నశోధనముఖవి
ద్యాటోప చరితునకునా
ఖేటవిహారోన్నతున కకిల్బిషమతికిన్.

క. అమితసదాచారునకున్
బ్రముదితకవికోటివినుతప్రావీణ్యునకున్
గమనీయగుణకదంబున
కమలశ్రీ కలితతుని మహారాజునకున్.

క. అద్రి సమధీరునకు ని
ర్నిద్రజయాభ్యుదయవర్ణనీయనృపున క
క్షుద్ర ప్రతాపనిధికి సు
భద్రాంతః కరణనిత్యభావనఘృణికిన్.

క. శ్రీవత్సవాయవంశసు
ధావార్ధిపూర్ణిమాసుధాకరునకు స
ద్భావున కకుటిలకర్షక
జీవనసంధానసుప్రసిద్ధచణునకున్.

క. పంకవిదూరన కాశ్రిత
సంకటహరణునకు నిఖిలశరణాగతని
శ్శంకావనాంకునకు శ్రీ
వేంకటసింహాద్రిరాడ్పవిత్రయశునకున్.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధియగునట్లుగా నా రచియింపంబూనిన ప్ర
భావతీప్రద్యుమ్నంబను నాటకరాజంబునకు నాందిప్రస్తావనాసమంచి
తంబగు కథాక్రమం బెట్టిదనిన.

—:o:—



శ్రీరస్తు.

శ్రీహయగ్రీవాయ నమః.

# ప్రభావతీప్రద్యుమ్నము.

నాంది



సల్లాపము లొప్పఁ బుణ్యజనులన్ జింతించి లోకంబు ల
త్యాసక్తి న్వెలయించి మించి ముదమందన్ వత్సవాయాన్వయ
శ్రీసింహాద్రి జగత్పతీంద్రునకు నక్షీణాయురారోగ్యల
క్ష్మీసత్కీర్తు లొసంగు శౌరి మిము రక్షించున్ గటాక్షంబునన్

మ. సుమనఃపుంజరతిన్వినోదగతులన్ శుద్ధాంతసీమంతినీ
విమలాంతఃకరణంబులం గలఁచుచున్విభ్రాంతుల న్బాంధలో
కముఁ దూలించి జగత్పతీంద్రునిహసౌఖ్యశ్రేణి రంజించు ను
త్తముఁ బ్రద్యుమ్నునిఁ గన్నతండ్రి హరి నిత్యంబున్ మిమున్ బ్రోచుతన్.

(అని సభ్యులపైఁ బుష్పములు జల్లుచున్నాఁడు.)

ఇట్లు నాంది యైన తరువాత.

## ప్రస్తావన.

సూత్ర:—(నల్వలంకులఁ గలయఁ జూచి సంతోషముతో) ఓహో! నేఁడీప్రదేశ మెంత మహోల్లాసకరంబుగ విరాజిల్లుచున్నయది!

* సీ. ఒకచెంత నతికాంతవికచకాచవిశేష
పాత్రలదీపికల్ ప్రజ్వలింప
నొకవంక నకలంకశుకపికకలకలం
బన సభాసదులభాషణము లొలయ

నొకచాయఁ గమనీయ ఽ సకలతంత్రి మృదంగ
గాయక గాయకీ ఽ గాన మెసఁగ
నొకయోరఁ దనివారఁ ఽ బ్రకటచిత్రితచిత్ర
వితతి నేపథ్యముల్ ఽ వ్రేలుచుండ

* గీ. నెచటఁ గనుఁగొన మదిహర్ష ఽ మినుమడింప
విపులకవిగురు బుధరాజ ఽ వితతి తోడ
స్వర్గపతివోలె సింహాద్రి ఽ జగపతీంద్రుఁ
డలర రంగస్థలము దివి ఽ యన వెలుంగు.

(అని సంభ్రమంబుఁగ) ఏమిచెపుదు! నా ప్రియురాలు రమ్మనిచెప్పిన నింకను రాక యాలస్యము చేయుచున్నది. ఇంతదనుక నలంకరించుకొనుట కానేలేదు కాఁబోలు. సరిసరి, "చీరసింగారించుకొనేసరి కూరుమ్మాటుపడఁగె" నన్నటులఁ జేయునేమో కదా. కార్యార్థు లగుదురేని బరస్పరానురాగపూర్ణులైన నాయికానాయకులకు క్షణమాత్రవియోగంబైనను దుర్భరంబె.

మ. మతిచాంచల్యము గొల్పుధైర్య మణచు ఽ న్మానంబుఁ దూలించు సం
తతమున్ మైమఱుపొందఁజేయు ననువెం ఽ దన్ గూర్చుచు న్వేషముల్
రతిచేకూరఁగ కాలుగాలిన బిడా ఽ లంబుంబలెన్ ద్రిప్పు న
ద్భుతలీలం గనుగప్పునే విబుధుఁ బ్ర ఽ ద్యుమ్నప్రభావం బహో!

(అని స్మృతినభినయించి) అన్నా! నే ప్రియాసందర్శనాధీనమానసుండనై ప్రస్తుతకరణీయంబును మఱచితిని. సకలకలాకోవిదవిద్వజ్జనసందోహబంధురంబైన యీసభామందిరంబున.

* సీ. నిఖిలాగమామ్నాయ ఽ నిపుణులై వెలయు భూ
త్రిదశులౌ పరమశ్రో ఽ త్రియులతోఁడ
కువలయానందభా ఽ గ్యోదయులనఁదమో
దళితైకరాజబృం ఽ దంబుతోఁడ
సకలకలారహ ఽ స్యవిశారదానేక
కవిగురుపండిత ఽ గణము తోఁడ

పూజ్యసామ్రాజ్యవిభూతి నిజామాత్య
ఘనభటభృత్యవర్గంబుతోడ
సీ. తారకావళిమధ్య సుధాకరుండు
వరలుకైవడి శ్రీ వత్సవాయవంశ
జలధిచంద్రుండు సింహాద్రిజగపతీంద్రుఁ
డొనరఁగూర్చుండెఁ దీర్చి పేరోలగంబు.

* కాని నిఖిలనరపాలమకుటమాణిక్యమరీచీనీరాజితపాదపంకేరుహుం డగుని మహారాజుమ్రోల,

ఉ. గౌరవగానకోవిదపికంబుల వేదసుధీమదాళులన్
సారమనీషులన్ సలిలజప్రకరంబుల నాటకాద్యలం
కారరసజ్ఞహంసలను గ్రాలు సభారమణీయదివ్యకా
సారమునందు నే నెటు విసారమునై విహరింపనేర్తునో.

* నే నిపు డేనాటక మిటఁ బ్రదర్శించి కోవిదులగు నీ యార్యమిశ్రులను రంజింపఁ గలుగుదునో తోచరాకున్నది. (అని యాకసమువంక తనకర్ణంబు నునిచి) ఆఁ! కుశీలవ! ఏమనుచుంటివి?

"నాటక ప్రదర్శనకలాకుశలుండవగు నీవలన నిదివరలో రోహిణీసుధాకరవిజయము, ద్రౌపదీస్వయంవరము, శశికళాసుదర్శనము, సుభద్రార్జునీయము మున్నగు శృంగారనాటకంబుల రచియించి వన్నెవాసిఁగని విరాజిల్లు సరసకవికృతంబును మృదుమధురసూక్తిముక్తాఫలగ్రథితంబునగు నాటకాలంకారంబునుఁ గన మహారాజుగారు త్వరపడుచున్నారు. కావున శీఘ్రం బద్దానిఁ బ్రదర్శింపుము"

అనియా? సరే. నేను నాప్రయత్నములోనే యున్నవాఁడను. (అని తనలో)

చ. కుముదినికిన్ వికాసమునుఁ గూర్పఁగఁ జాలునె చంద్రికాసహా
యమువనుగాక చంద్రుఁ డనయంబును తావినిఁగూడిగాక పు
ష్పము జనపాళిచిత్తముల భాసిలఁ జేయునె నే నటీసహా
యమువనుగాక సభ్యులగు నార్యుల నెట్లలరింతు నొంటిఁగన్.

(అని ప్రకాశముగా) నటీ! నటీ! నీవు శృంగారించుకొనుట యైనపక్షమున శీఘ్రముగ నిటురమ్ము.

[అంత నటి ప్రవేశించి]

నటి—(సూత్రధారుని సమీపించి) ఆర్యపుత్రా! నమస్కారము. (అని యభివందనం
చరించి) మీరు న న్నెందుకొరకై పిలిచితిరి?

సూత్ర—ప్రియురాలా!

ఉ. ఆమని గండుకోయిల లహర్నిశముం బ్రియురాండ్రఁ బిల్వవే
కోమలి! ధీప్రసూన బుధకుంజముల న్విలసిల్లు నీ మహో
ద్దామసభావనంబున ముదంబు ఘటింపఁగ నే పికంబ నై
ప్రేమను నిన్నుఁబిల్చితిని ప్రేయసి! నాదగుకోర్కె తీరఁగన్.

* ముందుగ నీ వీ యతిరమణీయమగు సభాభవన మవలోకింపుము. అందు,

* ఉ. భద్రగుణప్రకీర్ణుఁ డనవద్యయశోమణిహారుఁ డర్థికి
ల్పద్రుమ మాశ్రితావనకృపాపరతంత్రుఁడు ధర్మమార్గని
ర్నిద్రరతుండు వత్సవయనిర్మలవంశవిభూషణుండు సిం
హాద్రిజగత్పతీంద్రుఁ డహహా! మహారాజ దె వెల్గు చూచితే.

* నటి—(సహర్షయై) ఓహో! ప్రాణేశ్వరా! నేడుకదా మనముధన్యులమైతిమి.

* సీ. ఇతఁడె కోస్థాంరాజ్య మేలుచు నసమాన
భూతదయోన్నతఖ్యాతిఁ గాంచె
నీతండె రాజనం బింతైన లేకుండ
నార్తరక్షణపరాయణత మించె
నీతండె సౌజన్యహితుఁడౌచు నౌదార్య
కలన ధర్మనిరూఢి ఘనతఁజెందె
నీతండె కవికోటి నేపారఁబెంచుచుఁ
దనరు సన్మార్గవర్తన సతంబు.

గీ. చేతమలరంగఁ గర్షక జీవనప్ర
దాతయాఘనుఁ డితఁడె యీతండె నుతుల
వెలయుఁ బరధనపరదారవిముఖుఁ డనఁగ
రాజమాత్రుండె సింహాద్రిరాడ్వరుండు.

* మఱియు,

* చ. పవలును రేయిఁ బాంథజనపాళికి నన్నమిడంగ సత్రముం
చి వివిధపక్షిజాలము వసించిసుఖింపఁ గులాయకోటి చే
రువ ఫలవృక్షరాజిని సరోవరమున్ నెలకొల్పె వైద్యుఁడున్
భువిని సమస్తరోగజన పోషకుఁడున్ మహారాజె నాయకా.

* అట్టి నిరుపమానభూతదయాళచిత్తవృత్తుండు భువనైకవదాన్యుండు నగు మహారాజును నేడుకదా మనముకన్నులకఱవుతీరఁ జూడఁగల్గితిమి, ఇంతకన్న సార్థక్య మేమి కలదు? నాథా ! ‡ ఆర్యమిశ్రుల యాజ్ఞ యెట్టిదియో సెలవిచ్చెదరా?

సూత్ర—ప్రియురాలా ! సభాసదులయనుజ్ఞపై * సాంద్రతరయశశ్చంద్రికాప్రసాధితదిగ్విటంకుండగు శ్రీ వేంకట సింహాద్రిజగత్పతీంద్రు నలరింప;

‡ మ. క్షితి శ్రీ వేంకటకృష్ణసత్కవి రచించెన్ దేనినో దేనికిన్
గృతినాథుండు జగత్పతీంద్రుఁడో లతాంగీ! నైపుణిన్ దత్ప్రభా
వతిప్రద్యుమ్నమనంగనాటకము భాస్వత్పండితశ్రేణి రం
జితులై మెచ్చుచు మేల్భళీ యనఁ బ్రదర్శింపంగ నే నెంచితిన్.

నటి—(అశ్చర్యమభినయించుచు) ప్రాణేశ్వరా ! ఎంతదుర్ఘటం బగుకార్యంబుఁ దలఁపెట్టితిరి.

గీ. విపులచంద్రామృతముఁ గ్రోలువిబుధవరుల
కెట్లు దగఁదీర్చుపల్వలం బిట్టిగ్రంథ
సూక్తి నెంతురె పింగళ సూరనార్యు
లలితకవితామృతముఁ గ్రోలులాక్షణికులు.

*సూత్ర—ఓసివెఱ్ఱిదానా! కవితాకన్యకనలంకరించు నలంకారమణులకు శాణమొనర్చి మెఱుఁగిడఁజాలువారు లాక్షణికులేసుమా. అదియునుఁగాక.

* చ. కవి కవితాప్రసక్తియును గాయకుగానము పండితాళి శా
స్త్రవివిధచర్చ శిల్పికళ రత్నపరీక్ష యనేకయంత్రతం
త్రవిధులు వేఁటనేర్పును తురంగగతి ద్వీపఖేలనంబులున్
భువినలరారెడున్ దునివిభుండు కనుంగొనినన్ దళోదరీ.

* మఱియు,

*క. తేనియఁ గ్రోలఁగ దేటులు
నూనములన్ మూఁగురీతి సుమహితబుధు లెం
దైనఁ గవీంద్రకవిత్వా
నూనామృతమానఁ గోరు చుందురు కాదే.

* ఇంతకును నీ కట్టిసందియం బేలకలుగవలయును?

*ఉ. చేరి సకోణకాచమున జీవనజాప్తునిరశ్మి దానశో
భారమణీయత న్వివిధవర్ణములం బ్రభవించుకైవడిన్
భూరిసుధీమయూఖ మిలఁ బూర్ణవికాసఁ గవీంద్రసత్సహ
స్రారముఁ జొచ్చిన న్బలు తెఱంగులరంగులఁ బ్రజ్వలింపదే.

* నటి — నాథా! ఈదృశరూపక ప్రదర్శనంబుచే నెట్టివారలనైన రంజింపవచ్చునుగాని వాచక రోచిక వివేకప్రముఖ సనాతనసాధునాతనగీర్వాణాంధ్రకవిశిరోమణుల కవితామృతంబునుఁ గడుపారఁ ద్రావియున్న సకలకలాకోవిదుండగు నీ మహారాజు నలరించు టెంతయు నసాధ్యంబుకదా. ఏమన,

* చ. తొగదొరచల్వఁ బెర్గొనిన తోరపుమంచుఁ గరంగఁ జేయఁగా
నగు రవికి న్మినుంగురుల కౌనె సనాతనసత్కవీంద్రవా
గ్విగళితమామరందమునఁ బెర్గొనియున్న జగత్పతీంద్రునిన్
జగమున నెంచిచూడ మనకు శక్యమె రంజిలఁ జేయ నాయకా.

సూత్ర — ప్రియురాలా! నీవు ముద్దరాలవగుటచే నట్లు భయంపడుచుంటివేకాని,

చ. శుకపికశారికానికరసూక్తు లనన్ గడుముద్దుమాటలన్
బ్రకటరసప్రకీర్ణమృదుపల్లవకోమలశైలి నొప్పు నా
టకమును జూచి సభ్యు లిచట న్మది రంజిలి మెచ్చకుందురే
వికచపయోరుహానన! వివేకులు సత్కృతిపద్మభృంగముల్.

* ఇదియునుఁగాక,

గీ. ఎన్నిసారులు తెగుచున్న నీప్సితార్థి
యైనసాలీడు తనతంతు లలయ కలమి
మరల నేయుచుఁ దనకోర్కె నెఱపుఁ గాన
కృషివినా కార్యములను సాగింప వశమె?

†కావున మనకీ క్రీర్తిలందిం బ్రయత్నింతుముగాక.

* నటి—ప్రాణేశ్వరా! సర్వజ్ఞులగు మీకు నేఁ జెప్పెడుపాటిదానను కాను. మన మెంత నాటకప్రదర్శన కళావిదగ్ధుల మైనను.

మ. లలితస్ఫారకలాకలాపయుతలీల లాలోలుఁడై మించి రం
జిలుచున్ జారులఁ జోరుల న్విమతులన్ శిక్షించి యే యీతిబా
ధలు లేకుండఁగ రాజ్యమేలు బుధమందారుం డన న్సంతతం
బిల సింహాద్రిజగత్పతీంద్రమహరాజ న్నెన్నంగ సామాన్యుఁడే.

* అట్టి నిరుపమానకళాపరిపూర్ణుండు ననదృశశౌర్యధైర్యగాంభీర్యసాహసోదారభుజబలప్రతాపధౌరేయుండు సుగుణరత్నాకరుండు సాధుజనసంరక్షణాయమానభుజపంజరుండు విశేషించి సదాచారసంపన్నుండు నగు నీ ధర్మప్రభుచెంగట మనము కృతార్థుల మైనంగదా మన మనోరథంబులు సిద్ధించుట.

సూత్ర-ప్రియా!* ఎల్లవారల మనోరథంబులను సిద్ధింపఁజేయఁ గృష్ణుఁడు లేఁడా? అయినను.

గీ. కంటకవికీర్ణ దుర్గమ కాననాంత
రమునఁ బొదరింటి తరుపుష్ప రసముఁ గోలఁ
దివిరి మధుపంబు దానిఁ బొం దెడువిధంబు
పూన్కి-చేఁ గష్టతర కార్యములు ఫలించు.

ఇంక నతివిస్తర మేల? కర్తవ్యమాచరింపఁ ద్వరపడవలయును.

నటి—నాథా! ముందుగ నేఁ జేయవలసినకార్య మెద్దియో నియోగింపుఁడు.

సూత్ర—ప్రేయసీ! మనము ప్రదర్శించునది శృంగారరసప్రధాననాటకంబు కావునఁ దద్రసపోషకంబును సకలభువనమనోల్లాసకరంబు నగు వసంతఋతువును నవ్యక్తమధురంబగు నీ కంఠమంజులనాదంబు తేటఁబడ గానానందరసంబు వెల్లిఁగొల్పుచు వర్ణించి యీ సభ్యులవీనులకు విందొనరింపుము.

నటి—చిత్తము ఆలాగే చేసెదను.

హిందూస్తానీతోడి రాగము-చాపుతాళము.

ఈ వసంతకాలమహిమ మెంతవింతయాఁగదా
భావమలర జీవకోటి పరమసుఖముఁ జెందఁగా॥ ఈ॥

కోయిల లున్నజాంతరములఁ గూయు మెక్కిచివురులన్
నూయురే యభిసారికాళి మానముల్గలంచుచున్ ॥ ఈ॥
చిలుకలు కలభాషణముల చెట్లపై నెసంగఁగాఁ
జలువ తెమ్మెరలను పుష్పసౌరభంబు లొలయఁగా॥ ఈ॥
పాయకాప్రసూనపాళి బంభరాళిపాటలన్
హాయి వత్సవాయిజగప తీయుదీర్ణుఁడలరఁగా॥ ... ఈ॥

మఱియు,

మ. తతసమ్మోదకరప్రభావతి వసంతశ్రీ యనంగన్ బిక
ప్రతతు ల్బాలరసాలపల్లవములన్ భక్షింపుచున్ బంచమ
స్థితి గానంబులు సల్పుచుండ నళిరాజిన్ గీరపాళిన్ సుమ
ద్యుతిఁబ్రద్యుమ్నకుమారుఁడు న్వేడలు బాంధుల్యోహమున్ జెందఁగన్.

సూత్ర—ఎవ్వా! ప్రియురాలా! తావకీనమనోహరగానకలాపాభివర్ణనముచే నీ వసంతాగమనం బినుమడుంగులఁ బ్రమదావహంబై యొప్పచున్నయది. చూడుము.

చ. అలలుచలింపఁబయ్యెరల నల్లకొలంకులనూఁగుహంస లా
దళితసరోజగర్భబిసతంతులలాగువిధంబు మానసం
బులగ్రహియించి సభ్యుల వి మోహితచిత్తులఁజేయ వారుమా
ర్మెలఁగక సుప్రసన్నులయి జెప్పలువాల్చకచూచుచుండ రే.

* [అంత నేపథ్యంబున వైతాళికుఁడు.]

*మ. అలర న్బద్ధపురిన్ దివి న్సరగణా లహ్లాదశంబు న్మహో
జ్వలపూర్వాళజగత్పతీంద్రుఁ డుదితోత్సాహంబునన్ స్వచ్ఛకీ
ర్తులఁబాలింపఁగఁగోరి శౌరికృప సంతోషింపఁగావచ్చు ని
శ్చలచిత్తుండయి ద్వారకాపురి కభీష్టప్రాప్తియా వానికిన్.

నటి—(ఆలకించి) ప్రాణేశ్వరా! అదిగో నాటకపాత్రములు రంగస్థలమునకు వచ్చుచున్నవి కాఁబోలు. మనమింకపోవుదమురండు.

సూత్ర—మంచిది. ప్రియా! రమ్ము.

(అని యిరువురు నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రస్తావన.





శ్రీ ర స్తు.

హ య గ్రీ వా య న మః.

# ప్ర భా వ తీ ప్ర ద్యు మ్న ము.

## ప్ర థ మాం క ము.

---

రంగము ద్వారకాపురపరిసరము.

[దేవేంద్రుఁడు మాతలిసహితుండై ధరాతలంబున కవతరించుచున్నాఁడు.]

మాత——(విమానమునుండి క్రిందకుడిగి) దేవా!

మత్తకోకిల

ఓపురందర! కంటిరే మన ముర్విఁ జేరితిమింక నా
పాపకర్ముఁడు వజ్రనాభుని బారి మీఱఁగఁగల్గెఁగా

ఇంద్రు——(తానుగూడ క్రిందకుడిగి)

ఏపుమీరిన దైత్యవల్లభుఁ డీల్గకుండఁగ నక్కటా!
ఈపరాభవదావవహ్ని సహింపశక్యమె మాతలీ.

(అని నిట్టూర్పువిడిచి తనలో) అన్నా! ఏమి యాదైత్యాధమునియాటోపము!

చ. విపులచమూసమేతుఁ డుగువిక్రముఁ డా రజనీచరుండు పి
ట్టపిడుగులాగు పైఁబడి హఠాత్తుఁగ స్వర్గము నాక్రమించి వే
లుపుగమిఁదోలి నందనములోని సమస్తము మంటఁగల్పి గ
ద్దెపయిని గూరుచున్ననను దిబ్బున నేలఁబడంగఁద్రోసెఁగా.

ఈ పరాజయపరాభవదావానలంబు చల్లారు టెట్లు? కైలాసవాసుండగు నీశ్వరు నాశ్రయించినను కార్యంబు లేకపోయె. భగవతియగు పార్వతీదేవి యేవిధంబుచేనైన నా నక్తంచరునిఁ గీటడంచుటకుం దగినయుపాయంబు నాలోచించెదనని చెప్పుటచే నా మనంబున కొక్కింతయూరట కలిగినది. కాని యీశ్వరవరప్రసాదంబుచేఁ బెచ్చుపెరిగి యున్న యా ఘోరరాక్షసుని నిర్జింప నామెకు సాధ్యమగునో కాదో. నా కింక భగవఁ

తుండగు శ్రీకృష్ణుఁడే శరణంబు! (ప్రకాశముగా) మాతలీ! మనము ద్వారకాపట్టణమును సమీపించితిమా?

మాత—దేవా! అదిగో చూడుఁడు.

లయగ్రాహి. అల్లదియె స్వర్గపురి నుల్లసములాడుచు న
ట్లల్ల హరిసంస్మృతిని నెల్లపుడుఁ బ్రాకా
రోల్లసితహర్మ్యములఁ గొల్లలగు ఘోటకమ
తల్లుల మదావళుల నల్లలిత నానా
వల్లి లవలీకుటజ మొల్లముల మల్లియల
నుల్లమునఁ గౌతుకము వెల్లిగొలుపన్ రం
జిల్లు నదె ద్వారవతి ఫుల్లసరసీజనవ
హల్లకజలాశయము లెల్లెడలఁ గ్రాలన్.

ఇంద్రు—ఓహో! ఏమి యీపురలక్ష్మీవైభవము.

చ. విలసిలువజ్రదీధితులు వేవెలుఁగన్ నిను వ్రాయు గోపురా
వళిఁ జెలువారుసౌధములు వన్నెసిడంబులు మౌక్తికాళిచే
నలరెడురంగవల్లికలు హారిహిరణ్మయకుట్టిమంబులున్
లలిరతనాలతోరణములెలం గనుపండువుఁగొల్పెడు న్బలే.

శ్రీమహాలక్ష్మీసహితుండగు శ్రీకృష్ణభగవానులు నివసించియుండుపురవరంబున కిట్టి మహావైభవము కలుగు టబ్బురమా. మాతలీ! లీలాలోలుండగు నా మహామహుండు నాకిట్లు దర్శనీయుండగునో కదా.

చ. సలలితమంజువాక్యములజాంబవతిం గరగించుచుండునో
యలరునొ సత్యభామగృహమందు నవీనవిలాస సన్మృదూ
క్తుల నల రుక్మిణీరమణితోఁడను బాచికలాడునేమొ దీ
నులమొరలాలకింపుచు నసూనకృపామతిఁ దానపోయెనో.

మాత—(ఇటునటుఁజూచి హర్షముతో) దేవా! మీ కడపటియభిప్రాయమే సరియైనది. చూడుఁడు.

మ. సిరితోఁ బాచికలాడుచున్ గరిమొరల్చింతించిరక్షింప నా
తురుఁడై యేగిన దీనబంధుఁడు జగత్పూజ్యుండు నా ద్రౌపదీ

వరదుండున్ హరి వేణుగానరతుఁ డబ్జాక్షుండు కంసారి శౌ
రి రమామానసలోలుఁ డియ్యెడకు శ్రీకృష్ణుం డదే వచ్చెడున్.

ఇంద్రుడు.—(సహర్షంబుగ) ఓహో! ఆర్తజనశరణ్యుండగు శ్రీకృష్ణుండే నా భాగ్యవశంబున నిటు దయచేయుచుండె. ఏమి నాయదృష్టము! నే నింక చరితార్థుండ నయ్యెదను.

[అంత శ్రీకృష్ణుండు ప్రవేశింప నెదురుగఁజని కృతాంజలియై] లీలామానుషవిగ్రహుండవగు నో భగవానుఁడా! శ్రీకృష్ణా!

చ. శరణు కృపావిశాల! వరశార్ఙ్గగదాధర!నందనందనా!
శరణు మహీధరోద్ధరణ! సారసలోచన! కంసమర్దనా!
శరణు మురాసురాంతక!ప్రజస్ఫుటఖేలన! భక్తపాలనా!
శరణు రమామనోహరణ! సాకు నను న్శరణంబవై హరీ.

శ్రీకృ.—(అచ్చెరుపాటునభినయించుచు) ఏమీ! సకలలోకజగజ్జేగీయమానసుధర్మాసనాధిష్ఠితత్రివిష్టపాధినాథుండే మనుష్యమాత్రుండనగు నన్నుశరణువేడవలసివచ్చెనా!

ఇంద్రుడు—దీనావనబిరుదాంకితుండవగు నోముకుందా! నాకాధిపత్యంబుకన్న దుఃఖభాజనంబగు దుస్థితి యొండెద్దియైనం గలదే?

సీ. వృత్రాసురునిసంహారింపంగఁ బెక్కేండ్లు
తామరతూఁడులో దాగవలసె
తారకాసురునిచేఁ దరుమంగబడి షణ్ము
ఖోదయంబునుగోరి యుండవలసె
హేమకశిపుచేత నెన్నిసారులొ చావుఁ
దొలఁగింప మూలల దూర వలసె
బలిదైత్యుచే నోడి పదవిని విడనాడి
పరులపంచలఁ జేరి బ్రతుకవలసె

గీ. రావణాసురుఁ డన సహస్రరాత్రములును
కరికి స్వప్నంబునందు సింహంబు దోఁచు
పగిది నడలంగవలసె నీ వజ్రనాభు
చేత నేఁ డివ్విధంబునఁ జేరవలసె.

శ్రీకృ.—(వెఱగునభినయించుచు) ఆఁ! వజ్రనాభుం డెవఁడు? వానిచే నీ కేమి యుపద్రవంబు సంభవించె ?

ఇంద్రు.—దానవాంతకా ! సర్వజ్ఞుండవగు నీ వెఱుఁగరాని దీ రేడుజగంబుల నెందైనం గలుగ నేర్చునే? అయిన విన్నవించెద నవధరింపుఁడు. వజ్రనాభుండను ఘోరనక్తంచరుం డీశ్వరునిఁగూర్చి యనేకసహస్రవర్షంబు లతినిష్ఠురతపం బొనరించి వరంబులు వడసి తద్వరప్రభావంబుచేఁ గ్రిందుమీఁదుఁగానక దేవతావళి బాధించుచుండుటయేఁగాక నన్ను నిర్జించి స్వర్గపురం బాక్రమించె. ఏ మని విన్నవింతును, వాని బారినుండి విడివడి వచ్చుటయే దుర్ఘటంబయ్యె.

శ్రీకృ.—(నివ్వెఱగందుచు) ఏమేమీ!

చ. అమలతపఃప్రభావయుతులౌ ఋషులందఱుఁ దన్నుఁగొల్వ గో
త్రముల నడంచు వజ్రముఁ గరంబునఁదాల్చి సుధర్మ నేలుచున్
బ్రమదముమీఱ వైభవపరంపరల న్విలసిల్లుశక్రుఁ డా
లమునఁ బరాజితుండయి పలాయితుఁడయ్యెనె యొక్కదైత్యుచేన్.

మాత.—కంసమర్దనా! మున్ను వివిధావతారంబుల ననేకసార్లు రక్షోవీరుల సంహరించి త్రివిష్టపంబు నిలఁబెట్టితి వీవ కావె.

ఉ. రాముఁడవై రణస్థలిని రావణునిం దెగటార్చితీవు స్వ
ర్భూమిజయింప హేమకశిపు న్నరసింహుఁడవై వధింపవే
వామనమూర్తివై బలినివారణలీల నడంచి తీవు సు
త్రామశరణ్య! నీవెటు దురంబునఁ గూల్చెదొ వజ్రనాభునిన్.

శ్రీకృ.—నగభేదీ! ఆరాత్రించరుం డిపు డెచ్చోట నున్నవాఁడు?

ఇంద్రు.—మేరుపర్వతంబునకు దక్షిణభాగంబున వజ్రపురం బను నొకపురంబును నిర్మించుకొని యున్నవాఁడు.

శ్రీకృ.—పాపము. స్వర్గమంతయు భీభత్సముచేసెఁగాఁబోలు.

ఇంద్రు.—చక్రహస్త! ఆ దోషాచరుం డొక్కమ్మడి సైన్యసమేతుండై స్వర్గపురంబుపైఁ బడి;

చ. నలినదళాక్ష! నందనవనంబునఁ గల్పమహీరుహంబుశా
ఖల వెసదుల్చి హంసబకక్రౌంచములెల్లఁ జెలంగునట్టియా

కొలఁకులనన్నిటింగలఁచి కూర్మిరవి చేష్టత నప్సరోంగనా
వలిఁజెరఁబట్టి వేల్పుగమి బంధనఁజేసి సుధర్మ గైకొనెన్.

నే నచ్చోనిలువ నిరవుఁ గానక నిటువచ్చి,

చ. నిను శరణంబు వేడితిని నీటనుముంచెదో పాలముంచెదో
దనుజులనెల్లఁద్రుంచుటకు దాలిచినీవు దశావతారముల్
మును త్రిదివంబుఁగాచితివి పూనిక నేడిటు వజ్రనాభునిన్
దునిమి నిలింపులన్నను వినోదముల న్విలసిల్లఁజేసెదో.

శ్రీకృ.—బలశాసన ! ఈశ్వరకటాక్షంబుచే వజ్రనాభుఁడు గాంచినవరములెవ్వి?

ఇంద్రు.—ముకుందా ! వినుము.

మ. వరముల్గాంచె నతండు వజ్రపురి దేవవ్రాతముల్ మానవుల్
చొరఁగాశక్యముగాకయుండఁ బురి నేశూరుండునుం సాహస
స్ఫురణన్ జొచ్చిన నాక్షణంబతఁడు నచ్చోఁజావఁగా నాత్మదు
స్తరఖడ్గంబునఁగాక యొండువిధిఁ దాఁజావొందకుండన్ గటా.

అట్టివాని నిర్జించుటకుం దగినసాధనంబు నాలోచించి నన్ను రక్షింపవలెను.

శ్రీకృ.—శతక్రతు ! పూజ్యులైన మా తండ్రిగారు రోకక్రతు వొనరింప సంకల్పించి యుండుటచే నే తత్కార్యనిర్వహణార్థమై పనితొందరలో మునింగి యుంటిని. వజ్రనాభు నోర్చుటకు వెరవు సావకాశంబుగ నాలోచించెదను. నీ విప్పటికి వీడ్కొనుము. నే పనివినియెదను.

(అని నిష్క్రమించుచున్నాఁడు)

ఇంద్రు.—మాతలీ! నా డెందంబునంగల కొందలంబు డిందునెడదయ్యె. కట్టా!

ఉ. ఊరట కల్గదయ్యె జలజోదరుఁ డాగతిఁ బల్కియుంటఁ బొం
గారుపరాభవానలము కాల్చుచునుండెమనం బదెవ్వఁ డ
ల్లారునొ వజ్రనాభుని మురాంతకుఁడే క్రియ సంహరించునో
తీరనికష్ట మెప్పటికిఁ దీరునొ హా ! విధి యెట్టులుండెనో.

మాత.—మహేంద్రా! ఏల దైన్యము నొందెదరు?

ఉ. పాడియె యీపరాభవము బాయదొకో విపరీత కాలముం

దోడిననేమి శౌరికృపయుండిన నోడలుబండ్లవచ్చు బం
డ్లోడలవచ్చుగాన సమయోచితభంగిని ధైర్యసారమున్
వీడకసంచరింపఁ దటి విక్రమలీల జయింపనౌ రిపున్.

(అంత తెరలో) హా! హా! రక్షింపుఁడు. రక్షింపుఁడు.

ఇంద్రు.—(ఆలకించి) మాతలీ! ఈచెంత నొకకాంతామణియార్తాలాపంబు వినవచ్చుచున్నయది. నీవు పోయి కారణ మరసిరమ్ము.

మాత.—చిత్తము.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

[అంత శుచిముఖి ప్రవేశించి]

శుచి.—(ఇంద్రునిఁజూచి) జే పురందరమహారాజా! (అని నమస్కరించిలేచి యంజలిఘటియించి)

చ. జయజయ వజ్రపాణి! బలశాసన! రమ్యత్రివిష్టపాధిపా!
జయజయ గోత్రభంజన! లసన్మణిభూషణ! సత్యభాషణా!
జయజయ వృత్రవైరి! జలజప్రతిమాన సహస్రలోచనా!
జయజయ యోశచీరమణ! సర్వసుపర్వవినోదభాజనా!

ఇంద్రు.—కాంతామణీ! నీవెవ్వతెవు? ఏమికతంబున నీవిట్లేకతంబ చనుదెంచుచుంటివి?

శుచి.—నాకాధిపా! దేవరవారినందనవనంబునం గల మానససరోవరమందు విహరించెడు రాజహంసలలో నే నొకదానను. కామరూపసంచారిణినగుటచే నే నిట్లు స్త్రీరూపంబున సంచరింపుచుంటిని. మఱియు,

ఉ. నాకపురీశ! నందనవనంబున రాజిలు మానసైక నీ
రాకరవీచికాంతరవిహారములన్నలినీబిసంబులన్
గైకొని మెక్కు హంసలను కట్టిడిదైత్యుఁడు వజ్రనాభుఁ డ
ట్లాకులమందఁ జేయ నిటులయ్యెను మాబ్రతుకేమిచెప్పుదున్.

ఇంద్రు.—అన్నా! పాపము. బ్రహ్మలోకంబున నలువరాణిమన్ననలఁ జెన్నుమీరి త్రిదివంబున కేతెంచి నందనవనంబునంగల సురుచిరకల్హారరేణుమృణాళనాళకబళగ్రాసాసక్తంబులై యుత్తుంగతరంగంబుల దంపతీయుక్తంబుగఁ దూఁగుటుయ్యేలల నూఁగుచుఁ గలరుతంబుల నలరు కలహంసనికురుంబమ్ముల కట్టిడి దుష్టస్థితి

సంప్రాప్తంబయ్యె. కాలవైపరీత్యంబున కేమనవచ్చు. బాలామణీ! నీ వేయభిధానంబుచే స్త్రీరూపంబునఁ బ్రవర్తిల్లుచుంటివి? నీ యాగమనం బపేక్షించు ప్రదేశ మెద్ది?

శుచి.—దేవతాచక్రవర్తి! నే శుచిముఖియనం బరగుచుందు. మేరుసానూపకంఠంబున వజ్రనాభునిచే నిర్మింపఁబడిన వజ్రపురంబునుండి ద్వారకాపురంబులోని కేగుచుంటిని.

ఇంద్రు.—(నివ్వెఱగందుచు) ఏమేమీ! ఆవజ్రపురంబు దేవతలకు మానవులకు దుర్గమం బని వింటిమే. నీ వెట్లు చొరఁగల్గితివి?

శుచి.—దేవేంద్రా! ఆ రజనీచరుండు త్రిదివంబున నిజభటభృత్యామాత్యవర్గపరివృతుండై పేరోలగంబుండఁ గామరూపిణి నగుటచే నే నొక యెలపాయంపు జవ్వనినై మోహనాకారంబున వానియెదుటకుంజని;

సీ. కనుబొమ లెగుచుచుఁ నునుబల్కులను బైఁట
కొంగును సవరించి కొంతసేపు
జిలిబిలిముద్దుపాటల నోరచూపులఁ
గుతుకంబుఁ గలిగించి కొంతసేపు
నవవిల్లకందుకంబన నృత్యములు సల్పి
కోరికలూరించి కొంతసేపు
చిఱునగ వెలయంగ సఱమోడ్చి నేత్రముల్
కంతురంతులుజూపి కొంతసేపు

గీ. సమ్మదమునింపఁ దనయెడల్ జల్లుమనఁగ
నయి గగుర్పాటుఁజెంద సామాన్యబుద్ధి
నన్ను చేసన్న దఱిఁజేరి సన్నుతించి
తనపురికివచ్చి యలరింపు మనుచు బలికె.

ఇట్లావజ్రనాభునియనుమతి వడసియే వజ్రపురికేగితిని. దేవా! ఆజ్ఞయెట్టిదియో సెలవిందు.

ఇంద్రు.—మేలు, కాంతామణి! మేలు. బహుచక్కని యుపాయ మాలోచించితివి.

మ. మును క్షీరాబ్ధిని ద్రచ్చి కొన్నయమృతంబుల్ ద్రావఁగాఁగోరు నా
దనుజానీకముఁ గన్నుగప్పి సురలక్ దన్నైన్యహావిష్ణు వ

ల్లిన దివ్యాద్భుతమోహనాంగియయి బాలా! నీవు నాలాగు నీ
దనుజు న్మోహనిమగ్నుఁ జేసితివి వింత తా నీ చరిత్రం బహో.

నీవంటి జాణల నే నెన్నండును విని కని యెఱుంగను. శుచిముఖీ! ఇంకా నీ మూ
లమున నే దేవతల మనోరథంబు సిద్ధింపవలయు.

శుచి.—దేవరయాజ్ఞ శిరసా వహించెదను.

ఇంద్రు.—లలనామణీ! నీవు వజ్రపురంబున కేగి యా యుగ్రదానవు నలరించితివా?

శుచి.—సురేంద్రా! నే నా వజ్రనాభుని సభాస్థానంబున కేగి బహువిధంబులగు లాస్య
గానాభినయంబుల నా దైత్యనాథు నలరించి వానిచే ననేకసత్కృతుల నందితిని.

ఇంద్రు.—ని న్నా రజనీచరుండు వేల్పుమిన్న యని సన్నచూపు చూచెనా లేక సముచిత
మర్యాదల బహుమానించెనా?

శుచి.—దేవా! అరక్కసుల ఱేఁడు వేల్పులసూఁడయ్యు న న్నేకవిధంబుల బహూకా
రించుటయేఁ గాక నా కలావైశారద్యంబుల కలరి నిజకుమారీమణియగు ప్రభావతీ
కన్యకకు నాడిగంపుచెడియగ నియమించి యంతిపురంబున కనిచె.

ఇంద్రు.—(సహర్షంబుగ) ఏమేమీ! వాని యంతిపురంబులోనికిఁ గూడ నీకు ప్రవేశము
కలిగెనుగా? అక్కడివిశేషము లెట్టివియో యెఱింగింపుము.

శుచి.—సహస్రాక్షా! ఆ శుద్ధాంతవైభవ మిట్టిదని కొనియాడ నలవి కాదు. వినుండదు,

చ. విమలమణిప్రభాంచితనవీనవితానము వజ్రపఙ్క్తిదీ
ప్తి మగలిగింపుచున్నది ధగద్ధగితంబుగఁ గ్రాలు నిల్వుట
ద్దములు పటంబు లంతట ముదంబు ఘటింప సఖీద్వితీయయై యా
రమణిఁ బ్రభావతిన్ దనుజరాజసుతన్ గను గొంటి నచ్చటన్.

అప్పు డాతన్వంగి,

చ. తనకుడిచెక్కుటద్దమున దక్షిణపాణిసరోజ మాని జ
వ్వనియొకచిత్రపుంబటము వామకరాబ్జమునందు నిల్పి వా
ల్కనులను మెచ్చి నెచ్చెలిఁ బ్రకంపితమౌ బొమవింటఁ జూచి మో
మున దరహాస ముప్పతిలఁ బొల్చుచునుండె నొయారమొప్పఁగన్.

ఇంద్రు.—ఆచిత్రపటముయొక్క వృత్తాంత మేమైన నీ వెఱింగితివా?

శుచి.—దేవా! ప్రభావతి మొగంబునఁ జిఱునగవు మొలకలెత్త నా చిత్రపటంబును
గూర్చి నెచ్చెలియతో ముచ్చటించిన విషయం బొక్కింత వింటిని.

ఇంద్రు.—ఏమని?

శుచి.—ఆనవలామిన్న చిత్రపటంబు చెలికత్తియకుఁ జూపుచు,

"ఉ. హాళినిఁ గేళికావనముకనందు జరింపుచుఁ బుష్పమంచుర్ల
వ్రాలినతుమ్మెదర్ల గని వారాళిని జెందితి నెందుచేతనో
'లోలవిశాలనేత్ర ! కలకలో నితఁడే యగు నీకు భర్తశో
భాలలితుం' డటంచును భవాని యొసంగిన చిత్రమెంచుచున్.

చ. విలసితరాగసంపద నవీనముగా వికసించుపుష్పముర్ల
దెలిసి ప్రియంబున న్గాదమ తేఁటి నురందనముఁ గ్రోల వ్రాలిర్ల
లలితప్రసూనకాంక్ష సఫలత్వముఁ జెందెడు నట్టిభాగ్య మి
చ్చలుగననట్టిజన్మ మొకజన్మమె కర్మముగాక నెచ్చెలీ."

అని కాంక్షదోఁపఁ బలుకసాగెను.

ఇంద్రు.—(తనలో) భగవతియగు పార్వతీదేవి తనవాగ్దానము నెఱపుచుండెను కాఁబోలు.

శుచి.—దేవా! అట్లు నెచ్చెలియతో ముచ్చటించుచు దీనవదనయైన ప్రభావతిహృదయంబు తెఱంగెఱుంగ నే నిట్లంటి.

ఇంద్రు.—ఎట్లు?

శుచి.—దేవా! వినుండు. నే నాసుదతీమణిచెంతకుం జని చిత్రపటం బవలోకించి.

"చ. కులుకుహొరంగుమైజిగియుఁ గోకనదంబులఁ గేరు నేత్రముల్
నెలతెలిడాలుఁ బోలుఁ లవలీదరహాసముఖంబు నద్దపుర్ల
బలకలజగ్గునిగ్గులన భాసిలు చెక్కులు సోగముక్కు ను
జ్జ్వలతరదీర్ఘబాహువులు విశాలపువక్షము సింహమధ్యముర్ల
గలుగుప్రసన్నమూర్తి రతికాంతుఁ డితం డతఁడే విచిత్రమా."

అని యాసఁగొలుప వచించితిని.

ఇంద్రు.—అందుపై యా దనుజరాజతనూజ యే మనియె?

శుచి.—దేవా వినుండు నే నాలా గని యచ్చెరు వొందుచుండ ప్రభావతి సంభ్రమంబున దిగ్గున లేచి నన్నుఁ గౌఁగిలించుకొని లోనివలపు రెట్టింపఁ దన యంతరంగంబునఁ బ్రభవిల్లిన యమందానందవాహినీలహరులు పై కుబుకుచుండెనో యనఁ బులకితంబగు నెమ్మేన లేజెమ్మటలు గ్రమ్మఁ బద్మదళంబులు ముత్యములు ప్రసవించు

చుండెనో యన విశాలనేత్రంబులనుండి యానందబాష్పబిందువులు దొరుంగ నక్ష త్రరాజినా విరాజిల్లు రదనాంశుకచ్ఛవి బాలచంద్రికారుచిం బరిహసింప మంద స్మితసుందరవదనారవిందయై క్రేగంటిచూపుల సుప్రసన్నతదోఁప "ప్రాణసఖీ! ఈ చిత్రపటంబున లిఖింపఁబడిన మోహనాకారుని నీ వెచ్చోట గంటివే ?" అని యడిగెను.

ఇంద్రు—అందుకు నీ వేమంటివి?

శుచి.—పిమ్మట నే నొక్కింత యాలోచించి "నే మరలఁజూచివచ్చినంగాని నా మనో గతం బెఱింగింప" నని చెప్పి తదనుమతివడసి నే నిచ్చోటికి వచ్చితిని.

ఇంద్రు—నీ వాచిత్రపటాంతర్గతాకారంబున కనురూపంబైన రూపం బెచ్చోటనైనఁ గనియుంటివా?

శుచి.—దేవా! ఈద్వారకాపురవరంబున శ్రీకృష్ణకుమారుం డగుప్రద్యుమ్నుం డొక్కింతే యా చిత్రప్రతిమంబునుం బోలియున్నట్లుం దోఁచెడు. అయిన నే నిశ్చయముగఁ జెప్పజాలను.

ఇంద్రు—(తనలో) శుచిముఖి యుదంతంబును బట్టి చూడఁగాఁ బ్రభావతికిఁ జిత్రపటాం తర్గతుం డగుపురుషవతంసునిపై మోహము మిక్కుటముగఁ గలిగియుండుట నిశ్చ యము. ఆ చిత్రలిఖితపురుషుండు శ్రీకృష్ణకుమారుండగుప్రద్యుమ్నుండే యగుట నిక్కువం బయ్యెనేని మన్మనోరథసిద్ధి సుకరంబగు ఎట్లనఁ గాత్యాయనీప్రభా వంబుచే,

మ. సతినిర్మితుఁడౌ భర్తయంచుమది నెంతేచన్ గోర్కెఁదీర్పన్ బ్రభా
వతిఁ బ్రద్యుమ్నుఁడు చిత్రలీలలను జేపట్టంగఁ దా విన్నచో
దితిజాధీశుఁడు వజ్రనాభుఁ డెద నుద్దీపింపఁ గోపంబు దు
ర్మతియై చచ్చు నిజాసిచే నతని జంపంబూని ఘోరాజిలోన్.

ఇంతకును భగవత్సంకల్ప మెట్లున్నదో తెలియరాదు. (ప్రకాశముగా) శుచి ముఖీ! నీ యభిప్రాయము సరియైనదే కావచ్చును. అయిన నింకొకసారి నీ వ పు రంబులోనికిం జని ప్రద్యుమ్నకుమారుని బాగుగవీక్షించి యాతండే యా కన్ని యకు దేవీనిర్మితుండైనవరుండని నీకు రూఢిగాఁ దోచినపక్షమందు నీవు సర్వ విధముల చేతను నా వధూవరులకుఁ బరస్పరసంఘటనం బొనర్పఁ బ్రయత్నింప వలయును.

శు-చి.—(తనలో) మృగయాప్రసక్తిఁ బ్రద్యుమ్నకుమారుం డనుజులతో నీ పరిసరారణ్యంబునకు వచ్చునని వినియుంటిని. ఈ దేవతానేతయగు పురందరుం గని యొంటిఁగ సంభాషింప ననువగుటకై యొక వ్యాజంబుఁ గల్పించి మాతలిని నిష్క్రమింపఁజేసితిని. ఇతం డింకను మరలి రాఁడయ్యె. కారణమేమొకదా. (ప్రకాశముఁగా) దేవా! దేవరయాజ్ఞ శిరసా వహించెదను.

ఇంద్రు.—ఇది మన కెంతయు నవశ్యకర్తవ్యంబు సుమీ. ఈవిషయంబున నీ నైపుణ్యమంతయు వినియోగపరిచి నా మనోరథంబు సఫలంబుఁ జేయవలయును. పిమ్మట నీకు మేలుకలుగును. (అని యిటునటుఁ జూచి) అదిగో! నా రథసారథి యగు మాతలి తిరుగవచ్చుచుండె. నీవు నీ పనిమీదనే యుండుము. నే నేగెదను. (అని దేవేంద్రుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

శు-చి.—(స్వగతము) స్వర్గాధినాథుండగు శక్రుండు దుర్ఘటంబగు కార్యంబు నిర్వహింపుమని నా కాజ్ఞనొసంగె. నే నందుకు వల్లెయంటిని,

క. తలనిడి సాధ్యాసాధ్యం
బుల నెంచకఁ బూనుకొంటిఁ బోలు నె నగమున్
దోలఁగింపఁ దగరునకు నె
వ్వాలనగుఁ బ్రద్యుమ్నునకుఁ బ్రభావతిఁ గూర్పన్.

ఆకన్నియ రాక్షసరాజతనూజ. ప్రద్యుమ్నుఁడు రాక్షసాంతకుండగు కంసాంతకునికుమారుఁడు. ఇట్టి దారుణశాత్రవాపత్యంబులకు దాంపత్యంబు సమకూర్చుట యెట్లు? మఱియు,

చ. అసురవిభుం డొకండు నసురాంతకుఁ డొక్కఁడు వారు వీరు సం
తసమున వియ్యమంది సతతంబును నెయ్య మెలర్పఁ గూడుటల్
భసలకులంబుఁ జంపకకులంబును వియ్యము లందుటే కదా
అసదృశమైనయీఘటన యిద్దిర! యేక్రియ నిర్వహింతునో.

ఇదియునుగాక వజ్రపురంబు లాతులకుఁ జొర నశక్యంబు. ఎట్లోగదా (అని కొంచెమాలోచించి) అయిన నే తద్విషయమై సర్వవిధముల చేతను బ్రయత్నించెదను. పిమ్మట కార్యంబు సఫలంబుఁగాకపోయినను, "యత్నే కృతే యదినసిద్ధ్యతికోఽత్రదోషః" అని పెద్దలు చెప్పుదురు. కావున నాయందుదోషముండదు. నే నిప్పుడు ప్రద్యుమ్ననివీక్షించి వానిహృదయంబుఁ బ్రభావతిపైఁ దగులునట్లు చే

యఁ బ్రయత్నింపవలయును. ఆతం డిపు డెచ్చోటనుండునో కదా. (అని నల
లంకులఁ జూచి సంతోషముతో) వహ్వా! అదిగో,

చ. తురగఖురప్రహారముల ధూళి సముద్ధతి రోదసీదరం
బురుగతిఁ గ్రమ్మ వల్గితముఖోచితధారల వేఁటలాడ నీ
సరసకుఁ దమ్ములైన గదసాంబులు తన్గొలువన్ ప్రభావతీ
వరుఁడదె కాననంబునకు వచ్చుచునుండెఁ గృతార్థనయ్యెదన్.

నే నిపుడే మాయాకురంగరూపమును ధరించి మృగయావిహారలోలుఁడగు ప్రద్యుమ్నకుమారుని గహనాంతరంబునఁ బథభ్రష్టునిఁ గావించి యొంటిపాట గల్పించి వానితో మదీయవ్యవసాయనంబు తెఱం గెఱింగించెదను.

(అని నిష్క్రమించుచున్నది.)

గద్య.

ఇది శ్రీమద్వేంకటరమణకరుణాకటాక్షవీక్షణాసారసమాసాదిత రస
బంధురకవిత్వవైఖరీప్రవీణాపస్తంబసూత్ర శాండిల్యసగోత్రప
విత్ర హోతృకులకలశార్ణవరాకాకైరవమిత్ర వేంకటరత్నము
పుత్ర వేంకమాంబాగర్భశుక్తిముక్తాఫల వివిధవిద్వజ్జన
విధేయ వేంకటకృష్ణనామధేయప్రణీతంబైన ప్ర
భావతీప్రద్యుమ్నంబను నాటకరాజంబున

ప్రథమాంకము.





శ్రీరస్తు

# ప్రభావతీప్రద్యుమ్నము

## ద్వితీయాంకము.



రంగము:—ద్వారకానగర పరిసరారణ్యము.

[సహోదరులైన గదసాంబులతోఁ బ్రద్యుమ్నుండశ్వారూఢుండై ప్రవేశించుచున్నాఁడు]

ప్రద్యు—సోదరులారా! మృగయావిహారంబు సలుప నీ మహోగ్ర కాంతారం బతి కాంతంబై యొప్పుచున్నయది. చూడుఁడు.

తురగవల్గనరగడ.

ఉరుములురుము కరణిపులుల । యొంఁడ్రగింపు లిందెసంగ
కరులఘీంకృతులును హరుల । గర్జనధ్వనుల్ చెలంగ
తురఁగములు చెలంగి హేష । తుములమున నటింపఁగలయ
గురుతరకిటిసంచయముల । ఘుర్ఘురనినదంబు లోలయ.

గదు—ఇరులసరణి భల్లుకంబు । లెల్లయెడల సంచరింపఁ
దరులనీడ దుప్పిగములు । దవిలి బడలికన్ హరింప

సాంబు—కస్సుమనుచు ఖడ్గమృగము । గండుమిగిలి తోడువదల
బుస్సుమనుచుఁ బడగలెత్తి । భుజగముల్ తెలంగఁబోదల

ప్రద్యు—కసవుమెసవునోటనుండి । గడ్డిపరకలూడుచుండ
కసిమసంగి పఱచు లేడి । గములు వెన్కఁ జూడకుండ

గదు—పలలముఁదినుచున్న హర । వముల నెసఁగ జంబుకములు
చిలుకలు కుజశాఖలందుఁ । జేయఁగిలకిలార్భటములు.

సాంబు—కొలఁకులనగములలతాని । కుంజములఁదనర్చు వినుము
వెలయు కాననమున నిపుడు । వేఁటలాడవలయు మనము.

(అని విజృంభించుచున్నారు)

ప్రద్యు—తమ్ములారా! ఈ గహనాంతరం బెంత మనోహరంబుగానున్నది! బళే!!

సీ. మత్తదంతావళ మస్తమస్తిష్కవి
హారసంచార కంఠీరవములు
ప్రకటదిగ్భ్రమమహా చకితైణతతివధో
ద్యోగసంభరిత శార్దూలచయము
మహింలో గ్రఖేలన మత్కూటమమికవ
ల్మీకంబులగు యుభల్లూకవితతి
బధిరీకృత శ్రవఃపటలవిదారణ
దారుణఘూక ఝిల్లీరవంబు

గీ. భీకరాభోగభోగదర్వీకరములు
చుంబితనభోంతరాళవృక్షంబు లలర
భానుకరదుర్గమంబయి పరిఢవిల్లు
కాననం బిందు వేటాడు కలిమికలిగె.

గదు.—ఓహో! ఈమహోగ్రకాంతారంబున,

బంధురవృత్తము.

గురుతరవనమిది గుహాలవెడలునా ఘోరమదద్విప కోటి నహో!
తరిమెడుహరులను దఱుచుపులుల మొత్తముల జింకలతండములన్
బొరిఁబొరిఁబఱచు విశేషపులకిటులను దుష్టప్లవమరీమృగ పుంజములన్
దురగమునిలుపుముతోడిగిశరము ప్రద్యుమ్న సహోదర! త్రుంతుమిటన్.

సాంబు—అన్నలారా!

పంచచామరము.

హాళాహళింగడంగి భీకరార్భటుల్ ప్రచండ కా
హాళధ్వను ల్నభంబు భూ మహాద్రిగహ్వరాంతరం
బులం బ్రతిధ్వనుల్చెలంగ భూరిసత్వజాతులన్
భళాభళీయనంగ ద్రుంచి ప్రాభవంబుఁజూపెదన్.

ప్రద్యు—తమ్ములారా!

మ. ఇదె మీ రిచ్చటఁ జూచుచుండుఁ డల మత్తేభేంద్రయూథంబులన్
దుదముట్టించెద భూరిసింహములఁ ద్రుంతున్ ఖడ్గ శార్దూల దు

ర్మదభల్లూకములన్వధింతు మహీతాకారణ్యంబునన్ శౌర్యసం
పద వెంపారఁగఁ గ్రూరసత్వములఁ దీవ్రస్ఫూర్తి వేఁటాడెదన్.

(అని నల్దెసల బాణంబులం బఱపి) బలె! తమ్ములారా! చూడుఁడు.

ఉ. అల్లదె సింహ మొక్కనిశితాంబకసంహతిఁ గూలె దుప్పులున్
భల్లుకము ల్వడిన్ గలయఁ బాఱెడుభీతిని నాదు తీవ్రపుం
భల్లములంటఁ దాక శరభంబులు వ్యాఘ్రము లంత మొందెడున్
డొల్లెడు నేదుపందులు పరుడున్ హరిణంబులు చూడుమెల్లెడన్.

సాంబు—అన్నలారా! వేఁటతమకంబుచే మైమరచి శరీరక్లేశంబు గమనింపక య నిరర్గళ భుజార్గళవిజృంభణం బతిశయిల్ల నుపవనవిహారంబులీల నీ భయదకాంతారంబునఁ గ్రుమ్మరుచుండుటచే నతిశ్రాంతులమైతిమి. కావున మన మించుకవడి నీ పటువిటపిపటలావృతశాద్వలతృణాంకురశీతలప్రదేశంబున విశ్రమింతుమురండు.

ప్రద్యు.—తమ్ముఁడా! నా చేచాయను జూడుము. అదిగో! ఆజింక నాహృదయమును తద్దయు నాకర్షించుచున్నయది. కావున,

చ. చెవులను నిక్కబెట్టుచును చేతికిఁజిక్కక చంగుచంగునన్
వివిధగతుల్ జరించుచును భీతినిఁజూచుచు నల్వలంకులన్
దవుదవు దాటుచుండు హరిణంబును డగ్గరి నాదుబాణలా
ఘవపటిమంబుఁ జేటఁబడఁ గా నొకవ్రేల్మిడిఁ గూల్చివచ్చెదన్.

(అని యాహరిణంబువెంటఁ బరుగిడుచున్నాఁడు.)

గదు—(సాంబునితో) తమ్ముఁడా!

కవిరాజవిరాజితము.

హరిణముఁగంటె మహాద్భుతలీల శితాశుగసంహతి కందక సో
దరునలయించుచుఁ దవ్వుల కెగుచుఁ దాఁగుఁడుమూతవిధంబుఁదనున్
దరిసిన దాటుచుఁ దాగుచునుండెను దానివధింపఁగఁ దత్పరుఁడై
యరుగఁదొడంగెఁగదా మనయన్న నహా కలియన్ జన నౌమనకున్.

సాంబు—అన్నయ్యా! మన యన్నగా రీఘోరారణ్యమధ్యంబునఁ బథభ్రష్టులైనచో వారికి మార్గప్రదర్శకు లెవరు? మనము ముఖ్యముగఁ బోవుదమురండు.

(అంత తెరలో.)

హా! హా! రక్షింపుఁడు. అకటా! ఈ మాహాసాంగుండు దక్షిణాశ కేలపచ్చనొకదా.

గదు—(వెలుగుదోఁప సాంబునితో) తమ్ముఁడా! ఈ తట్టునుండి యొక వార్తాలాపము వినవచ్చుచున్నయది. వింటివే?

సాంబు—(దీనవదనుఁడై) విన్నా నన్నయ్యా. ఆమోహనాంగుండు మనయన్నగారే యై యుండరుకదా.

(మరల తెరలో) హా! హా! ఏమి యీవైపరీత్యము.

మ. కలలోఁ గన్నులఁ గట్టినట్లయి మతిజ్ఞానంగ రాజుండు ను
జ్జ్వలభాగ్యోన్నతి వ్రాలెఁ జిత్రగతిఁ దోఁపన్ జ్ఞానరాజుండుటన్
గలఁతం జెంది తపించి వ్రాలఁ దుదకుం గాంతుం దరిం జేరి భ్రాం
తుల నా భీతవిలోలలోచనకుఁ బ్రద్యుమ్నుండు చిక్కెన్ గదా.

గదు.—(భయము నభినయించుచు సాశంకముగా) ఏమేమీ! నిజప్రతాపప్రభాపటల పరంతపుండు నసదృశ ధనుర్విద్యావిశారదుండు నిరుపమాన శౌర్య ధైర్య గాంభీర్య బాహువిక్రమసాహసోదారుండు నగు మా యన్నగా రొక్క కురంగ శాబకంబున కెట్లు చిక్కె? అయినఁ గాలవైపరీత్య మెట్టిదియో సంగతిఁ గనుంగొన దక్షిణాశ కరుగుటయే శ్రేయంబు. తమ్ముఁడా! పోవుదము రమ్ము.

(అని యిరువురు నిష్క్రమించుచున్నారు.)

[అంత శుచిముఖి ప్రవేశించి]

శుచి.—(స్వగతము) వహ్వా! నే లేడిరూపమును ధరించుటచే నాప్రయత్న మింతవరకుఁ గొనసాగినదికదా. ఈ ఘోరారణ్యంబునఁ బ్రద్యుమ్నకుమారుం డుత్తరదిశ నతి దూరంబున నుండ వార్తాలాపకైతవంబున గదసాంబులను దక్షిణాశ కనిపితిని. ఇంక నే నొంటిపాటుగ నాయుద్యమం బాపురుషవతంసునకు నివేదింప ననువగు. ఆహాహా! ఏమివాని మోహనాకారము.

క. అలచిత్రఫలకమందున
నెలమిఁ గొలుపు మోహనాంగుఁ డితఁడే యగు ము
ద్దుల మూట గట్టినట్టుల
లలి విలసిల్లెడు సమాన లక్షణములతోన్.

బాపురే!

క. మనసిజుఁడో చిత్రపటంబునఁ గలలక్షణముఁ బుణికిపుచ్చుకొనియెనో
యనదివ్యమోహనాకృతిఁ గనుపండువు సేయుచుండెఁ గానితఁ డహహా.

ఇట్టి సుందరాకారునిఁ జూచి యేకాంత మోహింపదు. ఆ చిత్రపటాంతర్గతుం డగు పురుషరత్నం బీప్రద్యుమ్నకుమారుండే యనుటకు సందేహ మిసుమంతయును లేదు. (అని యిటునటుఁ జూచి) అదిగో! ఆతండును మరలివచ్చుచున్నాఁడు. నే నదృశ్యరూపంబును గైకొని వానికి సమయోచితంబుగఁ బ్రత్యక్షమయ్యెదను. (అని తిరస్కరిణీముద్రను ధరియించుచున్నది).

[అంత ప్రద్యుమ్నుండు తిరుగఁ బ్రవేశించి]

ప్రద్యు.—(స్వగతము) అహహా! నే నెంతగుఱిఁగాఁ దఱిమిన నా హరిణంబును మరణంబు నొందింపఁ జాలనైతిని. ఏమి దానిపలాయనప్రభావము! పురబాహ్యమరుప్రదేశంబుల నాకస్మికంబుగఁ బ్రజ్వలించు కొఱవిదయ్యంబులకైవడి ఘోరమారుతఘూర్ణితంబగు రంధ్రాన్వితపాత్రంబులోని దీపకళికకాన్పించుకరణి నామాయాకురంగము నాకు దృశ్యాదృశ్యంబుగఁ గాన్పించుచు గతాగతవిలాసవిభ్రమంబుల నడియాసఁ గొలుపుచు నలయించి నన్ను భ్రమింపఁజేసియుఁ జివరకుఁ గన్మాఱంగె. ఏమి చెపుమా! నా దక్షిణనేత్రం బదరుచున్నయది. నానావిధవృక్షలతానికుంజనీరంధ్రంబగు ఘోరకాంతారంబున దట్టంపు టీగలమధ్యఁ జంద్రోదయంబునాఁ గొదమతుమ్మెదలబారుఁ గేరుచు నల్లగిలాడు శిరోజంబు లాపాదమస్తకంబుఁ గ్రేవలనొకచంచలాక్షి రాజాననంబు దృగ్గోచరంబైనట్లు దోఁచె. కాని,

ఉ. కాటుక కప్పుచందమునఁ గ్రమ్మినసాంద్ర ఘనాఘనమ్ములన్
దీటుఁగ వెల్గు నా మెఱుపుతీవయనంగఁ దమిస్రపుంజముల్
దాటొనరింపఁ బొల్చెడు మిణుంగురునా వనవాటిఁ జక్కికిన్
వ్రేటుఁగఁ దేజరిల్లి యుసురింగిన మోహనరూపమే మొకో.

ఏమి నా మతిచాంచల్యము! నే నాదినే యొకహరిణాక్షిం జూచి హరిణంబని యనుకొంటినో లేక హరిణంబు నే జూచి హరిణాక్షియనియే భ్రమించితినో తెలియరాదు. ఎట్లైననేమి? నిరర్థకప్రయత్నుండనై తిరుగవచ్చితినిక దా. ఇట్టి పరాభవమునుఁ బొంది నాతమ్ముల మొగము నే నెట్లు చూడఁ గలుగుదును.

శుచి.—(అదృశ్యతఁ బ్రద్యుమ్నునకు వినంబడఁ బ్రకాశముగా).

మ. భ్రమఁ గొల్పన్మదిలోనఁ జిత్రగతిఁ జేరంగ రామిక్రమారుండవై
తమి వెంబొంద శిలీముఖంబులను గుంరదం జేయఁగాఁ దూఁలె ధ
ర్మముఁ బూనందగు నావిలోలనయనన్ రంజిల్లదా నీడు దై
న్యముఁ బ్రద్యుమ్నకుమార! చేకొనఁగ వీరలానీకునిప్పట్టునన్.

ప్రద్యు.—(విని వెఱగందుచు) ఏమియీయాయద్భుతము! నాకీట్లదృశ్యరూపంబునఁ గర్ణరసాయనం బొనరించినవా రెవ్వరోకదా. ఆ కంఠకలనాదంబు విన నొకయెలనాగ యిం దెచ్చటనో కన్మొఱంగి యట్లు వచించెనని తోఁచుచున్నయది. కాని నాయందుఁ గ్రూరత్వ మారోపించి "ధర్మముఁబూనందగు" ననుటచే వ్యంగ్యాభిప్రాయంబు స్ఫురించుచున్నయది. అయిన నాచతురిక యెవ్వరో తెలిసికొనియెదను.

చ. నెలఁత! యదృశ్యరూపమున నీ విటురాఁ గతమేమి? వచ్చి నా
తలఁపునెఱింగి "లేఁడిఁగొను ధర్మముఁబూను" మటంచుఁబల్కఁ తా
పలుకులభావమేమి? తెలుపఁగనుపింపుము నీవు దేవతా
లలనవొ కృత్రిమంపు నబలామణివో వచియింపుమింపుగన్.

శుచి—(మరల ప్రద్యుమ్నునకు వినంబడ నదృశ్యంబుగా).

మ. అలప్రద్యుమ్న కరాంబకాహతులచే నత్యంతమున్ దూలుచున్
జలితస్వాంతముతోఁడ దిగ్భ్రమల నానావస్థలం బొందుచున్
బలిమిన్ బట్టఁదలంచు వానికిఁ దుదిన్ బ్రాప్తించు నాకోర్కెను
త్కలికన్ దీర్పఁగ నీకు గడ్డిఁ గఱవంగానయ్యెనే యేణమా.

కురంగమా! నీ వింకభయపడవలసిన యవసరము లేదు. వినుము.

చ. శరములదాఁకి కోడి విలసన్నవకుంజములందు దూరి పెం
దరువులనీడసోలి మది తన్మయతన్గొన నేలప్రాలి యీ
యురులను చిక్కనేల మృగయుండు దయామయుఁ డింక నిల్వుమా
మరలకు మాతఁడీతఁడె సుమీ మా చకితైణమ భ్రాంతివీడుమా.

ప్రద్యు—(ఆశ్చర్యమభినయించుచు) ఏమి యీయాయద్భుతము! ఆ కురంగ మెంత వెదకిన నెచ్చోటను గానరాదు. ఈవిధంబుగ నా మృగమును సంబోధించి పల్కువా రెవ్వరోకదా. ఈ మాయాంగన పలుకులు భావగర్భితములై యనుమానముఁ గలిగించుచున్నవి. "ఆతఁడీతఁడెసుమా" అనుటచే భావార్థము వెల్లడిగాకున్నయది. ఒకవేళ చకితైణసాదృశ్యంబుచే నన్ను వలచి తపించుచుండు నొక యెలజవ్వని విరహావస్థ నిట్లు వ్యంగ్యముగాఁ దెల్పుచుండెను కాఁబోలు. అయిన నీలేమయభిప్రాయం బెఱుంగ మరల నిట్లనియెదను. ఓయదృశ్యకాంతామణీ!.

చ. అడవి మదీయబాణహతి కందక యేణము కన్గొనంగ "నీ
వెయ్యెడ నిశితాశుగంబులకు నెంతయు నోడి తపించి తూలుచున్
బడలికవాయ సొమ్మసిలి పచ్చిక నేలఁ బరుండెదేఁ జేతిలోఁ
బడునిఁక నా కురంగ" మనిపల్కెదు నీదగు . . న మేమొకో.

మఱియు,

మ. మృగతృష్ణాంబులఁగోరు పాంథునిక్రియ న్మిథ్యామనోభ్రాంతిచే
నగడొందన్ హరిణంబు చిక్కెనని మాయాలాపము ల్పల్కుచుం
డఁగ నేలా? కనిపించిచెప్పు మది యేణంబో లేక యేణాక్షియో
మగువా! దాని గ్రహింప నెట్లగునో ప్రేమ న్నన్ను రంజింపుమీ.

శుచి.—(మరల నదృశ్యంబుగఁ బ్రద్యుమ్నునకు వినంబడఁ బ్రకాశముగా).

చ. ఇనసమతేజ! వజ్రపురికేగిన నందు మృణాళపద్మముల్
దనరుటఁ జంద్రుతో ముకుళితంబులుగా విను వానిమాటునన్
గను మొఱఁగెన్ కురంగ మటఁ గన్గొననౌఁ దడవేల నీవు వే
జని ముకుళీకృతాబ్జశశిసంగతిఁ బాపి గ్రహింపు మేణమున్.

ప్రద్యు.—(ఆశ్చర్యముతో) ఏమిది! ఈ మాయాంగనపలుకు లంతకంతకు మఱియు భావగర్భితము లగుచున్నవి. చంద్రసంయోగంబుచే మృణాళపద్మంబులు ముకుళించె ననుటవలన మృణాలసదృశంబులగు భుజంబులను మోడ్చి నిరుపమానలావణ్యప్రభాభాసితంబగు రాకాపూర్ణచంద్రాననంబున నిద్దంపుచెక్కులఁ గరతలంబులఁ జేర్చియుండుట స్ఫురింపఁజేసి వజ్రపురమందలి కొండొకమోహనాంగి విరహపరితాపంబును నర్మగర్భంబుగ సూచింపుచున్నది. ఆసుందరాంగి యెవ్వరోకదా.

ఉ. జీవనజాక్షి! నన్నుఁ బెనుచీకటి ఘోరవనాంతరంబునన్
ద్రోవఁదొలంగుపాంథువలెఁ దూలఁగఁ జేసెదె? భావగర్భితం
బౌవిధిఁబల్కెదేల? తెలుపంగదె యేలలితాంగిపంపునన్
నీవిటువచ్చినావొ రనుకణిమణి నేనెటుఁ జూడనేర్తునో.

శుచి—(మరల నటులనే యదృశ్యంబుగ) ఓ మోహనాకారా! వజ్రపురంబున.

చ. వలపులదొంతి మేలిజిగి పైడిహారంగులపూలబంతి పూ
విలుతునిచేకటారిమొన వేదురి కుంది కృశించి యాపురిన్

బొలుచు ప్రభావతీతిలకకేమముం గని నీ వహహా ప్రమోదర
జ్జులఁ దగుల న్వాలింబడఁగఁ జూతువె చేకొనకుండ దానినిన్.

కావున,

చ. సరసకుఁ జేరరాగ నిను సమ్మతిఁ గోరెడు దాని నేడు నీ
శరములబారిఁజిక్కి వివశత్వముఁ జెందినదాని నీదు స
త్కరుణఁ జెలంగుదానిఁ గరకంజమునన్బడనున్నదాని స
త్వరముగ సద్గుణప్రథిత ధర్మనిరూఢి గ్రహింపరాదొకో.

ప్రద్యు.—(సహర్షంబుగఁ) ఏమి! ఈమాయాంగన నన్ను "మోహనాకారా" యని సంబోధించుచున్నది. తాను వజ్రపురమందలి కొండొకవిలాసినీమణిపంపున దూతికగా వచ్చెనట. వజ్రపురనివాసిని చూడకయే న న్నెట్లువరించు? ఇది కడునాశ్చర్యముగ నున్నయది. ఆతరుణీమణిపే రెయ్యది మెట్టిదియోఁ దెలుపకయే నన్ను రమ్మనుచున్నది. ఇది యేమిమాయయో, తెలియరాకున్నది. అన్నా! ఏమిది. నా హృదయం బనురాగసదనం బగుచున్నయది. అయిన మరలఁ నిట్లనియెదను. (ప్రకాశముగా) ఓమాయలాడి !

ఉ. దూతికవయ్యుఁ గన్గొనఁగి తొయ్యలిరూపవిశేష మేమొ యే
రీతిని న న్నెటన్గని వరించెనొ చెప్పక నామనంబు ని
ర్భీతిఁగలంచె దేల? పృథివిన్ జెలి యంతమనోహరాంగియే!
లాతులు లేరె యాచెలివిలాసము మించిన మోహినీమణుల్.

శుచి.—(మరల నదే ప్రకారము ప్రద్యుమ్నునకు వినంబడ ప్రకాశముఁగా) ప్రద్యుమ్న కుమారా !

మ. చను నే లాతుల నెన్న షోడశకలాస్ఫారుండునై క్రాలు చం
ద్రునితో సాటియొకో మినుంగురులు నే రూపించి వర్ణింప నెం
తని యీచిత్రపటంబుఁ గైకొనుము స్థూలారుంధతీన్యాయరీ
తినిఁ గన్గొందగు నందొకింత తరుణీదివ్యస్వరూపోన్నతుల్.

(అని ప్రభావతిచిత్రపటంబుఁ బ్రద్యుమ్ననియొద్దఁ బడవేయుచున్నది.)

ప్రద్యు.—(చిత్రపటం బెత్తి చూచి హర్షపరవశుండై) ఓహో! ఏమి యీసౌందర్యము !

సీ. లేత వెన్నెలగాయు శీతాంశురుచి కాని
మొలకనవ్వులముద్దు మొగము కాదు

నిలుకడఁ జెందుచంచలవికాసము కాని
మెయిఁదీవ బంగరుమిసిమి కాదు
అళివికీర్ణములైన దళితాబ్జములు కాని
యాయతంబగు కన్నుదోయి కాదు
లావణ్యసరసి కల్హారసమితి కాని
రమణీయకరచరణములు కావు
గీ. దొండపండు గాని తొగరువాతెఱ కాదు
కంబుకలిమిగాని గళము కాదు
చిత్రమిదియు జీవచిత్తరు వెట్టిదో
చూచుటెట్లో నాదుచూడ్కు లలర.

ఓదూతికాతిలకమా!

మ. సకియా! నా మృగయావినోదసమరోత్సాహంబు తన్వంగిఁ గో
రిక దా వేడుకఁ జెంది చిత్రపురణోర్వి న్సర్వగా నియ్యెడన్
ప్రకటానూనవిమోహశృంఖలములన్ బంధించితో యేగతిన్
వికచాబ్జాక్షి జయింప వజ్రపురికిన్ వేవేగఁ బోనేర్తునో.

అకటా! ఏమిది!

శా. ధాటిం గంబళిపుర్వు పెద్దదయి లూతాతంతులం జిక్కి యా
రాటం బొందుచు నాను చిల్కయయి పర్వంజూడమే యట్ల యి
చ్ఛోటన్ జిత్రవిలోకనంబు లను రజ్జుశ్రేణిచేఁ జిక్కి చే
ష్టాటుం జెందుచు మాఱితిన్ భ్రమరకీటన్యాయరీతిన్ సఖీ.

శుచి:—(తనలో) వహ్వా! ఈతండు ప్రభావతీచిత్తరువును జూచి వాఞ్ఛించి యా లేపపై మరులుగొని మోహాక్రాంతుండై యున్నవాఁడు. వీనిమనంబుఁ దన్మయంబుఁగఁ జేయ నిదియే మంచిసమయము. ఏమన.

ఉ. పాదునఁ బాతి గింజ మొలువం జలపోషణవృద్ధిఁ జేసి స
మ్మోదమెలర్పఁ బుష్పఫలభూతినిఁ జెందమె వీనిడెందపుం
బాదున మోహబీజ మిటు పైదలిచిత్తరుదివి మొల్చె నే
సాదరలీల దానిఫలసంపద నెచ్చెలి కింపుఁ గొల్పెదన్.

(అని ప్రత్యక్షంబుగ నెదుటనిలువంబడి ప్రకాశముగా) శ్రీకృష్ణాత్మజా! వేఁట తమకంబుచే బడలికఁ జెందియుంటివి కాఁబోలు. హరిణంబుచిక్కెనా ?

ప్రద్యు.—కాంతామణీ! నీవెవ్వతెవు? ఏమికతంబున నీ విక్లేశతంబ చనుదెంచుచుంటివి! నాతోఁ బరోక్షంబుగ నదృశ్యవై నర్మగర్భంబుఁగ మాట్లాడినది నీవేనా ?

శుచి.—అవును. నేనే. నావృత్తాంత మొక్కింత దెల్పెద వినుము.

గీ నందనవనంబులోని మానససరస్సు
నందు విహరించుకలహంసబృందమునను
శుచిముఖినామమును గల్గి సుదతినగుచుఁ
దిరుగుచుందును సకలదిగ్దేశములును.

నే నుత్తరదిక్తటంబునఁ బరిభ్రమించుచుండ నం దొక్కచో మించుతీవను గేరు నొకచంచలాక్షి చెక్కిట నొకచెయ్యిఁ జేర్చి మందహాససుందరవదనారవిందయై,

చ. కలుముల నీను చిత్రఫలకంబుఁ గరాబ్జమునందు నిల్పి యు
త్కలికను జూచుచుండఁ గని తత్ఫలకంబునఁ గ్రాలునట్టి యా
చెలువముతోసమానమగు చెల్వము నీయెడఁ గానుపింప నే
నలరుచు నీమనం బెఱుఁగనట్లు వచించితిఁ గృష్ణనందనా.

ప్రద్యు.—(తనలో) ఆవాల్గంటి యీ చిత్రపటాంతర్గతయగు మోహినీమణియే గాఁబోలు. (ప్రకాశముగా) దూతికాతిలకమా! ఆ మందయాన యెవ్వతె ?

శుచి.—(నవ్వుచు) శ్రీకృష్ణకుమారా!

చ. అమితనిశాటకంటకమహాటవి నాశ్రయహీనమైన యు
త్తమమగునాత్మపల్లియు ముదంబునఁ దేనియలానఁ దేఁటితోం
డముస్పృశియించనట్టినునునంబుఁ బికంబు శుకంబుఁ జంచులన్
భ్రమఁగొని మోపనట్టి వరపల్లవముగా ఫల మద్దియేఁజుమీ.

మఱియు,

ఉ కమ్మసితావిఁ గొల్పెడు చొకాటపుబంగరుబొమ్మలాగు మే
ల్తమ్మికి నుద్దియా కరతలమ్మునఁ జిత్రపటంబమర్చి హాం
కమ్ముగ వాతెఱన్గఱచి కన్నులమెచ్చుచుఁ జూచుచుండు నా
కొమ్మనుగాంచి నేను భ్రమఁ గొంటిని మోహనిమగ్నునాటచేసేన్.

ప్రద్యు.—శుచిముఖీ! ఆవాల్గంటిసోయగ మెట్టిది?

శుచి.—వసుదేవపౌత్రా! వినుము.

క. నెలయో నెమ్మొగమో వె
న్నెలయో దరహాసరుచియొ నేనెఱుఁగ నహో
లలనామణిఁ గనినంత నె
జిలుఁగుపులకలెసఁగ మేనఁ జేష్టడితిఁ జుమీ.

మఱియు,

చ. అలికులవేణికన్బొమ శరాసనలీలఁ దృగ్లతావళిన్
విలసిలునారిగా భృకుటి నివ్వడిఁగాఁ గొనిముష్టి నాసికాం
చలమున కల్లలాగి వెలుచం దిలకం బొకముల్కిగాఁగఁ బాం
థులహృదయంబు లెల్లపుడుఁ దూలఁగఁ జేయు మరుం డుదగ్రుఁడై.

ప్రద్యు.—శుచిముఖీ! ఆ కొమ్మనుజూచి నీ వేమని భ్రమించితివి?

శుచి.—వినుము.

చ. కులుకు మెఱుంగుముత్తియపుఁ గోవలు నా నలరారు దంతప
జ్క్తులరుచి విద్రుమోష్ఠముల శోభను గూడుచుఁ దళ్కుగుల్కు చె
క్కులను గులాబివన్నియలు గూర్చ సరోజదళాయతాక్షి పూ
విలుతునిరాణి కాఁగఁ బ్రభవించె నటంచు భ్రమించితిన్మదిన్.

ప్రద్యు.—(తనలో) ఓహో! ఏమి యీ మోహినీమణిసౌందర్యము! (అని చిత్రపటంబుఁ జూచి) బలె! ఈ నారీశిరోమణి నిశ్చయముగా జగన్మోహినియే. మఱియు,

చ. ఇరులు సరోజముల్ నలలి తేఁటులు వెన్నెల చంపకంబు వి
స్ఫురదకళంకమౌక్తికవిభూతియుఁ గైకొని బ్రహ్మ మున్ను మే
ల్తరగతి చంద్రు షోడశకలల్గొని కన్య కురుల్కను ల్బొమల్
తరళిత హాస నాసముల దంతముల న్ముఖమున్ సృజించెఁగా.

శుచి.—ప్రద్యుమ్నకుమారా! ఆ కన్యామణిసౌందర్య మెంతనికొనియాడుదును. చూచి తీరవలయు నేగాని వర్ణింపనశక్యంబు.

శా. ఔరా యాతలఁ జుట్టివచ్చు కనులా హా యాకుచద్వంద్వమ
య్యారే యాజిగి కెంపుమోవి యరెరే యామందహాసంబు మ

ఝ్ఝారే యాఁగళమంగళంబు భళిరే ! యామోహనాకార మెం
దేరామామణిదైన గల్గునోకొ యా! యేణాక్షితోఁ బోల్పగన్.

ప్రద్యు.—ఓహో! శుచిముఖీ! ఆ మోహనాంగిసౌందర్య మంతయొప్పుచుండెనుగా?

శుచి.—సందేహమేమి? మఱియు నా కోమలాంగిసౌందర్యమే బాధనీయమై యామె నెమ్మనమ్మున కూరటఁ గలుగనీయకున్నది. ఏమన,

చ. వదనమునందు గ్రాలు మధుపమ్ములఁదోలుచు బాహుయుగ్మమున్
గదియుమరాళరాజి నెడఁగా బెదరించుచుఁ గేశపాశమం
దొదవిన వేడ్కఁగూడెడు మయూరములం దఱిమించి మోవి స
మ్ముదమునఁ జేరఁగోరు శుకమున్ బికము న్వెడలించుచుండెడున్.

ప్రద్యు.—(తనలో) ఓహో! ఏమి యా తరుణీమణిసోయగము! వర్ణనచేతనే సాత్త్వికభావంబుల మోహపరవశుండ నగుచుంటిని. ఆయమ్మలమిన్నను గన్నులారఁ జూచినచో నే నెంతవివశుండ నగుదునోకదా (ప్రకాశముగా) శుచిముఖీ!

ఉ. ఏలొకొయీవిధంబుగ నహీనవిలాసిని నుగ్గడింపుచున్
జాలము సేయుచుంటివిఁక చాలు స్మరాగ్నిరగిల్చితీవహా
తాలిమిఁ దూలెఁ బెన్వలపుఁ దార్కొనె వజ్రపురంబులోని కే
లీలఁ జొరంగనౌనొ కమలేక్షణ నేక్రియఁ జూచువాఁడనో.

శుచి.—రుక్మిణీతనయా! తొందరపడకుము. ఆ లేమయభిప్రాయం బెఱుంగకయే విరాళిఁజెందవచ్చునా? దైత్యాంతకుండవగు నీవు వరప్రభావుఁడైన దైత్యరాజుపురంబులో నెట్లుప్రవేశించెదవు?

(అంత తెరలో)

హా! సోదరా! ప్రద్యుమ్నా! నీ యనుంగుతమ్ములగు గదసాంబులను మఱచితివా?

స్రగ్ధర. హారాజీవాక్ష!నీవాహరిణమునకు!లోకైనై తివాయన్న! మాకున్
ఘోరారణ్యంబునందున్ గుహలఁబొదలలోఁ గూలఁ జేకూడెనయ్యో
దూరంబెట్లోగితే యార్తులమయితిమి ప్రద్యుమ్న!నిర్దోషులా మ
మ్మేరీతిన్ బాసితే యింకదేవరుశరణ మోయీశ్వరా!యింకమాకున్.

ప్రద్యు.—(విని సంభ్రమించుచు) అయ్యో! నాతమ్ములైన గదసాంబులు నాకైయరయుచుఁ బథభ్రష్టులై పరితపించుచుండిరి కాఁబోలు. ఓ తమ్ములారా! ఇదిగో వచ్చుచుంటిని.

(అని పటాక్షేపంబుఁగ నిష్క్రమించుచున్నాఁడు.)

శుచి.—(స్వగతము) ఇప్పటికి నాప్రయత్నము కొంతవరకు నెరవేరినదికదా. కొదువ కర్జంబుఁగూడ శీఘ్రకాలములోనే నెరవేరును. ఇప్పుడు ప్రద్యుమ్నకుమారుం డనుజులతోఁ గూడి ద్వారకాపురవరంబున కేగినను చిత్రపటంబు చెంత నున్నంతవరకు ప్రభావతీకన్యను మఱువఁజాలఁడు. కానిమ్ము. అనంతరకార్యమునకై ప్రయత్నించెదను. ఇప్పుడు దిగ్విజయంబుఁ జేయుఁబూని వజ్రనాభదైత్యుండు యోధవరుల తోఁ గొలువుకూటంబుఁ జేరియుండును. కావున నే నిప్పుడు తిరుగ వజ్రపురంబు నకే పోయెదను.

(అని నిష్క్రమించుచున్నది.)

గద్య.

ఇది శ్రీమద్వేంకటరమణకరుణాకటాక్షవీక్షణాసారసమాసాదిత రసబంధురకవిత్వవైఖరీప్రవీణాపస్తంబసూత్ర శాండిల్యసగోత్రపవిత్ర హోతృకుల కలశార్ణవరాకాకైరవమిత్ర వేంకటరత్నసుపుత్ర వేంకమాంబాగర్భశుక్తిముక్తాఫల వివిధ విద్వజ్జనవిధేయ వేంకటకృష్ణనామధేయ ప్రణీతంబైన ప్రభావతీప్రద్యుమ్నంబను నాటకరాజంబున ద్వితీయాంకము.





శ్రీరస్తు.

హయగ్రీవాయ నమః.

# ప్రభావతీప్రద్యుమ్నము.

## తృతీయాంకము.

—⋄—

రంగము: వజ్రపురము.

[ఆత్మీయసచివులగు సోమంధస తామ్రాక్ష కఠోరదంష్ట్రులతో వజ్రనాభుం
డోలగమునఁ బ్రవేశించుచున్నాఁడు.]

వజ్ర.—అరే ప్రధానులారా! అరే మంత్రులారా!

మ. ఖలుఁడై యింద్రుఁడు క్రిందుమీఁదెఱుఁగకే గర్వించి నాతోఁడఁ దో
ర్బలముం జూపఁ గడంగి యాహవమునన్ గాఁ బాఱె న్సురల్భీతిచే
నిలువన్ లేక మదీయదుర్భరకృధాగ్నిజ్వాలకున్ గాందిశీ
కులుఁగాన ద్దెసలం ద్రివిష్టపముఁ గైకొంటిన్ గదా నేర్పునన్.

ఇంక మన మా యమవరుణ కుబేరుల నిర్జించి వారిగర్వముఁ గూడ నీలాగుననే యడంపఁ బ్రయత్నింపవలయును.

సోమం.—ఆఁ! దేవా! దేవరయాజ్ఞకు వేచియున్నారము. మఱియు,

క. తుంటరితనమున మును ము
క్కంటిత్రిశూలమునఁ గోఁడె కాలొక్కఁ డదిఁ జనెన్
గంటువడియున్న యముఁ డదు
గంటఁడె మిముఁ జూచినంతనె యసురవరేణ్యా.

తామ్రా.—ఆఁ! దేవా! అసదృశనిర్వక్రవిక్రమప్రతాపప్రభాపటలపరంతపులగు తమ కీపాటి స్వల్పకార్యమునకుఁ బ్రయత్నింపవలయునా?

క. అప్పుల నిడఁ జాలుదు నని
గొప్పలు పదివేలు చెప్పికొను వరుణుం డే

చొప్పనఁ గడంగుమీతోఁ
దెప్పరమే వానిఁ గెలువఁ దితిజాధీశా.

కరో.—ఆఁ! దేవా! నవనిధులుఁ గలవనియు శంకరునిసఖుండ ననియు విఱ్ఱవీఁగు నా కుబేరుండు మున్నొక్కమానవునిచే నిర్జింపఁబడిన నిజసహోదరుండగు దశకంఠునితోఁ బోరి యోహటించి తన పుష్పకంబుఁ గోలుపోవుట యెఱుంగరే? ధనమదాంధతచే దుర్గర్వహతకుం డగుటయేఁ గాక యబలుండగు నా గంధర్వరాజును నిర్జించుట మీవంటి వీరాధివీరున కొక లెక్కయే? ఇంత యేల,

క. అక్షీణబాహుదర్పవి
పక్షులశిక్షించు మీప్రభావముఁ గని హ
ర్యక్షముఁ గనుకలభమువలె
యక్షేశుఁడుపరవకున్నె యసురాధ్యక్షా.

వజ్ర.—అరే మంత్రులారా! అఖర్వబాహాపరిస్ఫోటితనిర్వక్రవిక్రమప్రచారుండనగు నాతో నెవ్వరైనఁ బోరి జయింపఁగలుగుదురే? అరే యాప్తులారా!

చ. ఉరుతరఘోరవిక్రమసమగ్రుఁడనై చెలరేఁగి యిప్పుడే
తిరముగ నాజి బాహువులతీఁట యడంగఁగ నే నజాండమున్
సరసి మదేభలీల రవిచంద్ర మను ద్విధ వీతిహోత్ర కి
న్నర సుర సిద్ధ మానవ మృగాళుల న్వికలింప నెంచితిన్.

రోమం—ఆఁ! దేవా! ఏలినవారు మనంబునఁ దలంపుగొని కోపదృష్టితోఁ జూచినమాత్రాన నతల వితల సుతల రసాతల తలాతల మహాతల పాతాళలోకంబులును—భూలోక భువర్లోక సువర్లోక జనోలోక తపోలోక సత్యలోక బ్రహ్మలోకంబులును వానివానియందుగల సమస్తచరాచరజంతుసంతానంబులతో నిమేషమాత్రంబున భస్మీభూతంబులయ్యెడు. ఇంక తుచ్ఛులగు నీ రవిచంద్రాదులన నెంత?

తామ్ర.—ఆఁ! దేవా! దేవరవారిప్రాభవంబుఁ దలంచిరేని యజనారులైన గడగడవడంకుచుందురు. అట్లగుటచే,

చ. మహితభవద్భుజాహిఁగని మారుతుఁ డేక్రియ సంచరించు స
ప్తహయుఁడు దూపుమాసి పరితాపముఁ బొందఁడె చంద్రుఁ డీల్గఁడే
దహనుఁడు నీటఁ గూలఁడె విధాత వడంకఁడె మీపరాక్రమ
స్పృహ సుర సిద్ధ కిన్నరులకే పెరటఁగల్గు నరుండు లెక్కయే?

కఠో—ఆఁ! దేవా! మీ నిరుపమాననిరర్గళభుజార్గళవిజృంభితప్రతాపప్రభాపటలము హోగ్రజ్వాలాభీలంబైన బ్రహ్మాండకటాహంబున,

ఉ. మానిరి జన్నముల్ ఋషులు ♦ మానిరి హవ్యములం గొనన్ సురల్
మానిరి తాపసుల్ తపము ♦ మానిరి మానులు సద్వ్రతంబులన్
మానిరి హోమధేనువుల ♦ మానిత వేదముల న్మహీసురుల్
మానిరి యన్నపానములు ♦ మర్త్యులమర్త్యులు భీతచిత్తులై.

వజ్ర.—అరే కఠోరదంష్ట్రా! అరే తామ్రాక్ష! అరే రోమంథన! దురాత్ముండగు పురందరుండు మున్ను నాచేఁ బరాజితుండై యపగతగర్వుం డగుట యెఱింగియుండియు మదాంధచేతస్కులగు నా యమ వరుణ కుబేరాదులు నన్ను శరణు వేడరైరి. ఆఁ! ఏమి వారిపోతరము! హుం! (అని యాడుఁగఱచి పండ్లు పెటపెటఁ గొఱుకుచు) ఇప్పుడే వారిమదముఁగూడ సదమదముఁ జేయఁ గడంగవలయును. కావున మీ రందఱు యుద్ధసన్నద్ధులరై జైత్రయాత్రకుఁ బయనంబుఁగా మన వీరభటనికాయ్యంబునుఁ గట్టాయితంబుఁ గావించి రండు. నేను సర్వసిద్ధుండనై వచ్చెదను. పొండు.

రోమం—చిత్తము మహారాజా! (అని దైత్యామాత్యులు నిష్క్రమించుచున్నారు.)

వజ్ర—(నల్వలంకులఁ గలయఁజూచి) ఏమిచెపుమా! రాగవల్లరి యీలాగున వచ్చుచున్నది. ఎట్టైన నిది మంచిశకునము. నే నింక తడవుసేయనేల ?

(అని వజ్రనాభుఁడు నిష్క్రమించుచున్నాఁడు)

[అంత రాగవల్లరి ప్రవేశించి]

రాగ—(తనలో) ఆహా! ఎట్టికాలవైపరీత్యము లొదవుచుండె !

ఉ. పాయదు సౌధతల్పముఁ బ్రభావతి రేఁబవలట్లు కన్నుల
న్మ్రోయదు స్వప్నము ల్శకునముల్ గ్రహచారము లెల్ల కాకతా
ళీయముగాఁ దటస్థమగు ♦ లేమకుఁ బార్వతి స్వప్నమందు "నీ
కీయకళంకమూర్తియెను ♦ మీ పతి" యంచుఁ బటం బొసంగునే.

అసాధారణంబుగ నొదవు తోఁకచుక్కవలె సంఘటించిన యీ దేవిద త్తచిత్రపటంబువలన రాక్షసకులంబున కుపద్రవమే సంభవించునో శ్రేయముకలుగునో తెలియరాదు. నే నిప్పు డమంగళము లూహింపనేల ? కానున్నది కాకమానదు. ప్రభావతీకన్యాజ్ఞాప్రకారము శుచిముఖి నారయవచ్చితిని. ఆమె యెచ్చోటను గానరాదయ్యె.

ఆచిత్రపటాంతర్గతుండగు మోహనాంగునిజాడ లెటింగి వజ్రపురంబున కేతెంచెనో లేదో. ఏమి చేయుదును. మరల నంతఃపురంబునకేఁ బోయెదను. ఆఁ! ఏమిచెప్పుదు యా కల కలము!

(అంత తెరలో) 7/149

క. లేదే యంతికమున నిది
కాదా మృదుహంసతూలికాతల మిటఁ జం
ద్రోదయమున నలరుచుఁ గన
రాదు ప్రభావతి యెటేఁగె రయమునఁగనుఁడీ.

రాగ—(ఆలకించి వెఱఁగందుచు) ఏమిది! చిత్రలిఖితపురుషునిపై మరులుగొని విరహవేదనా దందహ్యమానమానసయై శుద్ధాంతంబునఁ గేళికాతల్పంబుపైనుండు ప్రభావతీకన్య కానరాకుండుట కేమిహేతువొకదా. ఒకవేళ శత్రువులెవ్వరైన నెత్తికొని పోయియుందురా? అ ట్లెల్లజరుగు? మఱియు,

క. ఈ వజ్రపురములోనికి
రా వశమే యజునకైన రా మృతిఁజెందుక్
భావింపఁగ నంతఃపుర
మేవిధిఁ బరులకుఁ జొరంగ నిక శక్యంబా.

ఆ కన్యామణి శుచిముఖి నారయుటకై తానే బయలువెడలెను కాఁబోలు.

(మరల తెరలో)

మ. అకళంకాకృతిఁ గేళికావనములో నా చంద్రకాంతోపల
ప్రకటంబౌ మణిమంటపంబుపయి శోభస్ఫూర్తిఁ బున్నాగ చం
పక వల్లీయుత కుంజమధ్యమున నభ్రంబందు విద్యుల్లతో
త్సుకతఁ బొల్చుఁ బ్రభావతీరమణి సంతోషంబు గల్గంగదా.

రాగ—(సహర్షంబుగ) ఇప్పుడు నాప్రాణములు కుదుటఁబడినవి. నే నింక రయంబున నా కనఁబడెడు కేళికోద్యానవనంబున కేగి మాప్రభావతినిఁ గలిసికొనియెదను.

(అని నిష్క్రమించుచున్నది)

ఇది విష్కంభము.

[అంత శృంగారవనంబున లతామంటపంబుపైఁ బ్రభావతి ప్రవేశించి]

ప్రభా—(సుమాళంబున దేవీదత్తంబగు చిత్రపటం బవలోకింపుచు) ఓహో! ఈమోహనాకార మెంతరమణీయముగా నున్నది!

కవిరాజవిరాజితము.

కలకలలాడు మొగంబునుఁగాంచిన కన్నులపండువుగా నహహా
యలరువజీరొ హిమాంశుఁడొ గాక జయంతుఁడొ యీతఁడటంచును నే
దలఁచుచు నామదిఁ దన్మయతన్గొని తాలిమిదూల సదాతమిచేఁ
బలుమరు మారుని బారికిఁజిక్కుచు బాధలకిమ్మెయిఁ బాల్పడితిన్.

ఆహాహా! చూచినకొలంది యీ మోహనాంగుని సుస్వరూపము కన్నులకు మిఱుమిట్లు గొలుపుచున్నయది. బలె!

మత్తకోకిల.

ఈ నిగారపుచెక్కుటద్దము లీ ప్రసన్నముఖంబు నా
జానులంబితబాహుయుగ్మముఁ జక్కనౌ మెలిమీసముల్
మాసితంబగు సింగపుంగొదమన్ హసించెడు మధ్యమున్
గాన నిట్టి విలాసలీల జగంబునం దెట గల్గునో.

వహ్వా! దేవినిర్దిష్టుండైన యీ నవమన్మథుండే నాకుఁ గాంతుండైనచో నాభాగ్యమే మనవచ్చు.

మ. తరుణాబ్జ న్నిరసించు నెమ్మొగము ముత్యంపు న్సరాల్గేరు ప
ల్వరుస ల్పద్మము నేలు కన్గవ విశాలంబా నురంబు న్మనో
హరమా తీవియుఁ దళ్కుమేల్పసిఁడిచాయన్వ్రేల్గు దేహంబు న
ద్దిర! యీ యుగ్గులు దేరుముంగురులు నుద్దీపించు లోఁగోరికల్.

నావంటి మందభాగ్యురాలి కిట్టిసుందరాంగుండు లభించునా?

సీ. కోరి యీ మన్మథాకారుండు నాచెంత
కరుగుదెంచెడుభాగ్య మబ్బునొక్కొ
నాచెంత కేతెంచి నాయందు దయయుంచి
నన్నుఁ గైకొనుకల్మి యున్నదొక్కొ
కైకొని వెల్లుబ్బు కాంక్షలన్నియుఁ దీర్చి

మెలయించువైభవం బెసఁగునో కో
ఎలయించి ప్రేమ నం దిలకించి తమిమీర
ముద్దాడుసిరి నాకుఁ బొసఁగునో కో
గీ. ముద్దుగొని నాదుకురులను దిద్దునో కో
కురులుదిద్దుచు ముచ్చటల్ గొలుపునో కో
కాంతునిం గూడుసౌఖ్యంబు గలుగకున్న
ప్రాణుగానని లతమాడ్కి చానఁ బతుకు.

అకటా! ఏమిచేయుదును.

క. జనకుని యాజ్ఞాశృంఖల
వినిబద్ధశుకంబ నగుచు వెతలొందెదు నే
నన యము సునుశరకీలల
నెనసి మడియకుండ నాకు నెటు విభుఁడబ్బున్.



దేవీఁ ర్వీతుండైన యీ మహాపురుషుని ప్రభావ మెట్టిదియో తెలియను. ఆహా!

మ. అరవిందంబులఁ గేరునేత్రముల రక్తాశోకభూజాంగసుం
దరతన్ జూతనవీనపల్లవసమానంబైన కెమ్మోవిఁ గుం
దరదప్రాజిత రాజి నుత్పలవినోదంబందు మందస్మిత
స్ఫురదబ్జాననశోభఁ జిత్రమిటు నన్మూర్ఛిల్లఁ గాఁ జేసెడున్.

ఓభవానీ! నే నా యంతిపురంబున హంసతూలికాతల్పంబుపై శయనించి నిద్రింపుమండ నీ వట్లు నిక్షేతుక జాయమానకటాక్షవీక్షణంబుల నాకు సాక్షాత్కరించినది నా మేలుకొరకా కీడుకొరకా ?

శా. ఏలాచిత్రపటంబు నా కొసఁగితో "ఈతండె నీకాంతుఁడో
బాలా" యంచును కూర్మిచే నతని నెబ్బంగి న్విలోకింపఁగా
వీలా నా నవమన్మథున్ గనఁగ నుఁవిల్లూరుచుంటిన్ గదా
తాళంజాల విరాళి నావరునిఁ జెంతన్ జేర్పుమీ పార్వతీ.

మ. నను నెక్కించితి వమ్మ చెట్టుపయికిన్ నన్నేలఁగూల్పంగ ని
చ్చెనఁదీయం గమకింపకమ్మ యిటు నాచిత్తం బెలర్పంగ మో
హనమూర్తి న్వరుఁ డంచుఁ దెల్పితివి యేమమ్మా కానరాఁడాతఁ డెం

దునరాజిల్లునో తెల్పుమమ్మ యటుఁ బోకదు న్నాథునిం గూడఁగన్.

అకటా! ఈ చిత్రపటంబున విరాజిల్లు నామనఃకాంతుని మోహనాకారముఁ జూడంజూడ నా యంతరంగంబున నపారపారావారవీచికాపరంపరలవడువునఁ గోర్కు లుప్పతిల్లుచుండె. వాని నెట్లడంపనగు? హా! దేవీ! భవానీ!

హిందూస్థాని తోడిరాగము-అటతాళము.

వసుధావృత్తము.

గిరిజా! సతి! శాంకరి! పార్వతి! నే
శరణంటిని నన్గరుణింపఁ గదే ॥గిరి॥
జననీ! యిటు లంకదనిమాగ్నిన్ఫలమున్
గనఁ జేసితి వేకమని చెల్పుదునో ॥గిరి॥
తనివొందునె యింకదున నావరు నే
గన నీతఁడు నాకమనము న్గొనె నో ॥గిరి॥
మరుబారికి వేకమరుఁజిక్కితి నీ
విరహాగ్నికి నాకతరమే నిలువన్. ॥గిరి॥

(అని నిట్టూర్పువిడిచి) అయ్యో! ఏమిచెపుమా! చెలికత్తియు లింకను రాదైరి.

[అంత రాగవల్లరి ప్రవేశించి]

రాగ—(తనలో) నా నెచ్చెలియగు ప్రభావతినిఁ గలిసికొనుటకై యీయారామమంతయుఁ వెదకితిని. ఆ కన్నియ యెచ్చోటను గానరాదయ్యె. ఏమి చేయుదును. (అని నల్వంకులఁ గలయఁజూచి) ఓహో! ఏమి నాభాగ్యము!

చ. వికసితపుష్పగుచ్ఛములుకర్వేలెడు చంపక పారిజాత కిం
శుక సురసాల కేతకి యశోక కుజావృతమాచు నూత్నవ
ల్లికలలరన్ వితానముల కేలిలలెలర్చునికుంజమందు వే
దికపయి మాప్రభావతి యకదేకనుపండువుఁగొల్పెడు న్బలే.

అబ్బా! హిమకరుం డుగ్రుండై తనయుష్ణకిరణంబులఁ బాంథజనుల వేఁపఁదొడఁగె.

గే. ఈ వెన్నెలకాక మానెచ్చెలి యెట్లు సహించునోకదా.

చ. చెలి వరియింప దేవి మునుకజిత్రపటంబున వ్రాసినట్టి యా
చెలువుని నామెపై నిపుడుకచి త్తజుఁ డుగ్రశరాగ్నికీలలన్

జలమునఁ గ్రుమ్మనోయనఁగ స్వాంతమునన్ విరహాల్తపింపఁగా
నలినరిపుండు తీవ్రకిరణంబులఁ బైఁ బ్రసరింపసాగెఁగా.

నే నిప్పు డచ్చోటికేగి మా ప్రభావతినిఁ గలిసికొనియెదను. (అని పరిక్రమించుచున్నది)

ప్రభా—(తనలో) ఓసమస్తదేవతలారా! నామనోభీష్టంబు నెరవేర్ప మీరైనఁ దోడ్పడుఁడు. మీకు నమస్కరించెదను. (అని యంజలిఘటియించి.)

సీ. కమలబాంధవ! నీదు కరములఁ గొని తెమ్ము, చిత్తజాకారు నా చిత్తచోరు
సౌరభ్యహార! నాదు సరసకు విసరుము, చిత్తజాకారు నా చిత్తచోరు
సాహసోదార వలాహకా! తోడ్తెమ్ము, చిత్తజాకారు నా చిత్తచోరు
భూరిసత్కృపవేల్పులారా! తోడ్కొనిరండు, చిత్తజాకారు నా చిత్తచోరు
గీ. భ్రమరశుకపికశారికాప్రముఖులార!
మారునిశరాగ్నికీలలమ్రగ్గుచుంటిఁ
జెలఁగి మీరైన నా చెంతఁ జేర్పరాదె
చిత్తజాకారుఁ డైన నా చిత్తచోరు.

కట్టా! నే నీ మన్మథార్తి నెట్లు సహింపఁగలుగుదును.

చ. కలతజనించె మేనువణఁకం దొడఁగెన్ జలిలేక యెండలోఁ
బులకలెసంగెఁ జెమ్మటలపూర్వముగా విరబారు నెల్లెడన్
దలఁపులు హెచ్చె లోనతనుతాపముచే స్మృతితప్పుచుండె ని
ప్పలపయిఁ గూరుచున్నగతిఁ బుప్పొడిసెజ్జయుఁ దోఁచె నక్కటా.

హా భవానీ! (అని మూర్ఛిల్లుచున్నది)

(అంత రాగవల్లరి సమీపించి.)

రాగ—సఖీ! ప్రభావతీ!

చ. పరఁగ నిదేమిచిత్రమె ప్రభావతి! నీ సఖినైన రాగవ
ల్లరి నిదె వచ్చియుంటిఁ గనులం గనరాదటె పెన్విరాళి పై
మఱచితె యెంత నిన్ను బ్రతిమాలినఁ బల్కవిదేమి పాపమే
కరుణ యొకింత నాపయినిఁ గల్గదె కోపమటే సఖీమణీ.

అన్నా! ఈతరుణీమణి మూర్ఛిల్లియుండెనుకదా. ఏమి చేయుదును.

(అని చెంతఁ గూర్చుండి విసరుచున్నది)

ప్రభా—(కన్నులు తెఱచి చూచి) ఓహో వచ్చితివా! నన్నొక్కసారి బిగియఁ గౌఁగిలింపుము. (అని లేచి కూర్చొనుచున్నది.)

రాగ—సఖీ! ఇంతకన్న నాకు సంతోషదాయకమేది కలదు? (అని యట్లు చేసి) ప్రియసఖీ! నన్నెవ్వరని భావించితివి? నీ నెచ్చెలినగు రాగవల్లరినిసుమీ. నీ వెంత మాదపుపని జేసితివి!

మ. చనునే నీవు భయంబు లేకిటుల నిచ్ఛాలీల నీవి వ్వనం
బున వర్తింపఁ గచంబుఁ బల్కులు ముఖంబుం గన్నవం గాంచి మా
రిన సైరింతువె కేకినీ పిక చకోరీ షట్పదంబుల్కటా
ఘనవేణీ! కలవాణి! చంద్రవదనా! కంజాక్షి! నీకేతగున్.

నెచ్చెలీ! నేడు నీకింతచొరవ కలిగినదేమి?

చ. చలువలొసంగు తెమ్మెఱ లసహ్యములంచును గమ్మతావులన్
గొలుపు సుమంబులెల్ల ములుకుల్వలె దోఁచునటంచుఁ దేఁటి పా
టలువిన సూదిపోటులగుటం జెవిఁ దూఁటొనరించు నంచు ని
చ్చలు మును వంతికంబునను శయ్యఁ దొలంగ విశేల వచ్చితే.

ప్రభా—(తనలో) కటకటా! ఈ దుస్తరమదనానలంబు సహించు టెట్లు?

మ. కుదురై నిల్వదు మానసం బురువడిం గోలాహలస్ఫూర్తిఁ బా
యదుగా మన్మథ జృంభణంబు నిక నేమైనన్ సరే నాకుతీ
రదు చెప్పం జెలితోఁడ సిగ్గు పయికిన్ రానీయదిం కేమిసే
యుదు నే కుత్తుకబంటికాఁగ వలపెట్లోర్తున్నదే పార్వతీ.

రాగ—ప్రియసఖీ! కుసుమసుకుమారివైన నీ వీ హిమకరునియుష్ణకిరణంబుల కెట్లోర్చు చుంటివే?

సీ. సింగారముం గారు బంగారు రంగారు
తనువల్లి రేయెండఁ దాళఁగలదె
నెలఁబోలు తెలిడాఁలు గలమేలు జిగినేలు
వదనమీ యెండ కోర్వంగఁగలదె
బిసతంతు పసవింత మిసిమింతఁ గొనుబాహు
లతిక లీయెండలోఁ బ్రతుకఁగలవె

ననలూన మనలేని ♦ గొనబైన ననుపాద
తలము లీ యెండలో ♦ నిలువఁగలవె

గీ. మిలమిలను గ్రాలు కలువఱేకులను బోలు
లీల వాలారు నిడువాలు ♦ మీలుకన్ను
లెట్టు లీ యెండఁ జూచి సహింపఁ గలవె
ఎంతపనిఁ జేసితివె సాహసించి యబల.

ప్రభా— చెలీ! రాగవల్లరీ! భవాని కరుణారస పూరితయై నాకొసంగిన యీ చిత్రపటంబును నీవు చూచియే యుంటివికదా.

గీ. సూదిగంటఱాయిఁ ♦ జూచినంతనె నొక
సున్న యినుము చేరకున్నె దానిఁ
జిత్రపటముఁ జూడఁ ♦ జిత్త మీ దేహంబుఁ
బాసిపోయెఁ దత్ప్రభావమునను.

రాగ— ప్రియసఖీ! ఏల నీ విట్లు మిథ్యామనోభ్రాంతులం దవిలి వగలపాలయ్యెదవు?

మ. చనునే చిత్రపటంబులో ప్రతిమ నాసక్తి న్వరింప న్మనుక్
గనసైన న్గనలేదు వానినెచటన్నా కెన్నఁ డెవ్వారిచే
విననైన న్వినలేదు వానికథ నుర్విఖ్యాతిఁగా నేల యో
వనజాక్షీ! మృగతృష్ణ వారిఁ గొనఁగా ♦ భావింతువే మోకదా.

ప్రభా— అయ్యో! వెఱ్ఱిదానా! అట్లనియెద వేమే?

చ. ఉఱు ముఱుమంగ మేఘుఁగన ♦ నుత్సుకత న్నెమళుల్కలాపమున్
విరియఁగఁజేసి నృత్యములు ♦ వేమరుసల్పవె సైకతంబులన్
మురియుచుఁ జిత్రదర్శనవి ♦ భూతినిఁ దల్లి ఖఁత్రప్రపూరుషున్
నరునిఁగఁగోరి వెస్వలపు ♦ పైకొన నువ్విళులూరు టబ్రమే.

కావున, (అని చిత్రపటంబు రాగవల్లరికిఁ జూపుచు).

క్రౌంచపదవృత్తము.

బాలరో నేనీ ♦ వారిజనేత్రున్ ♦ వరునిఁగ మనమున ♦ వలచితిఁగానన్
జాలిఁదొలంగన్ ♦ జాలక యుంటిన్ ♦ సకియరో! విభుఁడెటు ♦ సరసకువచ్చున్

గోలఁగఁబత్తుఁగల్గూయుచునుండెన్ గుదురొందవదుములుఁ గులవలెనొంపన్
దాళఁగలేనే తామరసాక్షీ! తమినిలుపఁగ నికఁ దరమటెనాకున్.

రాగ—చెలీ! మహావైభవసమన్వితురాలవై యుండియు నీవిట్లు విరాళిఁజెందవచ్చునటే!

ప్రభా—ఓసి తెలివితక్కువదానా!

మ. చెలియా! యీ నవమోహనాంగునకునై చెల్వారు భాగ్యంబు రా
గిల సంప్రాప్తముఁగానిచో ధనదు నిక్షేపంబు నా కబ్బినన్
ఫలమే? యామని గుజ్జమావిపయి నిల్వంగోరుచున్నట్టి కో
యిల బంగారపుపంజరాంతరమునం దేలీల రంజిల్లునే?

రాగ—సఖీ! ప్రభావతీ! దేవీప్రభావంబుచే నీ కిట్టి దుర్భరమనోజవిరాళి యంకురించెఁ గాఁబోలు. నెచ్చెలీ! విరహిణీజనరిపు సంకీర్ణం బగు నీయుపవనంబున కేకతంబ నీ వేలవచ్చితివే?

మ. నవలా! యొంటిగఁ గేళికావనములోన న్సంచరింపంగ ని
ట్లవునే? చంద్రమయూఖసంహతులకే ట్లాసైచెదే యక్కటా!
దవుల న్నన్నిటుఁ ద్రోయఁజూచితివె పంతాన న్మనున్నన్నుఁ బా
యవు రా నియ్యెడకు న్భయంబు మది లేదా నీకు వాదా చెలి.

ప్రభా—సఖీ! రాగవల్లరి.

ఉ. ఊరకవత్తునొక్కొ మృగయుం డెరఁ జూపుచుఁ గన్మొఱంగి కాం
తారమునందుఁ బెన్మకముఁ దద్దయుఁ గ్రైకొనులాగు మోహనా
కారముఁ జూపి నాకెరఁగ కంతుఁడె నామనమన్మృగంబు నీ
తీరున దొంగిలించెఁ బడఁతీ! వినవే యికనేమి సేయుదున్.

రాగ—(నవ్వుచు) చెలీ! నీవా పూవింటిదొరనే వరించితివా యేమి ?

ప్రభా—చెలీ! నా మనోహరుని చిత్రలిఖితమోహనాకారము నీవు చూచియుండియు నట్లడిగెదవేమే? మరల నొకసారి చూడుము. (అని చిత్రపటముఁ జూపుచు).

సీ. తరుణార్కబింబంబుఁ బురుడించు నెమ్మోము
చక్రస్తనులకు నాసక్తిఁ గొలుప
జలజదళాయత చారునేత్రంబులు
నిలికులవేణులఁ సలరఁజేయ

చంద్రికారుచిఁ గేరుచుఁ జక్కనిచిఱునవ్వు
ధరఁ జకోరాక్షులఁ దనుపుచుండ
మృదుపల్లవంబులఁ మించినయధరంబు
పికవాణులకు నతిప్రియమెలర్ప

గీ. నంబుదముఁబోలు కేశబంధంబు నీల
కంఠకంఠుల రంజింపఁ గడువెలుంగు
మోహనాకృతిముద్దులఁ మూటయనఁగ
మారునకుఁ గాక నితరు లెవ్వారి కబ్బు?

రాగ—అవునే. ప్రియసఖీ! ఈ మోహనాంగుండు నిశ్చయముగ మన్మథుండే కావలె
యు. ఏమన.

చ. శివునితపంబు భంగపరిచె న్నను నెట్టిశితాశుగంబులన్
బవరమునందు శంబరునిఁ బట్టి వధించెనో యేశరంబులన్
భువనముల న్విమోహగతిఁబొందఁగఁజేయునో వేనిచేత నా
యవితథబాణజాలమన నాతనిచూడ్కులు తోఁచుచుండెనే.

ప్రభా—(నిట్టూర్పు విడుచుచు) హా! ప్రియసఖీ!

ఉ. బాలరో! సోకుదయ్యె మొక పట్టున నావహిలంగఁ జంద్రుఁడున్
కేల దవాగ్ని పైఁగురియ వృక్షులతాంతములన్ శుకాళి నీ
నాలుగురీతుల న్విను ము నాలుగు ప్రాణములూడె నాదు హృ
ల్లోలునిఁజూడ నై దవది లోలమృగాక్షి! తపించుచుండెనే.

హా! హా! మనోహరా! (అని మూర్ఛిల్లుచున్నది.)

రాగ—(సంభ్రమించుచు) అయ్యో! మా నెచ్చెలి మరల మూర్ఛిల్లినది. ఈమె మదనా
నలం బెట్లుచల్లారునోకదా. ఏమిచేయుదును.

క. మదనా! చిత్రరణోద్ధతి
కదనా? బొమ్మవింట నిర్దయన్ జూడ్కులెతు
మ్మెదనారిగ సోయగము
ల్కదనాటఁగఁజేసి చెలియ నేచుటతగునా?

ఓదోషాకరా !

ఉ. దండితనంబుచే నమృతధాముఁడనంచును గ్రూరవృత్తి రే
యెండనుగాచి పాంథజనబృందము వేచెదె చందమామ! మా
యండజవేణిపైని జలజమా మలయానిల! చాలుచాలు పో
పొందు కృతఘ్నులై పలుకఁబూనక కీరములార! మీరిటన్.

ప్రభా—(మూర్ఛతెలసిలేచి) చెలీ! నేజీవింపఁగలనా?

రాగ—ప్రియసఖీ! భయపడకుము. నీ విపుడు విరహజ్వరపీడితవై యున్నదానవు. కావున మన మిప్పుడా వికసితారవిందసుందరంబులగు పద్మాకరకూలంకషసైకతప్రదేశంబుల విహరించి వత్తము రమ్ము. అచ్చోటి చల్లనిపిల్లగాడ్పులవలన నీ విరహతాపం బోకించుక యుపశమించును. సందేహించెదవేల? రమ్ము. అయ్యో! ఇదేమే?

మత్తకోకిల.

కోమలాంగిరో! కోపమేలనె క్రమ్మరందగ దేవనిన్,
నీమనంబునఁ గల్గుకోరిక నే నెఱుంగనిదానసే?

ప్రభా—ఏమి కారణమే దవానలమేర్చుచుండెను నామదిన్?
భామినీమణి! నిల్వకుండెనె ప్రాణము ల్మెయి నక్కటా!

రాగ—రమ్మురమ్ము లతాంగి! యంతిపురమ్ములోనికిఁ బోదమే,
కమ్మవిల్తు వశమ్ముకాదటె కాంత! యీ వనమంతయున్.

ప్రభా—తెమ్మెఱల్వయిపీవఁ బుప్పొడి తేనెవాకలు దాఁటి నే
నెమ్మెయి న్నిను మంతికంబునకేగఁజాలుదునే చెలీ?

రాగ—కాంత వీణియమీటి హాయిగ గానము న్సలుపంగదే,
చింత లేలనె నీమది న్విలసిల్లరాదటె వేడ్కలన్.

ప్రభా—ఇంతి! చిత్రపటంబులోని యహీనమోహనమూర్తి యే
చెంతనుండెనో తెల్పిన న్విలసిల్లఁగల్గెదనే చెలీ.

రాగ—చిత్రపుంబటమందురాజులు చెల్వుఁడెవ్వఁడో వాని చా
రిత్రమెట్టిదో నాకెటు ల్వివరింపశక్యమె కోలీ.

ప్రభా—నేత్రపర్వముకాఁగ నా కమనీయవిగ్రహుఁ జూడకే
గాత్రమెట్టుల నిల్పనేర్తును । కంజలోచన! నే నికన్.

రాగ—ప్రియసఖీ! నీ మనోహరుండగు చిత్రలిఖితపురుషుని జాడ నరయ నేనుఁగూడఁ బోయివత్తునా ?

ప్రభా—(ప్రసన్నవదనయై) చెలీ! ఇంతకన్న నీవు నాకుఁ జేయగల మే లెయ్యది?

గీ. ఖరకరుని యుష్ణకిరణాళిఁ । గ్రాఁగు పాంథ
గణము కడి చల్వ మేఘుండు । ఘనతఁ జెందె.
మారనిశితాస్త్రకీలల । మ్రగ్గునన్నుఁ
దనుప నాథునిఁ దోడ్తెచ్చి । ఘనతఁ గాంచు.

రాగ—మంచిది. (అని యటునిటుఁ జూచి సహర్షంబుగ) వహ్వా! సఖీ! అదిగో చూడుము. (అని యంగుళిచేఁ జూపుచు.)

వృషగతిరగడ.

సకియరో! మనసారఁగను మా । సరగ శుచిముఖి । సరసఁ జేరును
వికలతన్గొని । వెతలఁ జెందెడు । విధముఁ జూచిన । వెలది కేరును.

ప్రభా—(సోత్కంఠయై లేచి సంభ్రమించుచు) ఏమేమీ!
వనితరో! చెలి । వచ్చుచుండెనె? । వడిగఁ గొని రా । వలదె కూరిమి
మనసిజాగ్నిని । గ్రమ్ముచుండదె । మదవతిరో నా । మనము పేరిమి.

రాగ—కలికిరో! నీ । కాంతుజాడలు । కన్గొనందగుఁ । గడుముదంబున
నెలమితో నెదు । రేగెదను నే । నిందువదనరొ । యీ నెపంబున.

ప్రభా—ఏమె శుచిముఖి । యిటకునా హృద । యేశుఁ దెచ్చునె । యింపుమీరఁగ
(అని యాదిక్కు నుపలక్షించి విచారముతో)
కామినీమణి! । కాంతునిప్పుడు । గాంచలేనొకొ । కన్నులలరఁగ.
(అని నిట్టూర్పు విడుచుచున్నది )

[అంత శుచిముఖి ప్రవేశించి]

శుచి—(తనలో) ఈ ప్రభావతిలక్షణంబుఁ జూడ నీమె చిత్రపటాంతర్గతాకారుండగు ప్రద్యుమ్నకుమారునిపై మరులుగొని విరహార్తిఁ జెందుచుండుట విశదమగుచున్నది.

ఏమన,

చ. ప్రమదము మీఱఁ జెన్నలవు పైకొనుటం జెలికిప్డు పాండిమం
బమరెను గండపాళి హృదయంబునఁ గోర్కులమంద మాట మాం
ద్యముఁగనె యానము ల్విరతి దైన్యము భీరుతనంబు లెచ్చెఁ గా
యముఁ గృశియించెఁ జిత్రఫలకాంతరమూర్తి వరించెగావునన్.

నా ప్రయత్నమునకు భగవతీభగవంతులుఁగూడఁ దోడ్పడుచుండిరి కాఁబోలు. ఈ లలనామణిపైఁ బ్రద్యుమ్నకుమారుండును బద్ధానురాగుండయే యున్నవాఁడు. కావున వీరిద్దఱికి దాంపత్యంబు సమకూర్చుట నా కింక సుకరంబయ్యెడు. (ప్రకాశముగా.)

సీసపద్యము.

నెలత! నీముక్కెరసీలమా?
ప్రభా— కాదు సందియమేల యాణిముత్తియమె చెలియ
శుచి—పడఁతి! నీసందిళ్ల బాహుపుర్లలె?
రాగ— కావు మితిఁజూడనిడినయూర్మికలె కలికి.
శుచి—కాంత! నీపాలిండ్లఁ గస్తురియలె?
రాగ— కాదు కనుదోయికాటుకకప్పె సకియ.
శుచి—రమణి! కర్ణికల వజ్రముఁదాల్చితివె?
రాగ— కాదు ప్రాఁగెంపుతునుకలరంగె ప్రోడ.
శుచి—గీ. పరగునిటులేమె మనప్రభావతివిధంబు?
రాగ— కంబుగళ! యూర్పువేడిమి కార్శ్యమహిమ
బొప్పములు గండపాండిమపరిణతియును
నెక్కొనుట కింతి కమ్మెయి నీకుఁదోఁచె.

శుచి—(తనలో) ఏరికైన విరహాతిశయంబుచే నిట్టియవస్థలు కలుగుట సహజమే. (ప్రకాశముగా) సఖీ! ప్రభావతీ! నీవు మాట్లాడక యూరకుంటివేమి?

ప్రభా—అయ్యో! శుచిముఖీ! నా మనోభీష్టం బెఱింగినదానవయ్యు గాలయాపనము చేన న్నేల జాలిం దూలించెదవు?

మ. రమణీ! జాలము సేయకే వలపునోర్వన్ జాల నీ వావలో
త్తమువాడ ల్గుఱుతించి రాఁ జనఁగ నోతన్వంగి నే నిన్ని నా

ళ్ళమితానంగదవానలక్షుభితనై యత్యంతమున్ స్రుక్కి ది
గ్భ్రమఁ గార్చిచ్చునఁ జిక్కుపక్షివలె నీకై వేచియుంటిన్ సఖీ.

ఇంత యేల,

క. పిడికిటనిడికొనియసువులఁ
బడఁతీ! నినుఁజూడఁగోరి పరితాపముచే
నడలుచునుంటిని సమ్ముద
మిడఁ దెలుపవె నాథుఁడెవరొ యెందున్నాఁడో.

రాగ—సఖీమణీ! (అని శుచిముఖికరంబుఁ బట్టుకొని)

క. చెలియరో! నీచే నున్నది
కలికిబ్రతుకు నామెకోరు కాంతునిజాడల్
దెలియఁగఁ బలికి సుమాస్త్రా
నలమును జల్లార్పరాదె నళినదళాక్షీ.

మఱియు,

గీ. అవనిఁ దల్లికైన నక్కచెల్లెండ్రకు
నైనఁ దాఁచు లోరహస్యములను
స్మరవికారసరణి నెఱిఁగించునెచ్చెలి
కనువులిడినఁ దీగ దప్పునిజము.

శుచి—(తనలో) ఈ కాంత తనమనఃకాంతుండగు ప్రద్యుమ్నుండు శ్రీకృష్ణునికొమరుం డని యెఱింగినచో నతండు రాక్షసాంతకునిపుత్రుండని నిరసించునో లేక వానినే వరించునో తెలిసికొనవలయును. (ప్రకాశముగా) చెల్లీ! ప్రభావతీ!

గీ. కమ్మతావినొసంగు పుష్పమ్మెయయ్యుఁ
జంపకసుమంబుపై వ్రాలఁ జనునె తేఁటి?
చిత్తజాకారుఁడైన నీచిత్రలిఖితు
దైత్యరిపుపుత్రు వరియింపఁదగునె నీకు?

ప్రభా—(తనలో) నా మనోహరుండు దైత్యాంతకునిపుత్రుండట. ఇప్పుడు నే నేమిచేయుదును?

చ. ఎలమినిఁ జిత్రలోచనశితేక్షణపఙ్క్తుల నల్లినట్టి పై

న్వల వలరాజుపన్నఁగ నపారరసౌఘమునందు చేపవై
యలరుచుఁజిక్కియుంటివిక దా చలియింపకు వట్టికట్టెకున్
గలుగునెబంధుబాధ్యతలు కష్టముసౌఖ్యముగాక డెందమా.

అయినను నా కొక్క ధైర్యము కలదు. ఏమన,

గీ. కంటకవికీర్ణభూరుహాగ్రంబునందుఁ
దనరు దళితప్రసూనామృతమును గ్రోలఁ
గోరుప్రమదాళి వృక్షంబుఁ గూల్చునొక్కొ
వలచువిరి మేలు నేనుదిదలఁచియున్న.

(ప్రకాశముగా) సఖీ! నన్ను బెదరింపుచుంటివా ?

చ. దినకరుఁ డుగ్రుఁడైనఁ దనతీవ్రకరంబుల నీరసస్థితిన్
జనుదహియింపనన్న సరసంబుగఁ బద్మిని వానిఁగోరదే
నెనరున రాగవాహిని మునింగిన దానను గానఁ గోరెదన్
మనమున రాక్షసాంతకకుమారుఁడె యైనను వానిఁ గూర్పుమీ.

రాగ—నెచ్చెలీ! శుచిముఖీ! మనయనుంగుసఖియను నీ వేల నిరుత్సాహురాలినిగాఁ జేయఁ బ్రయత్నించెదవు? నీ వా సుందరాకారునిజాడ లెఱింగివచ్చెదనని యేగినది మొదలు నేటివఱకు లేమ పొందెడు విరహపరితాపం బేమని చెప్పుదును. వినుము,

సీ. వికసితసుమగర్భమకరందమును గ్రోల సంభ్రమించుమధుపాళిసంకులం
తరుణరసాలనూతనపల్లవంబుల భక్షించుపికరుతపాటవంబు [బు
జలధరదర్శనోత్సాహవిస్తృతబర్హబర్హినృత్యకలాపవైభవంబు
పలువిధభూరుహఫలభారనమ్రశాఖలశుకశారికాకలకలంబు

గీ. విస్మృతి భయంబుఁ దమిఁ జిత్తవికలతయును
బోరిఁబోరిని బెంప నాత్మీయమోహనాంగు
నెపుడు శుచిముఖి తోడ్కొనియేగుదెంచు
ననుచు నీకయి యెదురు కన్గొనుచునుండె.

మఱియు,

క. తెమ్మెరకూనలు, పుష్పద
ళమ్ములఁ జలియింపఁ బతికలండని జని యం

దెమ్మెయిఁ గనరాకుండిన
సొమ్మసిలుచు నేల వ్రాలు శోకభరమునన్.

శుచి—(తనలో) ఏమి! ఈలేమ రాక్షసరాజతనూజ యయ్యు రాక్షసాంతకు కుమారునే వరియించునా! అయినఁ దన్ను బెదరించుటకే నిట్లంటినని భావించెనేమో సంగతి తెలియ మరల నిట్లనియెదను. (ప్రకాశముగా) సఖీ! ప్రభావతీ!

చ. కణకణలాడునిప్పు మదిఁ గాతుక మంది యొడిఁ గ్రహింతువే?
మణి కలదంచు సర్పమును మచ్చికఁ జేఁ గొని ముద్దులాడెదే?
గుణములనెంచకుండ నిటు గూడునె పై మెఱుఁగెంచి దైత్యస
ద్గణరిపుఁడైనవాని నిజ కాంతుఁడటంచు వరింపఁజెల్లునే?

ప్రభా—సఖీ! ఏమట్లనియెదవు?

చ. బిసరుహనేత్ర! కైఁగొనఁగ వేదనఁగొల్పిన ముండ్లు కేతకీ
కుసుమము జాళువాతళుకు గుల్కుచుఁ గమ్మనితావినిచ్చునం
చసమునఁ గామినుల్ శిరములందు ధరింపరె? యెట్టికంటక
ప్రసవము శ్లాఘనీయమున భాసిలదే గుణరూపవైఖరిన్.

వేయేల,

ఉ. వారిధు లింకనిమ్ము బడబానలమారఁగనిమ్ము తారకల్
ధారుణి వ్రాలనిమ్ము హిమధామదివాకరు లాత్మసద్గతుల్
మారఁగనిమ్ము చిత్రగత మంజులమోహనగాత్రుఁ జిత్తజా
కారుని నామనోహరునిఁ గాంతరో వీడను వీడ నెమ్మెయిన్.

రాగ.—(తనలో) ఈశుచిముఖి మానెచ్చెలి హృదయదార్ఢ్యమెఱుంగ బహుకఠినపరీక్ష సేయుచున్నది. హా! దేవీ! సర్వమంగళా! ఈపరిశుద్ధదాంపత్యం బెట్లుకొనసాగఁజేసెదవో నీదేభారము.

శుచి—(తనలో) వహ్వా! నా ప్రయత్న మింకిట నశ్రమంబుగ నెరవేరుట నిశ్చయము.

చ. ఉరుగతిఁ బారుచుండి గిరి యున్నతభాగమునుండి క్రిందకున్
గురుతరకంటకంబులను గొబ్బునఁ ద్రోయు ప్రవాహమట్టు లీ
తరుణికిఁ జిత్రమున్ గన నెదన్ ప్రభవిల్లిన రాగవాహినీ
వరమిక రుక్మిణీతనయ వార్ధిమునుంగక నాఁగ దెమ్మెయిన్.

అయిన మరల నే నిట్లనియెదను. (ప్రకాశముగా) సఖీ ! నీవు రాక్షసరాజతనూజవగుటచే నీవువరించిన యాపురుషుఁడు ని న్నొల్లనన్న నీ వేమిచేసెదవు ?

ప్రభా—(దుఃఖాక్రాంతయై కన్నుల నశ్రులుగ్రమ్మ) అయ్యో! శుచిముఖీ!

ఉ. అంగన ! మున్నువాని హృదయంబనుపాదునఁ జిత్రరూపదృ
క్సంగతి మోహమన్మొలక సంభవమందఁగఁ జేయ నిత్య ము
ప్పొంగుచుఁ దోఁటమాలియయి పూవిలుతుం డురుదోహదంబు లం
దం గొమరొప్పఁ బెంచినలతన్ మొదలంటఁగఁ ద్రుంపఁజూచెదే.

చేటీ ! నీ వనినయట్లు నాపాలిటి భాగ్యదైవంబైన యామహానుభావుండే న న్నొల్లనన్నచో,

క. లేవే వజ్రపుతునుకలు
లేవే రజ్జువులు వెదుక లేవే నూఁతుల్
లేవే పాషాణాగ్నులు
లేవే కత్తులుకటార్లు లేవరో నాకున్.

రాగ—(భయమునభినయించుచు)అయ్యో! ప్రభావతీ! ఏమే నీసాహసము!(అని ప్రభావతినిగౌఁగలించుకొని) ఓసీ! శుచిముఖి!

ఉ. హా ! యిటుమర్మముల్చెదర నాడుచుఁ జంపఁదలంచితే చెలిన్ ?
బోయవె? యాఁడుతోఁడునను బుట్టవె? మారునివేఁడికోలలన్
గాయముదూఁల నీవునిటు గాసిలఁజేసెదె పల్కుముల్కులన్ ?
ఈయుసు రేలబోసికొనె దింతిరొ కావవె మాప్రభావతిన్.

శుచి—(నవ్వుచు) సఖీ! ప్రభావతీ! పరిహాసమున కట్లంటినే గాని నీ మోహనాకారమును జూచినపురుషుండు నీ కటాక్షం బర్థింపకుండునే ? అయిన నీవతనిపేర నొక లేఖవ్రాయుము. అద్దానిఁ గొనిపోయి వాని కిచ్చివచ్చెదను.

ప్రభా—మంచిది. (అని యొకలేఖవ్రాసి శుచిముఖిచేతి కిచ్చుచున్నది)

(అంత తెరలో)

అహో ! రక్షోవీరులారా !

మ. ఉదితానంతబలప్రతాపభుజగర్వోత్సాహదుర్వారుఁడై
యెదిరింపన్నవవజ్రనాథ మహారాజేంద్రుదున్ బలెన్ యక్షుదు

ర్మదగంధర్వుల గెల్చి వజ్రపురిఁ జేరన్వచ్చె మీ రీ జయా
భ్యుదయంబున్బ్రకటింప నెల్లెడల నత్యుత్కంఠఁ గైసేయుఁడీ.

శుచి——సఖులారా! వింటిరా! వజ్రనాభమహారాజుగారు దిగ్విజయము చేసి వచ్చియున్నారట. చెలీ! ప్రభావతీ! నిన్నుఁ జూడ నభిలషింతురేమో. మన మంతిపురంబున కేగుదమురండు.

ప్రభా——మంచిది. (అని యందఱు నిష్క్రమించుచున్నారు).

గద్య.

ఇది శ్రీమద్వేంకటరమణకరుణాకటాక్షవీక్షణాసారసమాసాదితరస
బంధురకవిత్వవైఖరీప్రవీణాపస్తంబసూత్ర శాండిల్యసగోత్రపవిత్ర హోతృకులకలశార్ణవరాకాకైరవమిత్ర- వేంకటరత్నసుపుత్ర వేంకమాంబాగర్భశుక్తిముక్తాఫల వివిధవిద్వజ్జనవిధేయ వేంకటకృష్ణనామధేయప్రణీతంబైన ప్రభావతీప్రద్యుమ్నంబను నాటకరాజంబున

తృతీయాంకము.







శ్రీరస్తు.

హయగ్రీవాయనమః.

# ప్రభావతీప్రద్యుమ్నము.

## చతుర్థాంకము.

---

రంగము: ద్వారకాపురపరిసరము.

[అగ్నిహోత్రచయనులు ప్రవేశించుచు.]

అగ్ని— (స్వగతము) ద్వారకాపురవరంబున వసుదేవమహారాజుగారొనరించు యజ్ఞవైభవముఁ గన్నులారఁ జూచి జన్మసాఫల్యంబుఁ జెందితిని. ఓహో! ఆ మఖవాటిక యందు,

సీ. ఒకచోట బ్రహ్మయుక్తత్సుకతఁ బ్రదేతాగ్నుల
విస్ఫుటంబుఁగఁ బ్రణవింపఁజేయ
నొకవంక నధ్వర్యుఁ డకలంకతన్మంత్ర
యోగసామీచీన్యయుక్తినెఱప
నొకయోర నుద్గాత ప్రకటితప్రౌఢిమై
సామగానముల హెచ్చరికఁ బాడ
నొకచేవ హోత సర్వకలాకలాపుఁడై
వలయు దత్తత్క్రియల్ దెలుపుచుండఁ

గీ. దక్కఁగలవారలెల్ల నత్యంతనిష్ఠ
వేదనాదంబులను మఖవిధులొనర్ప
నెమ్మితోదేవకియు సోమిదమ్మ కాఁగ
సొంపుమీఱెను వసుదేవసోమయాజి.

మఱియు, నే నా క్రతువైభవ మెంతని కొనియాడుదును.

ఉ. భోరున నాజ్యహోమములఁ - బుష్కలదానములన్ బ్రశాంతికై
గారెలు బూరెలిడ్డెనలు - గమ్మనిపప్పులుఁ గూరగాయలున్
జేరలనిండ నేతులును - చిక్కనిపాల్పెరుగు ల్చెలంగ నో
రూఁరెడుపాయసాన్నముల - నోలి జనంబులఁ దన్పునిచ్చలున్.

(అని యిటునటుఁ జూచి) అదిగో! యజ్ఞేశ్వరసోమయాజులుగా రిటులనే వచ్చుచున్నారు.

[అంత యజ్ఞేశ్వరసోమయాజులుగారు ప్రవేశించి].

యజ్ఞే — ఎవరండీ యిక్కడ? మీ రెయ్యెడ నెక్కడైనఁ బ్రద్యుమ్నకుమారునిఁ జూచితిరా? వసుదేవమహారాజుగారి యజ్ఞవైభవమును శ్లాఘింపుచుండిరి కాఁబోలు.

అగ్ని — యజ్ఞేశ్వరసోమయాజులుగారూ! నన్ను మీ రెఱుఁగరుషయ్యా? నాపే రగ్నిహోత్రచయనులు. ఆ క్రతువైభవము మీకుమాత్రము శ్లాఘనీయమని తోఁచలేదా?

యజ్ఞే — (ముఖమెత్తి కనుఱెప్పలపైఁ బాణితలంబుఁ జేర్చి చూచి) ఓహో! మీరా? అగ్నిహోత్రచయనులుగారే నా? పెద్దవాఁడ నగుటచేఁ జత్వారమువలన నే మిమ్మానవాలుపట్టలేకపోతినిసుమండీ. సర్వలోకశ్లాఘ్యంబైన యా యధ్వరము నాకొక్కని కేల వర్ణనీయముగాకుండును.

శుద్ధవిరాటీవృత్తము.

ఆహా! యద్భుత - మా మఖంబునన్
స్వాహారావ మ - వారితంబుఁగా
మోహంబంది వి - భూతి నే నటన్
దేహంబే మఱచి - తి న్ముదంబునన్.

కాని నే నొక్కరుండను మాత్రము దరిద్రదేవతావరుండ నగుటచే నిర్భాగ్యుండనైతిని.

అగ్ని — సోమయాజులు గారూ! మీరు కేవలము వేదస్వరూపులుసుమండీ. మఖవైభవమునుగూడ వేదస్వరముతోనే వర్ణించితిరి. ఏమయా మీప్రభావము! అట్టిదాని యెడల మీ రేలవిముఖులైతిరి? యజ్ఞసంభావన పుట్టలేదా యేమిటి?

యజ్ఞే — నా కొక్కనికిమాత్ర మది యేతత్సామగాయమే.

అగ్ని — ఏమి! ఇది కడు నాశ్చర్యముగ నున్నయది.

శా. శ్రౌతస్మార్తవిశారదు ల్విబుధు - లచ్ఛావాక్ప్రతిప్రస్థాత స
ద్హోత్రోల్లాసు లగణ్యపుణ్యులగు - గ్రావస్తుత్ప్రస్తోత వి

ఖ్యాతుండౌ ప్రతిహర్త ధీకలితు లౌ నా బ్రాహ్మణాచ్ఛంసి యు
న్నే తాగ్నీధ్రుఁడు నేష్టముఖ్యు లలర న్నీ కేల యిట్లయ్యెనో.

యజ్ఞే—అగ్నిహోత్రచయనులుగారూ! ఏమని చెప్పుదును. పాపాత్ములైన వర్తకాధములు నాపాలిటి దరిద్రదేవతాస్వరూపు లైరి. సమయమునకుఁ బరమధర్మాత్ముఁడైన ప్రద్యుమ్నకుమారుం డడ్డుపడకుండిన నాశిరస్సు భిన్న మై యీసరి కే నేను—(అని చేయాడించుచున్నాఁడు)

అగ్ని—పాపము. మీరు మంచిబ్రాహ్మణులయ్యా. మరల ప్రద్యుమ్నకుమారునిఁ జూడ లేక పోయినారా?

యజ్ఞే—అందుకొరకేగాదుమయ్యా. నే నీలాగు తిరుగుచున్నాను. మీరు బహుపుణ్యాత్ములు. అగ్నిహోత్రచయనులుగారనఁగ సామాన్యులా.

హాలముఖీవృత్తము.

వేదపూజితులరు కదా
మోదమయ్యెనుమిముఁగనన్
సాదరంబుఁగను దనుపన్
రాద బ్రాహ్మణుఁడనగుటన్.

అగ్ని—అబ్బ-అబ్బ-మీరు పెద్దలు. మీముందర నే నెంతవాఁడను! మీయాశీర్వచనము నే గోరుచున్నానుమండీ. ఇవే మీకు పదివేలవందనములు. (అని నమస్కరించుచున్నాఁడు)

యజ్ఞే— దీర్ఘాయుష్మాన్భవ-వర్ధస్వ. వేదపురుషప్రసాదసిద్ధిరస్తు. మనోవాంఛాఫలసిద్ధిరస్తు. ధనకనకవస్తువాహనసమృద్ధిరస్తు. ప్రాతరేవాశివస్సంతు. రాజద్వారేనిరంతరాఖండలక్ష్మీప్రసాదసిద్ధిరస్తు. (అని యాశీర్వచించి) ఆప్రద్యుమ్నకుమారుని మీ రిందెయ్యెడనైనఁ జూచియుంటిరా?

అగ్ని—ఆఁ! చూచితిని. అదిగో చూడుము. ఆ తటాకము చెంతఁగూర్చుండియున్నాఁడు. మీ రచ్చోటికేగుఁడు. నేఁ బోయెదను. (అని నిష్క్రమించును)

యజ్ఞే—ఆహా! మీ రెంతధర్మాత్ములండీ. నే నిప్పుడచ్చోటికేగెదను.

(అంత తెరలో)

బ్రాహ్మణోత్తములారా! యజ్ఞసంభావనమిట్టని వాసుదేవమహారాజుగారి మందిరంబునకు రం డోహోయి

యక్షే—(ఆలకించి సంతోషముతో) ఓహో! ఏమినాభాగ్యము! నే వసుదేవునిమందిరం
బునకే గెదను. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

[అంతశుచిముఖి ప్రవేశించి]

శుచి—(తనలో) యజ్ఞసంభావనార్థమై ప్రద్యుమ్నునిఁ దోడ్కొనిపోకుండ నాబ్రాహ్మణుని వసుదేవునిమందిరంబున కనిపితిని. ప్రభావతీకన్యపై మోహాతిరేకంబుననే కదా ప్రద్యుమ్నకుమారుం డాతటాకముచెంత గుజ్జుమావిగున్నక్రింద నేకతంబ విరాళిఁజెందుచుఁ గూర్చుండియున్నాఁడు. నే నిప్పుడు వానిచెంత కేగి యదృశ్యనైయుండి సమయసముచితంబుఁగ వాని కీలేఖ నొసంగి వానిచిత్తంబు మోహాయత్తం బగునటు లొనరించి వజ్రపురంబునకుఁ గొనిపోయెదను. (అని తిరస్కరిణీముద్రధరియించి పరిక్రమించుచున్నది)

[అంత నొకతటాకముచెంతఁ బ్రద్యుమ్నుం డేకతంబ ప్రవేశించి.]

ప్రద్యు—అన్నా! ఏమి యీచిత్రము.

చ. హరిణముపై మనంబు హరిఽణాక్షిపయిం దగులంగఁ గాననాం
తరమున నాకొసంగె నసిఽతామణి చిత్రపటంబుఁ దీని సుం
దరతనుకాంతి పూర్ణహిమ ఽ భాముని గేరుముఖంబుఁ జూడ దు
ర్భరవిరహాగ్నికీల లెదఁ ఽ బర్వుచు సన్తపియింపఁ జేసెడున్.

అకటా! నా యనుంగుమిత్రుల కూర్తాలాపంబు విననతోడనే యొడలెఱుంగక హాస్తగతంబైన పెన్నిధానంబునుఁ గాలఁదన్నిని విడిచివచ్చితిని. ఆదూతికాతిలకంబును మరల నే నెట్లు చూడఁగలుగుదును? ఓశుచిముఖీ!

శా. ఏలాచిత్రపటంబు నాకొసఁగితే ఽ యీమోహవారాశి నే
నేలాయీఁదితరింపఁగల్గుదునె యీ ఽ యేణాక్షిదృఙ్మాలికా
జాలస్ఫూర్తినెసంగుభాగ్యమెటులన్ ఽ సందర్భమానే ననున్
జాలిందూలఁగఁ జేయఁజూపితివె యీ ఽ చానన్ సరోజాననన్.

హా! నన్నెట్టియవస్థలపాలు జేసితివే.

సీ. నెత్తమ్మికొలఁ కులఽ సీరు కాంతామణి
వదనలావణ్యసంఽపద యటంచుఁ
గమనీయసాంధ్యరాఽగము తరుణీమణి
లేఁగెంపుచెక్కులఽలీల యనుచుఁ

జిలుకలకలకలంబులు మంజుభాషిణి
లలితకోమలవాగ్విలాస మనుచుఁ
దారకాంచితనిశోధంబు బంభరవేణి
సుమవికీర్ణశిరోజశోభ యనుచు
గీ. నలరుగుత్తులుగల తీవియలు లతాంగి
పృథులవక్షోజయుతతనూవిభవ మనుచు
దలఁచి భ్రమియించి దిగ్భ్రమఁ గలఁత జెంది
గడియ యుగముగ రేయెల్లఁ గడిపియుంటి.

ఇ క్లెంత కాలము వేచియుండవలయునో కదా. అబ్బా! ఈ విరహవేదన నెట్లు సహింపఁగలిగెదను.

సీ. లోనున్న మలయానిలుఁడు నిర్దయుండౌచుఁ
దడిపోవ గొంతుకదలుగుచుండు
వెలికిరా నాపైని వినువీధిజాబిల్లి
క్రూరుఁడై రేయెండఁ గ్రుమ్మరించు
విహరింతుమన్న చో విటపిసంఘంబుల
శుకపికప్రసవము ల్సొలయఁజేయుఁ
బువ్వుటీరములకుఁ బోవుదమన్న చో
నళికులంబులు మదిఁ గలఁతఁబెంచు
గీ. సైకతవినోదములకు నాస క్తిగొనిన
నిలువనియ్యవు కేకినుల్కలరుతముల
నలర జలకేళిసేయనియ్యదు మరాళి
చిక్కియుంటిని యిం దేమిసేయువాఁడ.

ఔరా! ఈ శుకపికశారికానికురుంబంబు లెట్లుగర్వించి చెలరేగుచున్నవి. నా మనోహారిణితో నొకింత సాదృశ్యముఁ గనియుండుటచేత నేకాఁబోలు.

చ. లలితరసాలపల్లవముల౦ గడుపారఁగ మెక్కి ముద్దుగాఁ
బలికినయంతనీవు కలభాషిణివౌదువె యో పికాంగనా!

కలకలలాడుచున్నలుకఁగా శుకశారికలాపులార ! యు
క్తలికనుచిత్రదర్శితలతాంగులెమీరలు మిన్నకుండుఁడీ.

ఆఁ! ఏమి మీపాతకము !

సీ. తన్వీసల్లాపామృతముఁ గోరినందుకా
చులకనై తినిమీకు చిలుకలార!
ననబోణిమందయానముఁ గోరినందుకా
యలతినై తిని మీకు హంసలార !
కలికిక్రొన్నెరులసంగతిఁ గోరినందుకా
తేలికై తినిమీకు తేఁటులార !
కోమలికుచపాళిఁ గోరినందుక నీర
సంబునై తిని రథాంగంబులార !

గీ. పంతమా యింతమీకు సామంత మేల
చేతనై యున్న నన్ను రంజింప మీకు
గరిత కెఱిఁగింపుఁడీ చేతఁగాక యున్న
నూరకుండుఁడీ మీకదే యుచితమిపుడు.

ఉ. ఏమిర పాపి నీ గురునకే మునుఁ బెట్టవె పంగనామముల్
హైమవతీకళత్రుఁడు రథాంగముక్రింద నడంగఁ ద్రొక్కినన్
బాములవాతఁ గూలినను బాంధులపాలిటి మృత్యువాచుఁ జం
ద్రా ! మినుముట్టుచుంటివి విధాత కిదే తలఁగొట్టుటెంతయున్.

అన్నా! ఈ కొదమ తేఁటి యెట్లురొజ చేయుచున్నది !

ఉ. పంపెనె నిన్యముండు మధుపానప్రమత్తతఁ బాంథలోకమున్
జంపఁగ జుమ్మటంచు ననిశంబునుఁ దూఁటొనరించి కర్ణముల్
చంపకనాస నా హృదయసద్మమున న్వసియించియుండెఁ గ
ర్వింపఁగఁ జెల్ల దీవు వినవే మదషట్పదమా ముదంబునన్.

అకటకటా! ఈవనంబున,

గీ. రామరామా! శుకాళియార్భాటమెచ్చె
హరిహరీ! చల్వతెమ్మెఱ లతిశయించె

హంస లుద్ధతి రేగ జలజాశయముల
ఘనకచకటాక్ష మెపుడు నేఁ గాంతునొక్కొ.

ఏమి నా కీవెట్టి. నే దైత్యాంతకకుమారుండ నగుటచే న న్నాలేమ వరించునో వరింపదో. ఈవిషయములో నామాతి కాతిలకంబును నాకుఁ దగినంత ధైర్యముఁగలిగింప దయ్యె. మఱియు,

చ. ఎలమిని నేను వజ్రపురి కేగుటయెట్లొకొ యేగఁగల్గినన్
గలికినిఁగాంచువైభవము కల్గుటయెట్లొకొ కాంచఁగల్గినన్
జిలుకలకొల్కి లేనగవుఁ జిల్కుచుఁబల్కునొ పల్కునన్నొ ని
ర్మలకృప నాదరించునొ పరాఙ్ముఖియౌనొ యదృష్టమెట్టిదో.

(అని పరిభ్రమించుచుఁ గ్రిందఁబడియున్న లేఖను పైకిఁదీసి చూచి) ఓహో ! ఇది యొక యబలాలిఖితంబగు నుత్తరంబు. ఇం దేమివ్రాయంబడి యున్నదో చూచెదఁ గాక. (అని యుత్తరము విప్పి చదువుచున్నాఁడు.)

"ఓ యభినవమన్మథాకారా! అతులనిజరూపజితబాలభాస్కరా! అస్మన్మనోధన చిత్రకైతవతస్కరా! ప్రాణేశ్వరా!

భవత్పాదారవింద నిష్యందమరందతుందిలేందిందిరాయమానమానసయై త్రికరణశుద్ధి నిన్నేయాత్మభర్తఁగవరించి నెక్కొనుతమకంబున నీపై మరులుగొని రేయింబవళ్లు విరహార్తిచే బ్రుగ్గు దీనురాలగు ప్రభావతిచేయు వినయపూర్వకమైన విజ్ఞాపనము.

జీవితేశ్వరా.

చ. సుమశరమన్ గలంబుఁగొని స్రుక్కెడు దేహమునందుఁగల్గు ర
క్తమునను ముంచి నీ హృదయకంజమటంచు నవీనమైనప
త్రమున మరుండుచెప్పినవిధంబుఁగ విస్మృతి లేఖవ్రాసితిన్
మిముఁబతిభక్తిఁగోరుచు క్షమింపరె యిందునఁ గల్గు తప్పులన్.

సీ. రాక్షసకులవారిరాశిమత్స్యంబనై
చిత్రంపుటెత్తెలఁ జిక్కియుంటి
బాలభానూదయభాగ్యంబుఁగొనఁ జక్ర
వాకినై పతికాంక్ష వనరుచుంటి
నినుఁగోరి వర్జించి నిదుర నాహారంబుఁ
దాఁగవింటిబంతినై త్రుళ్లుచుంటి

జనకునాజ్ఞాశూల సంవృతపంజరాం
తరబద్ధకీరమై నవయుచుంటిఁ
గీ. పువ్వువిల్తునిశరలోహ పుం బెనమునఁ
జలువకరువలిరవులు వెన్నెలల వేఁడిఁ
పొటుకుపొటుకునఁ బేలెడు పేలగింజ
సంచున విరాళిచేఁ దపియించుచుంటి.

మనోనాయకా! కరుణామయుండవైన నిన్ను నేఁ బ్రార్థించునదేమన,

సీ. అలరారు లేఁత వెన్నెలకల్మిచేఁగాక
నీలోత్పలంబులు నెగడఁగలవె?
పారిజాతస్కంధపాటవంబునఁగాక
వల్లీమతల్లి శోభిల్లఁగలదె?
జీవనజాప్తసంభావనచేఁగాక
జీవనజంబు భాసిల్లఁగలదె?
మౌక్తికరాజిసంబంధంబుచేఁగాక
విద్రుమంబులు రక్తి వెలయఁగలవె?
గీ. పృథివి నీ మందహాసంబుఁ బీనవక్షు
మాననరదాంశుకావాప్తిఁ గానకున్న
నా కనుంగవ తను వాననంబు మోవి
రాజిలునె? రమ్ము నన్ను నీరాణిఁ జేయ.
గీ. దానవాంగనయని నిరాదరణసేయ
కేను నీదానఁజుమి హృదయేశ! నీవ
నాదుపతివంచుఁ దెల్పి స్వప్నమున గౌరి
చిత్రితభవత్సదాకృతిఁ జెల్మినొసఁగె.

కావున,

చ. అసురకులాంగనన్ బరిణయంబగు టర్హముఁ గాదటంచు మా
నసమున నెంచఁబోకు మలనాగకులాంగన నే కిరీటి సం
తసమునఁ జెట్టవట్టినవిధంబుఁ దలంపుము సద్గుణాళి నే
రసికమణుల్ గ్రహింతు రనురక్తులవంశగుణంబుఁ గాంతురే.

చ. జలగతహేయపంకమున జన్మమునొందిన దంచుఁ బద్మమున్
విలసిలనేలకుండెనె ర విప్రమదంబున ? దోషసంగతిన్
వెలయునిశాటుఁడంచు శశి ని న్నివుఁ డౌదలఁదాల్పకుండెనే?
తలఁపఁ ద్రిశుద్ధినమ్ము వని తన్గొన వంగస మెంచఁ బాడియే?
ఉ. వాదముగాదుసుమ్ము చెలు వమ్ము మనోజ్ఞగుణమ్ముఁ గల్గు శా
తోదరి దానవాన్వయస ముద్భవమయ్యు ముదంబెకూర్చెడున్
మేదురకంటకవ్రజస మేతమహీరుహజాతమయ్యు నా
మోదముఁగూర్పదేమదికి ముచ్చటఁగొల్చి గులాబి నాయకా.

మఱియు,

ఉ. రేయిఁబవల్ నిశాచరపరీవృతయై మనుదానిఁ జెందఁగా
డాయుటకష్టమంచు వికటంబుఁగనాత్మఁదలంపఁబోకుమా
హాయి మరందపానరతుఁ డక్కుటతోమధుమక్షికంబులన్
బాయఁగఁద్రోలి మేలి మధుపాళినిఁ బాళిఁ బరిగ్రహింపఁడే.

మనోహరా! ఆర్తత్రాణపరాయణుండవు నఖిలధర్మాధర్మకోవిదుండవు నగు నీకు నేను చెప్పవలసినదానను కాను. అయినను కలగుండుపడు మదీయాంతరంగంబునుండి పైకుబికి యనర్గళంబుగ వెల్లివిరియు మనోభీష్టంబులం బుక్కిటనిడికొనంజాలక యిట్లు వెల్లడించితినని నాపైఁ గినియకుఁడు.

గీ. జాబుకై వేచెదను తాళఁజాల వలపు
గడియలెన్నుచుఁ దినములు గడుపుచుంటి
నాథ ! పాలింపుమీ వజ్రనాభదైత్య
విభు తనూజ ప్రభావతీ విన్నపంబు."

(అనిచదివి) అహో! ఏమియీవిచిత్రము !

ఉ. తానఁట వజ్రనాభునిసుతాస్ఫటికంబఁట మున్భవాని స
న్మానితలీల నన్నుగరుణన్ లిఖియించిన చిత్రమిచ్చి "నీ
కీ నవమోహనాంగుఁడే సుమీ పతియా" నని తెల్పెనంట లో
నూనిన వేడ్క నన్వలచి యుండెనఁటద్దిర ! యేమిచిత్రమో.
సీ. దాక్షాయణికినింత దయ యేలనాపైనిఁ
గలిగెనో చిత్రసంగతునిఁ జేయ



నాచిత్రఫలకంబు । ననురాత్మజుఁడు నేల
కరుణఁదానొసఁగెనో । కౌతుకమున
నాచిత్రలిఖితుండ । నౌ నన్నువరునిఁగా
నేలవిధించెనో । యింతికంబ
విధియించినంతనే । వెలఁదిదానవసుతా
తిలకమై యేలఁనన్నేలచెనొక్కొ
గీ. కలిగె నాకిట్టిభాగ్య మా । గౌరికరుణ
హృదయమ! కృతార్థవయ్యెద । వింక నిన్ను
దాఁగిలించిన యామోహ । నాంగి యమిత
కృప మనుపు సంతతానంద । మెసఁగఁజేసి.

శుచి—(తనలో) ఈతండు ప్రభావతీకన్య తనపేర వ్రాసిన యుత్తరంబున కలరి యాలేమ తన కిప్పుడే కరగతంబైనట్లు భావించుచున్నాఁడు. వీని మనోధైర్య మెఱుంగుటకై యదృశ్యనై యుండి యా కురంగము నుద్దేశించి యిట్లనియెదను. (ప్రకాశముగా)

చ. అలరెదవె పత్రసంగతఫలాప్తికిఁ జెంతనుజేరఁ గంటకం
బులు గల వందు గ్రుచ్చుకొనఁ । బోలుఁజుమీ పరికింపలేవొకో
వలచునటంచు దానిపయి । భ్రాంతిజనించెనె యంతకన్న స
త్ఫలములులేవె వ్యర్థము కదా భవదీప్సిత మో కురంగమా.

ప్రద్యు—(ఆలకించి యుత్కలికఁ దనలో) సఖా! ఈ శుచిముఖి మరల వచ్చి యదృశ్యయై నాచెంతనే యుండెను కాఁబోలు. ఈ నారీమణి ప్రభావతీకన్యపంపున దూతికయై యాలేఖఁ గొనివచ్చెనని తలంచెదను. శుచిముఖిగాక యొరు లెవ్వ రిట్లన్యాపదేశంబుగఁ బల్కెదరు? మరల నే నా కురంగము నుద్దేశించియే యిట్లనియెదను. (ప్రకాశముగా)

చ. అలరవె పత్రసంగతఫలాప్తికి నాఁకొనియుండి కంటకం
బుల గణియింతువెక్కొ వలపుం బ్రకటించెదు దాని పీడదే
సలలితరాగసంపద రసస్ఫుటితాచ్ఛఫలంబుఁ జెంద ని
చ్చలుఁదపియించి కోర్కె కొన । సాగఁగఁ జేయవె యోకురంగమా.

శుచి—(తనలో) ఈతండు శృంగారరసానుభూతికై యాకొనియుండుటచే దైత్యకంటకంబులనులక్ష్యపెట్టననియు నేమైననుసరే పూర్ణమైనయనురాగమును బ్రకటించెడు ప్రభావతీకన్యను బరిగ్రహించుటకు సర్వవిధములచేతను బ్రయత్నించెదననియు భావగర్భితంబుగ వెల్లడించుచుండె. మరల వీనిని సంబోధించియే యిట్లనియెదను.

(ప్రకాశముగా)

సీసపద్యము.

కేసరివటు! చక్కెఅవింటిదొరవాదు-
ప్రద్యు. కేసరీమధ్యకౌఁగిలి లభింప.
శుచి. నెలకూనగుఱుతు నీ నిటలంబు-
ప్రద్యు. వామాక్షికుచపాళి నెలకూన గుఱుతులిడఁగ.
శుచి. గజతుండహస్త! చక్కనివాఁడవౌదువు -
ప్రద్యు. గజయానతనువల్లిఁ గైకొనంగ.
శుచి. మంగళాంగుండవై మహిమఁగాంచెదవీవు-
ప్రద్యు. మంగళగళసమాలింగనమున.
శుచి. చక్రవర్తివియన నీవు చాలియుందు-
ప్రద్యు. చక్రవర్తుల సుశ్రోణి సరసఁజేర.
శుచి. కుముదరుచిఁగాలు నీదు నేత్రములు మిగులఁ.
ప్రద్యు. గుముదబాంధవముఖినిఁ గన్గొన లభింప.

శుచి—(తనలో) ఈ మోహనాంగుం డాయెలనాగపై బద్ధానురాగుండయేకదా యిట్లు మితిమీరిన విరాళిఁ జెందుచున్నాఁడు. ఇంక నే వీనికిఁ బ్రత్యక్షమై వీనిని వజ్రపురంబునకుఁ గొనిపోవఁ బ్రయత్నించెదను. (అని ప్రత్యక్షంబుగ బ్రద్యుమ్నుని యెదుట నిలువంబడి ప్రకాశముగా) శ్రీకృష్ణకుమారా! నీ వీ తటాకముచెంత నేమి చేయుచుంటివి?

ప్రద్యు—(సహర్షంబుగ) స్నానమొనర్చుచుంటిని. ఎట్లన;- పరిపూర్ణకరుణాసమేతవై నీవు నా కొసంగిన చిత్రపటంబుఁ జూచుచు,

గీ. సకియనెమ్మేనికాంతి మజ్జనమొసర్చి
యంత శృంగారరసవార్ధియందుమున్గి
పిదప నానందబాష్పాంబు బిందుధారఁ

గ్రుంకులిడుచుంటి శుచిముఖీ! § కోర్కు లలర.

శుచి—(నవ్వుచు) ప్రద్యుమ్నకుమారా! ఎంతప్రమాదపుపనిఁ జేయుచుంటివి!

గీ. గాఢవిరహజ్వరంబుచేఁ § గలతఁజెంది
వంతనొందుచు నీవిట్లు § భ్రాంతిఁ జిక్కి
వనితపై రాగసరసిలో § మునుఁగుచున్నఁ
దజ్వరము హెచ్చదే యప § థ్యంబుచేత.

ప్రద్యు—శుచిముఖీ! ఈ చిత్రపటాంతర్గతమోహనాకారంబుఁ జూచి తమినిలుపఁ జాలుదునే? (అని చిత్రపటంబుఁజూపుచు)

సీ. ఈ ముఖపూర్ణిమా § హిమకరదర్శనో
త్సుకత నాయెద చకో § రిక యనంగ
నీ నీలకబరికా § నూనజీమూతసం
ప్రాప్తికై చిత్తంబు § బర్హి యనఁగ
నీ హస్తబిసతంతు § నెనయ నా డెందంబు
రాజితరాజమ § రాళమనఁగ
నీ నవలావణ్య § మానితజలకేళి
సలుప మనంబు మ § త్స్యంబనంగ

గీ. వేవిధంబుల నిగుడుచు § వివశయగుచు
మీరి లోలోన నువ్విళు § లూఁరియూఁరి
హృదయ మా వజ్రపురిలోని § సుదతిఁజేరఁ
దను విట స్మరాగ్నికింధన § మనఁగ నిలిచె.

మఱియు,

సీ. భువనజాతామోద § భూతిచే దేహంబు
జవ్వనితనువు కా § సక్తిఁజెంద
భువనజాతామోద § భూతిచే చిత్తంబు
వనితకన్గవపైని § వ్రాలనెంచ
భువనజాతామోద § భూతిచే దృక్తతి
కలికి ముద్దులమొ § గంబుఁజూడ

భువనజాతామోద ♦ భూతిచే బల్కులు
పూఁబోణి గొనబు కెమ్మోవిఁగదియఁ
గీ. ప్రకట సురతరు వళి చకో ♦ రిక శుకంబు
లగుట లతయని శరరుహం ♦ బనుచుఁ జంద్ర
బింబమనుచును రసయుక్త ♦ బింబమనుచుఁ
జిత్రగత మోహనాంగి నాశించియుండె.

ఓదూతికారత్నమా!

కవిరాజవిరాజితము.

మ. తరుణమిదేసుమి ♦ తామరసాక్షి ముఖంబునఁజూడఁగఁ ♦ దన్మయతన్
స్మరశరకీలల ♦ జాలినిఁదూలుట ♦ జాముయుగంబుఁగఁ ♦ జాగునయో
యురుగతిఁదత్పుర ♦ మెయ్యెనఁ జేరక ♦ యున్నతమోహపయోనిధి నే
దెరలుదునే సుదతీమణి! ప్రముక్కెద ♦ దీనుఁడఁగోరికఁ ♦ దీర్పఁగదే.

శుచిముఖీ! ఆ రమణీమణి నిశ్చయముగా నన్ను వరించియుండెనా?

శుచి—శ్రీకృష్ణాత్మజా!

ఉ. కొమ్మనునోగతం బెఱుఁగఁ ♦ గోరెదె యద్భుతమయ్యె నీ శరీ
ర మ్మిటనుండ భావ మితరస్థలమందున నుండెనొక్కొ మో
సమ్మని యెంచి నీమదిని ♦ సందియ మొందెదె నిర్దయుండవై
కమ్మనుఁజూచియున్న నను ♦ కంప జనింపదె నీకు నక్కటా.

ప్రద్యు—శుచిముఖీ! "యత్రాకృతి స్తత్రగుణాః" అని లోకములో స్త్రీలకుఁగాని పురుషులకుఁగాని రూపమునుబట్టియే గుణములు ప్రకాశించుచుండును. ఆ కారణంబు చే దైత్యరాజతనూజయగు ప్రభావతీకన్యజగన్మోహనస్వరూపంబునకు సుగుణసంపదయు ననురూపంబుగనే యుండునని తలంచెదను,

శుచి—సందేహమేమి? అట్టి లోకోత్తరగుణఖని నే నెందునుఁ జూడలేదు. వినుము,

చ. గురువులయాజ్ఞమీరక న ♦ కుంఠితభక్తిని వైష్ణవార్చనా
పరతఁజరింపుచు న్వరమ ♦ పావనశీలయనంగ సత్యవా
క్పరణిని సద్వ్రతంబు లనిశంబునుఁజేయుచు రేబవల్మనున్
దిరముగ నాత్మనిల్పి సుద ♦ తీమణి పూజలొనర్చుచుండెడే.

ప్రద్యు—(ఉత్కంఠతఁదనలో)ఓహో! ఏమి నాభాగ్యము! (అని చిత్రపటంబుఁదిలకించి)

సీ. తేనియఁజిమ్ము వా ॥ తెఱ చవుల్ప్రచరించు
చందమెన్నుటకు మా ॥ సంబుపట్టు
మిలమిలఁగ్రాలెడు ॥ మీననేత్రంబుల
పటిమ నెన్నఁగ శతా ॥ బ్దంబుపట్టు
తిలపుష్పములజిగి ॥ దళుకొత్తు నాసిక
డంబు శ్లాఘింప యు ॥ గంబుపట్టు
పూర్ణచంద్రునిభాతిఁ ॥ బొలుపొందువదనంబు
వర్ణింప బ్రహ్మక ॥ ల్పంబుపట్టు
గీ. నింక నితరావయవముల ॥ నెన్నఁదరమె
యహహా! నా మహాభాగ్య మే ॥ మనఁగవచ్చు
లోకమోహినియైన యీ ॥ లోలనేత్ర
నాకు సతిఁగా సృజించె నా ॥ నలినభవుఁడు.

(ప్రకాశముగా) శుచిముఖీ! ఈ నవలామిన్నను కన్నులారఁజూచుభాగ్యము నాకెట్లు సందర్భింపఁజేసెదవో నీదేభారము.

శుచి—(తనలో)

గీ. నాయికానాయకులకాత్మఁ ॥ బాయనట్టి
విపులవిరహజ్వరంబును ॥ వెడలఁదోలఁ
దగినదివ్యౌషధము ప్రేమ ॥ నెగడ వారి
నొక్కయెడఁజేర్చుటేగాదె ॥ యుర్వియందు.

ఏయుపాయంబుచే వీనిని వజ్రపురంబులోఁ బ్రవేశపెట్టనగు? (అని కొంచెమాలోచించి) ఆఁ! నాకిపుడు చక్కనియుపాయ మొకటి పొడఁగట్టినది. (అని శిరఃకంపనముఁ జేసి) అటులనే చేసెదను. (ప్రకాశముగా) ప్రద్యుమ్నకుమారా! ఏల నీ విట్లు మితిమీరిన విరాళిచేఁ బరితపించెదవు?

ప్రద్యు—ఈశ్వరకటాక్షంబున నాదైత్యనాథుండు గాంచిన దుస్తరవరప్రభావంబుచే వజ్రపురంబు లోతులకుఁ జొరనశక్యంబు. ఆ మోహనాంగినిఁ జూడకున్న నేఁ బ్రతుకఁగలనా?

చ. పొలుపుఁగఁజంచరీకములు ॥ మోహనమంత్రము లుచ్చరింపఁ బై

నొలయుచుఁ జల్వతెమ్మెఱలు నుప్పొనసన్నఁదఁగ మోహనాంగి యు
జ్జ్వలతరవర్ణనామృత రసం బను తియ్యని మత్తుమందు నే
నెలమిన్మ్రింగఁ గర్ణముల నిట్లవశాత్ముఁడనైతినే చెలీ.

శుచి—ప్రద్యుమ్నకుమారా! నీ వెంతవిరాళిఁజెందుచుంటివో నీపై మరులుగొనిన ప్రభావతి నీకంటె యినుమడుంగుల విరాళిఁ జెందుచున్నయది. అరణ్యంబున నీవు నన్ను విడిచిపోయినతోడనే నే వజ్రపురంబున. కేగితిని. మఱియు.

మ. చనఁగా నప్పురిలోఁ బ్రభావతి వనిన్ సౌదామినీరీతి నిం
పునరాజిల్లుచు నీపయింగలతమిన్ మూర్ఛిల్లియుండంగ చెం
తనుచేటీమణి రాగవల్లరియు నంత స్వీవఁగాఁదమ్మివీ
వనఁ దెల్వొంద రహస్యలీల నెఱిఁగింపన్ గల్గె నీసంగతిన్.

ప్రద్యు—(సహర్షంబుగ) ఏమేమీ! ఆకన్నియ నిశ్చయముగ నాపై విరాళిచేత నేమూర్ఛిల్లెనుగా? అట్లైన నీసహాయమువలన నే నింక చరితార్థుండ నయ్యెదను. వహ్వా!

శా. హా! రామామణి! యంచు నేఁబలుకఁ గీరార్భాటి నాసంబు నూ
గారుం జూప మదాళిగంధవహులున్ గాంతాకుచంబుల్ గనం
గా రాయంచలు శీతరశ్మియు మనంబుగారాదు నే మోహపుం
వారాశిందరియింపఁగల్గుదు సహా వామాక్షిదర్శించినన్.

శుచిముఖీ! ఏయుపాయంబుచేనైన నన్ను రాక్షసపురంబులోనికిఁ దోడ్కొనిపోయి ప్రభావతీకన్య శుద్ధాంతంబునఁ బ్రవేశపెట్టితివేని నీ యొనర్చుమేలు నే నెన్నటికిని మఱచువాఁడనుకాను.

శుచి—ప్రద్యుమ్నకుమారా! తహతహజెందకుము. నేను చెప్పినట్లు నీవు ధీరోదాత్తుండవై ప్రవర్తించితివేని నీయభీష్టంబు తప్పకఁగొనసాగు. నిన్నిప్పుడు తోడ్కొనిపోయి వజ్రపురబాహ్యంబున నిలిపి నే లోనికేగి యేవిధముచేనైన వజ్రనాభుని యనుమతి వడసి నిన్నా ప్రభావతీకన్య కేళికాభవనంబునఁ బ్రవేశపెట్టెదను. పిమ్మట నీ వచ్చోట,—

మ. చొరవ న్నిశ్చలతన్నెలంగి సమయ స్ఫూర్తి న్వచోనైపుణిన్
వరలం గాంచె దభీష్టసిద్ధిఁ దమిచే వర్తింప నీకోర్కె నే
నెరపన్ జాలను వజ్రనాభుఁ డనుమానింపన్ జెడున్ నిల్వ దు
ర్భరమై నీకుఁ బ్రభావతీసతికి రంభాకంటకన్యాయమౌ.

(అని పైకిజూచి) అదిగో బృందారకులిపు డెద్దియోఁ బలుకుచున్నారు వినుము.

(అంత తెఱలో)



సీ. అతివృద్ధుఁడై సూర్యుఁ డస్త్రాద్రికేతెంచె
వరిపొలాలుపసిండి వన్నెఁ గ్రాల
కలకలంబులఁబక్షి కులములుతమతమ
గూళ్లఁజేరుచునుండె గోగణంబు
మరలియిండ్లకుఁబోవుఁ దఱిపిదూడలుకొన్ని
సొరిదిఱంకెలువైచుచును జనంగఁ
బాటలుపాడుచుఁ బాలికాపులు పొలం
బులనుండి తమగృహం బులకునేగుఁ
గీ. బాఠశాలలబాలకుల్పరువులిడుచు
నలరి కిలకిలనవ్వుచు నరుగుచుండ్రి
రాగముప్పొంగ జనులు సరాగులగుచుఁ
దమిని వెడలంగఁ దగు నిశాంతంబులకును.

శుచి—ప్రద్యుమ్నకుమారా! వింటివా బృందారకులపలుకులు. దినాంతంబగుటచేఁ జిమ్మ చీఁకటులు కాఱుక్రమ్మకుండ మనము పయనమగుట మేలు. రమ్ము.

ప్రద్యు—మంచిది. అటులనేవచ్చెదను. కాని, శుచిముఖీ! అతికఠినమైన నిబంధన విధించితివి. ఎట్లోగదా.

మ. అలినీలాలకమోవి తేనియజడిన్ హాసాంకురజ్యోత్స్న దృ
గ్లలితాఖ్యల్ కలవాక్ప్రికాళి ముఖ రాకాచంద్రబింబంబు ను
జ్వలలావణ్యజలాశయంబుఁ గనుపింపన్ నిర్వికారుండనై
నిలువన్ జాలుదునే తమిన్గొనక తన్వీ! యేగతిన్ బ్రోచెదో.

శుచి—(తనలో) కానిమ్ముచూతము. ఇప్పటికెద్దియైన నొకయుపాయము తోఁచకుండునా. (ప్రకాశముగా) ప్రద్యుమ్నకుమారా! నీవు మనంబుఁజిక్కఁబట్టియే ప్రవర్తింపవలయుఁజుమీ. లేకున్న నా ప్రయత్నమంతయు విఫలంబు కాఁగలదు. వజ్రనాభుం డిపుడే కిన్నరుల నిర్జించివచ్చి వజ్రపురంబున గొలువుఁదీర్చియున్నాఁడు. పోవుదమురమ్ము. (అని యిరువురు నిష్క్రమించుచున్నారు.)

## గద్య.

ఇది శ్రీమద్వేంకటరమణ కరుణాకటాక్ష వీక్షణాసార సమాసాదిత
రసబంధురకవిత్వవైఖరీప్రవీణాపస్తంబసూత్ర శాండిల్యస
గోత్రపవిత్ర హోతృకులకలశార్ణవరాకాకైరవమిత్ర వేం
కటరత్నసుపుత్ర వేంకమాంబాగర్భశుక్తిముక్తాఫల
వివిధవిద్వజ్జనవిధేయ వేంకటకృష్ణనామధేయ
ప్రణీతంబైన ప్రభావతీప్రద్యుమ్నంబను
నాటకరాజంబున

చతుర్థాంకము.





శ్రీరస్తు.

హయగ్రీవాయనమః.

# ప్రభావతీప్రద్యుమ్నము.

## పంచమాంకము.



రంగము: వజ్రపురమునంగలసభామంటపము.

[రోమంథన తామ్రాక్ష కఠోరదంష్ట్రులతో వజ్రనాభుఁడు కొలువుకూటముఁ బ్రవేశించును.]

వజ్ర—అరే ఆప్తవర్గంబులారా!

ఉత్సాహ. మురియుచుండు కిన్నరప్రభుండు శరణుఁ జొచ్చె సం
గరమునందు నాదు దోర్యుగప్రతాపవహ్ని దు
ర్భరముఁ గాఁగ నోడి యింక వరుణుఁడున్ గుబేరుఁడున్
బరమవైరియాయముండుఁ బదములంబడన్వలెన్.

ఈ విజయంబు నా కుమారీమణియగు ప్రభావతి కెఱింగింపవలయును.

(అంత తెఱలో)

మ. చలమే చిత్రగతి న్మనోహరవిలాసస్ఫూర్తిరంజిల్లి నె
చ్చెలి! మాటాడవిదేమె స్వప్నఫలముం జింతించి విభ్రాంతవై
కలఁతన్మూర్ఛిలితే ప్రభావతి! మెయిన్ గల్గెన్ జ్వరం బో మహా
ఫలసంధాయకులార! వైద్యునిటకున్ బంపన్ గటాక్షింపుఁడీ.

వజ్ర—(ఆలకించి వెఱఁగందుచు) ఆ! ఎక్కడనుండి యీ కలకలము.

రోమం—ఔఁ! దేవా! ఆకలకలం బంతఃపుర సౌధాంతరంబునుండియే వినవచ్చుచుండె.

తామ్రా—ఔఁ! దేవా! దేవరవారి కుమారీమణి జ్వరాతిశయంబుచే మాటాడకుండెనట.

కఠో—ఔఁ! దేవా! దేవరవా రాజ్ఞనొసంగినచో నిప్పుడే దాసుండగు ధన్వంతరి నీడ్చికొనివచ్చెదను.

వజ్ర—అరేమంత్రులారా! నే నిప్పుడే యంతికంబున కేగి నాపుత్రికారత్నం బెట్టిస్థితిలో నుండెనో స్వయముగఁ దెలిసికొనివచ్చెదను. మీ రీపురంబునఁ దగువైద్యుల నరయుఁడు. (అని యంతఃపురంబునుగూర్చి నిష్క్రమించుచున్నాఁడు.)

సోమం—ఆఁ! సహామంత్రివతంసములారా! మనముకూడఁ జని యేలికయాజ్ఞాప్రకారము జరిగించివత్తుము రండు. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

తామ్రా—ఆఁ! ప్రభావతీరమణికి దేహారోగ్యము కలిగెనేని దురాత్ములగు యమ వరుణ కుబేరులు నిర్జింపఁబడినవారే. కఠోరదంష్ట్రీ! వైద్యాన్వేషణార్థమై పోవుదము రమ్ము. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

కఠో—(ఇటునటుఁజూచి] ఆఁ! దేవతాసంబంధినియైన దాసి శుచిముఖి యీలాగువచ్చుచున్న దేమిచెప్మా. అంతఃపురవర్తమానములు మహారాజుగారికి నివేదించుటకుఁ గాఁబోలు.

[అంత శుచిముఖి ప్రవేశించి]

శుచి—ఓహోకఠోరదంష్ట్రీ! ఈ మనవజ్రపురంబున గుఱుతుగ నెఱుకఁజెప్పఁగల నెఱుకత నెందున్నను గొనిరావలసినదని వజ్రనాభమహారాజుగారి సెలవైనది. కావునఁ దత్కార్యనిర్వహణార్థమై నీవు వేవేగఁ జనవలయును. తడవైనచో మన ప్రభావతీకన్యకకుఁ గీడువాటిల్లుఁజుమీ.

కఠో—ఆఁ! నే నిప్పుడే జని రాజాజ్ఞ నెరవేర్చెదను. (అని నిష్క్రమించుచున్నాఁడు)

శుచి—(స్వగతము) నే ననుకున్నటుల నా యభిప్రాయం బెఱుంగజాలక వజ్రనాభుఁడు విరహ పరవశయై మూర్ఛఁజెందియున్న నిజకుమారీమణి నిశ్చయముగ రోగపీడిత యయ్యెనని తలంచియే శుద్ధాంతంబున కేగియుండె. అనంతరకర్తవ్య మాచరింపఁ దడవయ్యెనేని యాలేమ ప్రమాదవశంబునఁ బ్రద్యుమ్నకుమారుంగూర్చి యేమేమి పల్వరించునో. ఆ కన్యామణి నిశ్చయావస్థ వజ్రనాభుం డెఱింగినచో నా ప్రయత్నం బంతయు విఫలం బగుటయేఁగాక ప్రభావతీకన్య కేమి యుపద్రవము తటస్థించునో. కావున నే నిపుడే యెఱుకతవేషమును ధరించి కఠోరదంష్ట్రినితో నంతికంబున కేగి నా నేర్పుచే వజ్రనాభుని యనుజ్ఞఁగొని గురుకైతవంబునఁ బ్రద్యుమ్నకుమారు నంతిపురంబునకు రప్పించెదను. అనంతరకర్తవ్య మప్పుడే యాలోచింపవచ్చును. (అని నిష్క్రమించుచున్నది.)

[అంత నంతఃపురమందు శయ్యాతలంబున మూర్ఛిల్లియున్న ప్రభావతికిఁ జెంత రాగవల్లరి శైత్యోపచారము లొనరించుచుండ వజ్రనాభుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

రాగ—(వజ్రనాభునిఁజూచి వ్రీడాభయంబులు మనంబునఁ బెనంగొన లేచి నిలువంబడి) సఖీ! ప్రభావతీ! నిన్నుఁ జూడఁగోరి మహారాజుగారు వచ్చియున్నారు. లేచి కూర్చుని మాట్లాడుము.

వజ్ర—(సెజ్జపజ్జఁగూర్చుండి) ఆఁ! బిడ్డా! పలుకవేమి? (అని తనలో) ఆఁ! ఏమిది! నాప్రియకుమారీమణి గాఢమైనజ్వరంబుచే మైమఱచి పిలిచినను మాటాడకున్నది. కుసుమకోమలియైన నా చిన్నారిముద్దుకూఁతు రీదారుణజ్వరంబున కెట్లోర్చు. ఆఁ! కుమారీ!

ఉ. వాలును కేలఁబూని బలవంతుఁడ నేనని స్వర్గ మర్త్య పా
తాళనివాసులందఱు సదా మది నన్నుఁ దలంచి భీతిచే
మూలలడాగియుందు రిటు మూర్ఛమునింగితి వేల నేను వా
హ్యాళినెసంగ వ్యాధిగణ మంతమునొందదె యో ప్రభావతీ.

ఆఁ! నా ప్రియతనూజారత్న మింకను మాట్లాడకున్నయది. ఏమిది!

ప్రభా—(మూర్ఛ తెలిసి కన్నులు తెఱచి వజ్రనాభునిఁజూచి భయవిహ్వలయై దిగ్గనలేచి కూర్చొనుచున్నది-)

(అంత కఠోరదంష్ట్రుఁడు ప్రవేశించి)

కఠో—ఆఁ! దేవా! దేవరహజారము చెంగటికి.

చ. తిరుగుచు నల్లపూసలును తెల్లనిపూసలు సంకుపూసలుఀ
గుఱుతుఁగ దాల్చిమైతొడవుఁ గోలను కేలనమర్చి పుట్టికఀ
శిరమునఁదాల్చి మేత్తెలియఁ జెప్పెదరండని గిల్కరించు నా
యెఱుకలసానివచ్చె నసురేశ్వర! తోడ్కొని రా ననుజ్ఞయే?

వజ్ర—ఆఁ! కఠోరదంష్ట్రా! ఆ యెఱుకలసానిని శీఘ్రముఁగఁ దోడ్కొనిరమ్ము.

కఠో—చిత్తము. (అని నిష్క్రమించి వెంటనే యెఱుకతయైన శుచిముఖితోఁ దిరుగ బ్రవేశించుచున్నాఁడు.)

వజ్ర—ఆఁ! ఎఱుకలసానీ! నాముద్దులగున్న యవస్థ యెట్టిదియో వచింపుము.

శుచి—చిత్తము. (అని ప్రభావతిని సమీపించి.)

ద్విపద—సౌరాష్ట్రిరాగము.

రావేయువ్వమా రాజవేయవ్వ
భావంబురంజిల్ల బలుకుదుశవ్వ

నాసుద్దువినినంత ఽ నయమౌనెయవ్వ
వేసటఁజెందు నీ ఽ విధమిప్డు డవ్వ
మలయాలబగవతి ఽ మరువకేయవ్వ
కలుములఁబెంపొందఁ ఽ గాంచెదేయవ్వ

అవ్వా! నీచే యొక్క సారెచూడనిమ్ము. (ఆలిప్రభావతికరంబుఁ బట్టుకొని).

అవ్వో యవ్వ! బాగ్గెం ఽ గలసెయ్యి
మవ్వంపుకీర్తిసం ఽ పదగలసెయ్యి
దానదరమంబులఁ ఽ దనరారుసెయ్యి
దీనులరచ్చింప ఽ తెగువైనసెయ్యి
పాడిపంటలుగలిగి ఽ బాసిలుసెయ్యి
కోడెగానినిఁగూడి ఽ కులికెడుసెయ్యి
సౌబాగ్గెమునమించు ఽ సరసంపుసెయ్యి
సుబరేకలనుగల్గి ఽ సొంపొందుసెయ్యి
సుట్టాలసురబియై ఽ సోబిలుసెయ్యి
పుట్టుబోగంబుల ఽ బొలుపొందుసెయ్యి
దేసదేసములప ఽ తిట్టగనుసెయ్యి
ఆసలీడేరంగ ఽ నలరారుసెయ్యి
దట్టంపుసిగ్గుల ఽ సేతనువెల్గుసెయ్యి
పట్టితిమేలొందు ఽ బంగారుసెయ్యి.

అవ్వోయవ్వా! మేలుసూపు సూసుకొనుసున్నావు. మేలుకోరిక కోరుసున్నావు. అది కాయో పండో కల్లో నిజమో అవునో కాదో సేకూరునో సేకూరదో అని వెనుకకు ముందుక త్రొక్కుడుబడుసున్నావేయవ్వా! అది కాయకాదుపండు. కల్లగాదు నిజము. అది సేకూరునా సేకూరదా అంటే పుసపంబునకు తావిసేకూరదే యవ్వా! అయితే మేలుకోరికలకిగినాలు మెండేయవ్వా! అవ్వోయవ్వ! నీతలంపు నాకు పొడగట్టినది. అది మగవారివంకతలంపా ఆడవారివంక తలంపా అంటే అదిగో మగవారంటే గడ్డంబు ఆడవారంటే లక్కాకు. అదిగో గడ్డంపు పిసానమేనిన్నిపు డావహించి సిక్కులుపెట్టుసుండెనే యవ్వా! దానివలన గలుగు బాదదొలగింప గోరుసుంటివే యవ్వా! అకోరికె

ప్పటికి నెరవేరునంటే ఒకటే రెండే మూడే ఒకటంటే ఒకయేడుకాదు రెండంటే రెండేండ్లుకావు మూడంటేమూడేండ్లుకావు నీతండ్రిగారి సెలవయ్యేనేని యిదిగో యింతలోనే నేకూరునేయవ్వా! ఆపోతుగాలి యీదచ్చిన పచ్చిమమూలనుండి వచ్చెనేయవ్వా! అది మాగడ్డపిసాస మేయవ్వా! దానిచే గలుగుబాద నేదొలఁగింపఁ జాలనేయవ్వా! ఈపురంబునకు దచ్చినబాగమందేయవ్వా! నాగురువుండెనేయవ్వా! నీతండ్రిగారి సెలవై తేయవ్వా! వానినిప్పుడే తోడ్కొనివచ్చెదనేయవ్వా! అప్పుడు నీబాదలుతీరునేయవ్వా! నీతలంపులు సాగునేయవ్వా! నీకోరికలీడేరునేయవ్వా! నీరొట్టె నేతబడునేయవ్వా! నామాటనిజమేయవ్వా! వినుము నాబుట్టతోడేయవ్వా! అప్పుడు నన్ను మెచ్చేవేయవ్వా! కోరికలిచ్చేవేయవ్వా!

అమ్మవారమ్మ వారమ్మవారూ జగదమ్మ జగదమ్మ జగదమ్మ
మలయాలబగవతీమాంకాలిచండికాదురగామహాదేవియోయాదిసత్తి
గైరమ్మబైరవీ కాత్యాయనీదేవి మాతంగకన్యా యుమా యర్ధనారీ
తోడునీడై మాకు దోడ్పడియీామె కోరెడుకోరిక ల్కొనసాగఁజేసి
నాపల్కుదబ్బర కాకుండసేయ సేరిమొక్కెదనమ్మ చివురుయిల్లాలా॥అ॥

ప్రభా—(ప్రసన్నవదనయై తండ్రిని వీక్షించి) జనకా! ఈ యెఱుకలసాని పలుకులచే నామనోవ్యాధి నివారించునని యాసపొడముచున్నది. కావున మీ రా మగురువు నిచ్చోటకు రప్పింప నాజ్ఞ నొసంగ వేడెదను.

వజ్ర—ఆఁ! బిడ్డా! మంచిది. (అని యెఱుకలసానితో) ఆఁ! ఎఱుకలసానీ! నా నుద్దులపట్టె వ్యాధి నీ గురువు నివారింపఁగలఁడను ధైర్యము నీ కున్నచో వానిని శీఘ్రంబుగ నెందున్నను దోడ్కొనిరమ్ము. అటఁ డీయంతిపురంబునకు వచ్చినపిదప నా బిడ్డ వ్యాధి నివారింపలేనిచో వానికిని నీకును హానిఘటిల్లునని నిశ్చయించుకొనుము. పొమ్ము.

శుచి—చిత్తము. (అని నిష్క్రమించుచున్నది.)

వజ్ర—ఆఁ! పట్టీ! ప్రభావతీ! నీ కిట్టివ్యాధి కలుగుటకుఁ గారణమే మా దెల్పుము.

చ. అమరులఁ ద్రుక్కఁజేసి యమరాధిపుఁ బీచమడంచి వానినా
కముఁగొని కిన్నరేశ్వరుని గర్వము సర్వము దుల్చినచ్చిటిక్
ప్రమదముఁ జెందకుండఁగఁ బ్రభావతి చింతిలె దేల? నీదు డెం
దమునను గల్గుకోరిక ముదంబున జెప్పగదమ్మ తీర్చెదన్.

ప్రభా—తండ్రీ! నా కేమియు తెలియదు.

వజ్ర—ఆఁ! చేటీ! నీ వేమైన మూలము గని పెట్టఁగలిగితివా?

రాగ—దేవా! ఎట్టిపైత్యవ్యాధిచేతనోగాని యీ మా నెచ్చెలి, కతిపయదివసంబులనుండి రేయుంబవలులు నిద్రాహారంబుల నుజ్జగించి విపులజ్వరంబుచే మైమఱచి పల్వరించుచున్నయది. ఆకారణంబుచే యీమె కెద్దియో గాలి సోకెననియే తలంచితిని. అయిన శుచిముఖినిఁ దోడ్కొనివచ్చెదను. (అని నిష్క్రమించుచున్నది.)

[అంత శుచిముఖి కైతవభూతవైద్యుండగు ప్రద్యుమ్నునితోఁ బ్రవేశించుచున్నది.]

వజ్ర—(ప్రద్యుమ్నునిఁజూచి) ఆఁ! భూతవైద్యుఁడా! నీకు భూతవైద్యమునందు పరిశ్రమకలదా?

ప్రద్యు—దానవేంద్రా! సందేహ మేమి? వినుము.

శా. భూతప్రేతపిశాచసంఘములనేఁ బూర్ణాహుతిన్ జేసెదన్
ఖ్యాతింజెందెద మంత్రసిద్ధి వినుమింక నీకుమారీమణిన్
జేతఃప్రీతిఘటించి సౌఖ్యముల రంజింతున్ మదర్థంబు ని
ర్భీతిన్ గైకొనఁగల్గెదన్ నినుగృతార్థున్ జేసెదన్నేర్పునన్.

ఇంత యేల నా సామర్థ్య మెఱింగించెదవినుము.

సీ. దేహజాడ్యంబైన దివ్యౌషధంబులఁ
బాయక దానిఁబాపంగనేర్తు
పీడసోకినఁగాంచి వేవేగమంత్రతం
త్రములనాబాధఁ దలఁగనేర్తు
మతిసంచలించిన మానకదగు చికి
త్సలదానిబాగుగా సలుపనేర్తు
విరహాబ్ధిమగ్నయై వెతలఁజెందుచునున్న
దవిలినాథునిఁదెచ్చి దనుపనేర్తు.

గీ. గాక యింకెట్టికతమునఁ గలికి! వగల
బెగిలి నవయుచునున్న నాబింకమొప్పఁ
దగు నుపాయంబు ఘటియించి తన్నివృత్తిఁ
జేసి నిన్నుఁ గృతార్థుఁగాఁ జేయనేర్తు.

వజ్ర—ఆఁ! భూతవైద్యుఁడా! నీ ప్రగల్భోక్తులు చూడ "మంత్రము తక్కువఁ తుంపర లెక్కువ" అన్నటులఁ జేయుదువేమో యని తోఁచుచున్నది. నిక్కువంబుఁగ నీకు భూతవైద్యమునందుఁ బరిశ్రమయుఁ గౌశలముఁ గలిగినచో మాప్రభావతి నాడిపరీక్షించి యామె నెంతకాలములో నారోగ్యస్థితిలోకిఁ దీసికొని రాఁ గలిగెదవో వచింపుము.

ప్రద్యు—దానవాగ్రణీ! నాపలుకులు వట్టి ప్రల్లదంబులుగానే భావించితివా?

సీ. నేర్పు లేకున్నచో ॥ నేనిటవత్తునే
బెల్లమేకదప్రాణ ॥ మెల్లరకును
చిత్రగతినిఁగన్య ॥ చిత్తసంగతిఁగాంచి
భ్రాంతినిఁజెంది భా ॥ వమునఁగుంది
మదభీష్టవిషయసం ॥ పదఁగోరి వనసీమఁ
జరియించి నైపుణి ॥ సంగ్రహించి
ప్రప్రభావతిదుర ॥ వస్థ నీయెఱుకత
తెలుప నీయనుమతి ॥ కలిగెఁగాన,

గీ. కలికినలరింప నెమ్మదిఁ ॥ దలఁచి యిటకు
వచ్చితినిఁ బ్రల్లదంబులు ॥ వలుకనగునె
వినుము, "ముంజేతికంకణం ॥ బునకునద్ద
మేల?" నాశక్తినీవింక ॥ యెఱుఁగఁగలవు.

వజ్ర—మంచిది. నీ ప్రజ్ఞ యెట్టిదియో చూతముగాక.

ప్రభా—(తనలో) ఈ భిషక్తల్లజునిమాటలు భావగర్భితములుగా నున్నయవి.

ఉ. మామకచిత్తసంగతి న ॥ మానుష చిత్రగతిన్ గ్రహించి యు
ద్దామవనంబున న్నిపుణ ॥ తన్గొని వచ్చితినంచు దర్వర్ధిగా
నీమహనీయుఁడియ్యెడ వ ॥ చించెడు నిశ్చితభావమేమొకో
తామరసాక్షుఁడీ భిషజ ॥ తల్లజుఁడెవ్వరో తోఁచరాదహా.

శుచి—(తనలో) ఈతండు తమిమీరి సంభాషించుచున్నాఁడు! ఏమి యుపద్రవము తటస్థించునోకదా?

ప్రద్యు—రాక్షసరాజవతంసమా!

గీ. పలుపలుకులేల నాదు నేర్పరితనంబుఁ
దెలియుఁ ద్వరలోన నీకూఁతు నలరఁజేయఁ
గలుగఁ దత్సౌఖ్య సంగతివలనఁ గోర్కె
సఫలమౌనాకు వినుమునిశ్చయముగాను.

వజ్ర—ఆఁ! ఏది! నా కుమారీమణి నాడిఁ బరీక్షించి తగిన చికిత్స యొనరింపుము. చూతము.

ప్రద్యు—ఏమిదైత్యేంద్రా! ఇంకను సందేహించుచునే యుంటివా. నాడిఁ బరీక్షించుటకు గరగ్రణముఁజేసి యూరకొందు ననుకొంటివా?

చ. ఉరగముఖాంతరస్థమగునుగ్రఫుఁ గోఱలఁ బట్టవచ్చు మే
దురబడబానలంబయినఁదోరముఁగాఁ గబళింపవచ్చు భీ
కరమగువ్యాఘ్రదంష్ట్రలనుగ్గై కొనవచ్చును దైత్యకన్యకా
కరముఁగ్రహించి యూరకొనఁగావశమే రజనీచరాగ్రణీ.

వజ్ర—(అలుకగదుర) ఆఁ! మూర్ఖా! ఊరకొనక యేమిచేసేదవురా?

ప్రద్యు—నేఁ జేయునదివినుము.

క. పైత్యజ్వరపీడిత యీ
యత్యంతమనోహరాంగికభిమతలీలన్
నిత్యసుఖయోగ ఫలమిడి
ప్రత్యర్థిగ నేఁగృతార్థపరిణతిఁ గాంతున్.

(అని ప్రభావతిని సమీపించుచున్నాఁడు.)

ప్రభా—(తనలో) ఏమి! వీనిమాటలు మిగుల భావగర్భితములుగా నున్నయవి. ఈపురుషునిఁజూడ నామనం బేలనోగాని యుత్కలికఁ జలింపుచున్నది. వీని సాహసంబుఁ జూడ నేమియుపద్రవము తటస్థించునో యని భయముకలుగుచున్నది. ఏమిచేయుదును - (అని యొకకేలఁ గురులను బ్రద్యుమ్నునకుఁ జూపుచు శుచిముఖినిఁ దిలకించుచున్నది.)

శుచి—(తనలో) నే నింక ననంతరకర్తవ్య మాచరింపఁ ద్వరపడవలయును.

(అని నిష్క్రమించుచున్నది.)

వజ్ర—ఆఁ! వైద్యుఁడా! ఇంక నీ విస్రంభవాచాలతఁ గట్టిపెట్టి కర్తవ్యమాచరింపుము.

ప్రద్యు—అటులైనచో నీ కుమారీమణి నాడి పరీక్షించుటకై,—

చ. కరముఁ గ్రహించెదన్ ఫలముఁ గాంచెదఁ జిత్రగతిన్నెలంగ్రి యీ
సరణినెఱింగెదన్ గలికిసంగతి సంతసమందఁగల్గెదన్
గురుతరభోగభాగ్యములకుం గుఱిఁ జేసెదఁ గన్యమానసం
బెఱిఁగి చికిత్సలందనిపి యీప్సిత సిద్ధినెసంగ నాజ్ఞయే?

వజ్ర—ఆఁ! భైషజ్యప్రగల్భ! నా కుమారీమణికరముఁ గ్రహించి నాడిఁ బరిశీలించి తగు చికిత్సలవలన శీఘ్రంబ సౌఖ్యముఁ గలుగఁజేసితివేని గొప్పబహుమానమునే పొందెదవు.

ప్రభా—(తనలో) హృదయమా! సంభ్రమింపకుము. ఆశలారా! తాళుఁడు

ప్రద్యు—మంచిది. (అని ప్రభావతిని సమీపించి) ఓ దైత్యరాజ గృహాలంకార చూడామణి!

ఉ. చిత్రపుఁ బెత్తెలంబడిన చేపయుఁ జిక్కునటంచు పల్లెవాఁ
డాత్రముతోఁ జనుంగద రకయంబునవచ్చితి నేనవైద్యుఁడన్
జిత్రగతిన్ జ్వరంపుటురిఁ జిక్కఁగఁ జేసిననాడె యుంగు నేఁ
బాత్రుఁడనంచుఁ దోఁచినఁ బ్రభావతి! నీదుకరంబొసంగుమా.

(అని ప్రభావతీపాణిగ్రహణంబునకై గమకించుచున్నాఁడు.)

(అంత తెరలో)

హాహా! సద్గురూ! హా కరుణార్ద్రహృదయులారా! రక్షింపుఁడు. రక్షింపుఁడు. అయ్యో! ఈరాక్షసకులంబున కెట్టియుపద్రవము సంభవించునోకదా? చచ్చితిని. చచ్చితిని.

మ. ముదిముత్తైదువటంచు నెంచక ననున్ దుర్మార్గాత్ముఁడై వీఁడు చం
పఁదలంపూనిగళంబుఁ బట్టె నిదె యో సద్బంధులారా! భయా
స్పదమైయుయ్యెడు దీనురాలినిగృపన్ భావించిరక్షింపరే
యదనై రాక్షస వంశనాశనముకానై యుండెనే హా విధీ.

వజ్ర—(ఆలకించి మహోగ్రకోపావేశపరవశుండై లేచి) ఆఁ! రాక్షసవంశమునుఁ దలపెట్టు దురాత్ముఁ డెవఁడురా? (అని విజృంభించుచున్నాఁడు.)

ప్రద్యు—(కోపోదగ్రుండై) ఏమేమీ! నిరపరాధినియైన నా శిష్యురాలి నెలుకలసానిని నిష్కారణము బట్టిహింసింపుచున్న ఖలుఁ డెవ్వఁడురా! ఓగోరి దుర్మదాంధా! ఇదిగో నామంత్రంబుచేని స్పష్టడే నిర్ధూమధామంబుఁ జేసెదమ చూడుము. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

ప్రభా—(సంభ్రమించుచు దీనవదనయై తనలో) అయ్యో! ఇది యేమియుపద్రవమోకదా.
(ప్రకాశముగా) హా! ప్రియసఖీ! రాగవల్లరీ! (అని మూర్ఛిల్లుచున్నది.)

రాగ—(ప్రవేశించి) చెలీ! ప్రభావతీ! అయ్యో! మరల మూర్ఛిల్లితివే ప్రియసఖీ!

వజ్ర—ఆఁ! చెలీ! నీవు చెంతఁగూర్చుండి సముచితచికిత్సల నాపట్టి తెలివొందునటులఁ జేయఁ బ్రయత్నింపుచుండుము. నే నిప్పుడే చని రాక్షసవంశమును దలపెట్టిన మది ముత్తైదువను నా మెను రక్షింపఁ గడంగిపోయిన వైద్యుని శిక్షించివచ్చెదను. అరే! వైద్యుఁడా! ఎవఁడవురా నీవు. నిలువుము. నిలువుము. (అని కత్తిఝళిపించుచు నిష్క్రమించుచున్నాఁడు.)

ప్రభా—(మూర్ఛ తెలిసిలేచి) చెలీ! రాగవల్లరీ! నా జనకుం డెటకేగెనో యెఱుంగుదువే?

రాగ—ప్రియసఖీ! నీతండ్రిగారు వైద్యునిపోకడ లరసిరాఁ జనియుండిరి. భయపడకుము వా రిప్పుడే మరలివచ్చెదరు.

ప్రభా—చెలీ! ఇప్పు డేమియుపద్రవము సంభవించునోయని నాకు భయముకలుగుచున్నదే. మఱియు.

గీ. తండ్రిదగ్గఱనుంటఁ జిత్తమునగలుగు
కోర్కెవైద్యునితోఁజెప్పి కొనఁగలేక
కలికి! చెయికాలినంతనాకులకుఁదడవి
కొనినగతి వ్యర్థతనుజెందికుందుచుంటి.

ప్రియసఖీ! ఆ భిషక్తల్లజుఁడు మరల వచ్చునటే? శుచిముఖివచ్చెనా?

రాగ—భయపడకుము. (అని యటునిటుజూచి) సఖీ! ప్రభావతీ! అదిగో! మన నెచ్చెలియగు శుచిముఖి యాదిక్కునఁ బోవుచున్నయది. (అని యంగుళిచేఁ జూపుచు) వైద్యునరయుటకే కాఁబోలు.

ప్రభా—సఖీ! నామనం బిపుడేలనోగాని దామరాకుపై నీటిబిందువువలెఁ దల్లడిల్లుచుండెనే.

అకటా! ఏమని చెప్పుదును.

ఉ. చానరో! యొక్క దీర్ఘకుజశాఖనువ్రేలు ఫలంబుఁగోరు నా
నూనసపక్షిరాజ మనుమానము నా నురిఁజిక్కియుండి లో
నూనినవేడ్కఁ బైకెగయనోపకఁ గొట్టుకొనంగఁజాగె నే
దేనియుపాయము న్నెఱప వేవిడనాయురి రాగవల్లరీ.

రాగ—చెలీ! నీ మనః కీర మపేక్షించు ఫల మెద్దియోఁ దెల్పుము. పిమ్మటఁ దత్ఫలావాప్తికై తగిన వెఱవు నాలోచింపవచ్చును.

ప్రభా—ఇప్పు డేమోగాని నామనంబు కలఁతఁజెందియున్నది. ప్రియసఖీ! నీవు వేవేగ. జని శుచిముఖి నెందున్నను దోడ్కొనిరమ్ము.

రాగ—మంచిది. (అని నిష్క్రమించుచున్నది).

ప్రభా—(స్వగతము) ఎఱుకలదానివిధముఁజూడ నా కనుమానము కలుగుచున్నది. పూర్వపరిచితవలె నా హృదయమునంగల తెఱంగంతయుఁ బూసగ్రుచ్చినట్లు వక్కాణింపఁగలిగె. ఆలేమ నా మేలు కోరి కపటకిరాతవేషంబున వచ్చిన భవానియో లేక నిజమైనయెఱుకతయో తెలియరాదు. వజ్రపురేతరనివాసిను లెవ్వరైనఁ గపటోపాయంబున వచ్చియుండిరేమో యని యనుకొందుమన్న నా తండ్రిగారి యనుమతిలేకుండ నొరు లెవ్వరు నా హర్మ్యతలంబునకు రాఁగలుగుదురు? ఆయెఱుకత వజ్రపురనివాసినియో కాక మదీయాంతః పురసంచారిణియైన కపటనటనావిదగ్ధయో కావలయు. వజ్రపురనివాసినియే యనుటకు మేలుచూపిన చిత్రపటసందర్శనంబుచే మరులుగొని మేలుకోరికఁ గోరితినని యెట్లెఱింగె? ఆమగువ భూతభవిష్యద్వర్తమానకాలసంవేదినియుఁ గామరూపిణియు నన్మన్మనోరథసంవేదినియు మదీయాంతః పురసంచారిణియు గపటనటనావిదగ్ధయు నగు శుచిముఖియే కావలయు. మరియు నాచతురిక తనతోడఁ గొనివచ్చిన పురుషుం డెవ్వరై యుండునో తెలియరాకున్నయది. వాని మనోహరరూపము దేవీదత్తంబైన చిత్రఫలకాంతర్గతాకారంబున కనురూపంబుగ నుండుటయే గాక వానిమాటలును భావగర్భితములుగానే యున్నయవి. ఓహో! ఏమి యీచిత్రము.

మ. చెలిమిన్ జిత్రపుటెత్తెలంబడిన యీ చేపన్గొనన్ రమ్మటం
చలరన్ వ్రాసినలేఖ దానెఱిగి నట్లాకాంతు "నేవచ్చితిన్
గలికిన్ జిత్రగతిన్ జ్వరంపుటురిఁ జిక్కంజేయునానాడి రం
జిలఁగాఁజూతునటంచుఁ గైఁగొనఁగ నెంచెన్ వైద్యుఁడెవ్వాఁడొకో.

అదియునుఁగాక వైద్యక్రియాకైతవుండగు నా మహాపురుషుని మనోహరరూపరేఖావిలాసంబులు చూడ నాతం డభినవమన్మథుం డేమోయని యనుమానము కలుగుచున్నది. ఏమన.

మ. స్మితవక్త్రుండగు వైద్యవేషమున నా చిత్తంబెలర్పంగ నా

గతి మైఁదాల్చి విభూతి మారుఁడె శరత్కాలాంబు దాచ్ఛాదిత
స్థితిభాసిల్లెడు మేనమామగుణముల్ సిద్ధింపవే ప్ర-ప్ర-భా
వతి యంచు న్ననుఁ బల్కుతో ట్రువడఁ బిల్వన్ జాగె నాశ్చర్యమా.

(అని సోత్కంఠయై) హృదయమా ! సంభ్రమింపకుము.

ఉ. సుందర చిత్రసంగత విశుద్ధ మనోహర రూపపుష్ప ని
ష్యందమరందతుందిలవి హారసముత్సుకనంచు మానసేం
దిందిర!దుర్గమంబగు ను దీర్ణపు జాలము నందు జిక్కినీ
వందగరాని సూనరసమానఁగఁగోరి తపించె దేలనే?

(అని నిట్టూర్పువిడిచి) ఏమిచెపుదు! నామనం బిపు డేలనో గాని పరిపరివిధంబులఁ గలగుండు పడుచున్నయది. (అని యటునిటుఁజూచి సంతోషముతో) అదిగో! నా చెలి కత్తియలగు శుచిముఖియు రాగవల్లరియు నచ్చుచున్నారు.

(అంత శుచిముఖియు రాగవల్లరియుఁ బ్రవేశింతురు.)

శుచి—(నవ్వుచు) సఖీ! ప్రభావతీ! నీ చాతుర్య మెంతయైనఁ గొనియాడవచ్చునే!

చ. తెలిసెను లే ప్రభావతి! త్వదీయచమత్కృతి నన్నునిర్దయన్
దలఁగఁగఁ జేసి నీవెలుకతన్బిలిపించి మనోనిదానవా
ర్తలువిని తద్గురూత్తముని రా నొనరించితి వంట యూతఁ డు
జ్వలుఁడఁట చెప్ప వెంత నెఱజాణవె నేనెఱుఁగంగ లేనటే.

మఱియు:

చ. గురుతరకాననాంతర నికుంజ మహీరుహ వారిరాశి దు
స్తరగిరి గహ్వరంబులను దాటుచు వజ్రపురంబులోన ని
న్నరియుచుఁ జేరవచ్చి ఫల మున్గొనవచ్చునటంచుఁ బ్రీతి నీ
కరమున వ్రాలనెంచిన శుకం బెటకేగెనె యోసఖీమణీ.

ప్రభా—(శంకాసంకులితచిత్తయై వెఱఁగందుచు) సఖీ! శుచిముఖీ! నీమాటలు నాకేమియు నర్థముగాకున్నయవి. నిర్దోషినైన నన్నేలఁబరిహాసించెదవు?

రాగ—ప్రియసఖీ! ప్రభావతీ! ఆ కీరము నే గాఁబోలు మన కేళీోద్యానవనాంతరంబున వెదకుచుండిన యీ శుచిముఖిని గని నీచెంతకుఁ దోడ్కొనివచ్చితిని.

శుచి—చెలీ! ప్రభావతీ!మెలకువతో నిద్రఁబోవువారి లేప నెవరితరంబగు?

ప్రభా—సఖీ ! ఏల నాపై నిర్హేతుకంబుగ దోషారోపణఁ జేసెదవు?

చ. వరరుచిరంపు చిత్రగత । వైఖరి దాహముజెందు నన్ను డ
గ్గరుట రసంబుగాఁ గొనెడు । కల్మి ఘటించు నటన్న భ్రాంతిచేఁ
దెరలక నామనంబు మృగ । తృష్ణ జలంబను భ్రాంతిఁ జిక్కి నా
హరిణము పోల్కి నెంతయును । వ్యర్థతఁ గుందుచు నుండెనక్కటా.

మఱియు.

ఉ. ఆరయఁ జిత్రలీలలఁ గు । జాగ్రఫలంబు రసస్ఫుటంబుగాఁ
గోరికలూరఁ జెంత సమ । కూడినయట్టుల నాసఁ గొల్పియున్
దూరగతంబుగాఁగ నెటు । దోఁచక వంత మునింగి నామనః
కీరము దానితో శుచిము । ఖీ! చనియెన్ గద యేమిసేయుదున్.

రాగ—(తనలో) ఈ సఖీమణుల మాటలు భావగర్భితంబులుగా నున్నయవి వీరి యభిప్రాయము లేమో యిప్పుడే స్పష్టమయ్యెడు. నేఁ ద్వరపడనేల?

శుచి—(వెఱఁగు నభినయించుచు) సఖీ! ప్రభావతీ! ఏమి! నీ దాహముఁదీర్ప సమర్థంబగు రస మిడఁజాలు విషయంబు నిన్ను నిశ్చయముగ డగ్గరియెనా? అటులైనచో దానిని మరల నీ వేల పోనిచ్చితివి? నే నీమాటలు నమ్మజాలను.

ఉ. ఎంతటిజాణవే ప్రియ స । ఖీ! మదిలోని రహస్యముల్ సదా
చెంతమెలంగు నీ యనుఁగు । చేడియ నన్ గనుఁగప్పి చెప్ప క
త్యంతము దాచిపెట్టితివి । ధర్మమె? యియ్యెడ నిన్నెలర్పనే
వింతలుపుట్టెనో తెలుప । వే భయమేలనె ముద్దరాలవే.

నీవు చెప్పకపోయినను సర్వము నే నెఱిఁగియే యున్నదానను.

ప్రభా— చెలీ! నీకన్న జాణ లెందుఁగలుగుదురు?

క. సుదతి! మాయాకిరాతవై । సుందరాంగు
నొకనిగురువని తోడ్తెచ్చి । యుత్సుకతను
దెలుపవే పూసగ్రుచ్చిన । తెఱఁగు నాదు
మేలుచూపును మేల్కోర్కె । మేలమేలె?

ఆ పురుషసింహుండు వైద్యక్రియావ్యాజంబున వచించినమాటలు భావగర్భితములై

నా కెంతయు భ్రాంతిఁగొల్పినవి! ఇంక నీ వేలదాచెదవు?

రాగ—(ఆశ్చర్య మభినయించుచు) ఏమి! ఎఱుకతవేషము ధరించివచ్చిన దీ శుచిముఖి యేనా! అటులైనచో నామె గురు వెవ్వరై యుండునో కదా.

శుచి—(చిఱునగవుతో) చెలీ! ఆ పురుషుం డొకతస్కరుండు. కావుననే వానిమాటలు నీకు భావగర్భితంబులుఁ గాఁదోఁచె. అయిన నీ వెట్లు భ్రాంత వైతివో వచింపుము

రాగ—సఖీ! శుచిముఖీ! నీ గురువైన యా సుందరాకారుండు తస్కరుం డెట్లయ్యె? వానియొద్ద నీవు తస్కరవిద్యయే నేర్చికొంటివి కాఁబోలు.

ప్రభా—శుచిముఖీ! ఇంకను నన్నుఁ బరిహసింపుచునే యుంటివా?

చ. చెలియరో మిత్రమాగమ విశేషముచే వికసింపఁ జిత్రమా
జలజ నవీన కుట్మలము సన్నిధిఁ జేసుట నేడు నాదు హృ
ల్లలిత మదాళి నీకృపఁ జెలంగి యభీష్టమరందమానఁగా
గలుగునటంచు భ్రాంతిఁగొని కౌతుకమందితి నేమిచెప్పుదున్.

నీ వాపురుషవతంసుని కలతెఱం గెఱింగించి నన్ను రంజింపుము.

శుచి—ప్రియసఖీ! సమయాసమయ విచక్షణంబు లేకయే సంభాషింపవచ్చునా?

గీ. గోడలకుఁ జెవులుండు వాకొనఁగనిట్టి
యతిరహస్యపు వార్తలో యబ్జనయన!
కంటక నికుంజమున విరికదంటఁగొనఁగఁ
దలఁప నిర్వారకును బ్రమాదంబుఁగాదె.

రాగ—సఖీ! ప్రభావతీ! మాటలసందడిని పంజరములోని చిలుకకు ఫలం బిడ మఱచి వచ్చితిని. క్షమింపుము. పోయివచ్చెదను. (అని నిష్క్రమించుచున్నది).

ప్రభా—చెలీ! శుచిముఖీ! నీమాటలు నా భ్రాంతిని మఱింత బలపరచుచున్నవి. ఆపురుషుం డెవ్వఁడో నిక్కువంబు వచియింపుము. నేను తాలిమి నిలుపలేకుంటిని.

శుచి—ప్రియసఖీ! ఆ పురుషుని రూపరేఖావిలాసంబులు నీ వెఱుంగనివికావు. అయినను వినుము.

ఉ. ఎవ్వని మున్భవాని హృదయేశుఁడు నీకగునంచుఁ జూపెనో
ఎవ్వని హృత్సరోజరసమింపున నీ యెదతేఁటి క్రోలునో

ఎవ్వని వైద్యవేషమున । నిచ్చటికి న్గొనివచ్చియుంటినో
నెవ్వగమాను మింక తరుణీమణి ! నాగురు వాతఁడేసుమీ.

ప్రభా—(సోత్కంఠయై) ఓహో ! ఏమినాభాగ్యము ! సఖీ ! శుచిముఖీ ! వాని నిజవృత్తాంత మొక్కింత వివరించి నాకుఁ గర్ణోత్సవం బొనరింపుము.

శుచి—చెలీ ! వినుము.

ప. గురుమిష నిన్నుఁగైకొనఁగఁ । గోరియె వచ్చె నతండు రుక్మిణీ
తరుణికుమారుఁడై వెలసి । తమ్ములు తన్గొలువంగ ద్వారకా
పురమున వేఁటలాడుచును । ముద్దులుగుల్కుచునుండె నాకహా!
కర మతివిస్మయం బొదవె । కన్నుల పండువుఁగాఁ గనుంగొనన్.

ప్రభా—(సహర్షంబుఁగఁ దనలో) ఆ మోహనాంగుండు నాబోటి విరహిణీజనమనః కురంగంబుల వేఁటాడుచుండెను కాఁబోలు. (ప్రకాశముగా) సఖీ ! నా హృదయేశ్వరుని ముద్దుపే రేమియో యెఱింగింపుము.

శుచి-చెలీ ! వినుము.

క. వనితరొ ప్రద్యుమ్నుండని
జనులు పిలుచుచుందు రతని । సౌందర్యంబున్
గొనియాడ నలవికా దెం
దునఁ గన్యాహృదయ పశ్య । తోహరుఁడతఁడే.

మఱియు

చ. లలితవిలాస విభ్రమ క । లాకుశలత్వ పరాక్రమంబులన్
విలసితరూప సంపదల । విశ్రుతుఁడై చెలువారునాతఁడో
యలికులవేణి! చూచితిక । దా నవమోహనమూర్తి వైద్యుఁడై
వలచి నినుగ్రహింప నిటు । వచ్చినవాఁ డలమారుఁడే సుమా.

ప్రభా—ఓహో ! ప్రియసఖీ ! నీకతంబున నే నింక ధన్యురాలనయ్యెదను. ఆ నా హృదయేశ్వరుం డిపు డెటకేగియుండునో కదా.

శుచి—ప్రియసఖీ ! నీవు నీ కేళికాభవనంబులోని కేగుము. నే శృంగారవనంబులోని కేగి వాని నరసివచ్చెదను.

ప్రభా-మంచిది.

(అని యొవరిత్రోవను వారు నిష్క్రమించుచున్నారు.)

గద్య.

ఇది శ్రీమద్వేంకటరమణ కరుణాకటాక్ష వీక్షణాసార సమాసాదిత రసబంధురకవిత్వవైఖరీప్రవీణాపస్తంబసూత్ర శాండిల్యసగోత్రపవిత్ర హోతృకుల కలశార్ణవరాకాకైరవమిత్ర వేంకటరత్నసుపుత్ర వేంకమాంబాగర్భ శుక్తిముక్తాఫల వివిధవిద్వజ్జనవిధేయ వేంకటకృష్ణ నామధేయ ప్రణీతంబైన ప్రభావతీ ప్రద్యుమ్నంబను నాటక రాజంబున పంచమాంకము.





శ్రీరస్తు.

హయగ్రీవాయనమః.

# ప్రభావతీప్రద్యుమ్నము.

## షష్ఠాంకము.

రంగము: వజ్రపుర కేళికోద్యానవనము.

[వైద్యవేషుండగు ప్రద్యుమ్నుఁడు ప్రవేశించుచున్నాఁడు]

ప్రద్యు—ఆహా! తా నొకటిఁదలంప దైవము వేఱొండుఁదలంచు నను టిట్టిదియేకదా.

చ. అమిత మహోగ్ర కాననముఁనందున నే మృగయాప్రసక్తిచేఁ
దమి విహరింపుచు న్ననముఁ తన్వీపయిందగులంగ వచ్చి యా
రమణిఁ గ్రహింపలే నయితిఁ ప్రాప్తము లే కొకవస్తువైన హ
స్తమునను జిక్కిన న్బెదవిఁ దాఁటినదాఁక నిజంబు లేదుగా.

అకటా! నే నెంతయు నవివేకి నైతిని.

గీ. పాలుద్రావలేక ఁ పాలచెంబును పిల్లి
బోర్లద్రోయు పగిదిఁ బువ్వుబోణిఁ
గాంచి కరముఁబట్టఁ గా నుండి యక్కటా!
వెకలినగుట దాని ఁ విడువనయ్యె

నా దురదృష్టదేవతా క్రందనమో యన నట్టి యార్తాలాప మొనరించి కను మొరంగి నను దిగ్భ్రాంతిదుప యెవ్వరోఁగదా. ఆ యమ కామరూపసంచారిణియైన శుచిముఖియో నన్ను నా యుద్యమంబు నెఱింగిన వృద్ధరాక్షసవనితయో కానలయు. వృద్ధరాక్షసవనితయే యైన చో రాక్షసవంశనాశనముఁ దలపెట్టునా? శుచిముఖియే యని యనుకొందుమన్న నా కామిని నామనోహారిణియగు ప్రభావతీ కన్య సందేశంబున ద్వారకాపురవరంబున కేతెంచి;

చ. అనుపమరాగరజ్జుల ననంతముఁగాఁ గలయంగఁ జేసి నా
మనమను బొంగరంబున కమానుషలీలలఁ జుట్టి వైచి విం
చిన భ్రమణంబుఁ బైకొనఁగఁ జేర్చియు నిప్డరి నాఫలంబు చే
తనుబడువేళ గ్రద్దవలెఁ దన్నుకపోవునె యీఁగతిన్ గటా.

అయిన నే నిప్పు డేమనుకున్నను లాభములేదు. శుచిముఖియుఁ గానరాదయ్యె. నే మరల నాశుద్ధాంతమున కేగి నామనోరమను గాంచుభాగ్యంబును లభింపదయ్యె నే నా వాల్గంటిని గన్నులారఁ జూచినతోడ నే నామనంబు తన్మయం బయ్యె. మరల ద్వారక కేగుదమన్నను కాళ్లాడకున్నయవి. ఏమిచేయుదును. (అని నలుదెఱఁగుల వీక్షించి) ఏమి! నే శృంగారవనంబునకు వచ్చితినిఁ కాఁబోలు. ఆహా! ఈవన మెంతరమణీయముగా నున్నది.

లయగ్రాహి.

కమ్మనిలతాంతముల కిమ్మగు నికుంజముల
జుమ్మనుచు రేగు మధుపమ్ములను కాసా
రమ్ములను హంసలు ముదమ్మున మనోభవశ
రమ్ములను తమ్ముల బిసమ్ములను మెక్కన్
గ్రమ్ముకొనుచుం గలరుతమ్ములను భూరుహచ
యమ్ములఁ దమిన్ శుకపికమ్ములెసఁగ న్బిం
ఛమ్ములను విప్పినటనమ్ములను కేకినులు
నెమ్మిఁ గొలుపంగ హృదయమ్మలరుచుండెన్.

ఈ యారామముయొక్క రామణీయతకుఁ గొండొక కారణంబుగలదు. ఏమన,

గీ. నందన వనమ్ములోని విన్నాణమైన
సుమలతా భూరుహములెల్ల సురుచిరముగ
వెలయు నిచ్చోట దేవేంద్రుఁ డాలఁగఁ జేసి
పూని గైకొన్నకల్మి కాఁ బోలునిదియు.

ఎట్లైన నేమి? నా కిప్పట్టున నేత్రపర్వం బొనరించుచున్న యీ శృంగారవనంబున,

చ. తరుణి ప్రభావతింగనని దద్విరహార్తిని మ్రగ్గుచుంటి నీ
జ్వరమునుఁ బల్లవప్రసవసంగతిఁ బైనొలయంగఁ జల్వతె

మ్మెరలు హిమాంబుబిందుల సమ్మేళనఁ దేనియ వానలొప్పఁ గ్రొ
వ్విరుల పరాగశయ్యలను వేడ్కఁజరించి హరింతునియ్యెడన్.

(అని యిటునటుఁజూచి) అదిగో! నక్తంచరుం డొకఁడిటుల నే వచ్చుచున్నాఁడు. నేనీ పొదరింటిమాటున గూరుచుండి వానిప్రయత్న మెట్టిదియో తెలిసికొని కర్తవ్యమాచరించెదను. (అని యట్లచేయుచున్నాఁడు.)

[అంత మహాగ్రకోపనుతో కఠోరదంష్ట్రుఁడు ప్రవేశించి]

కఠో—అరే వైద్యుఁడా! నీవెందుడాగితివిరా? అరే మిథ్యాప్రగల్భ! ఏమిది! ఈ వజ్రపురంబున నే నెంత వెదకినను రాక్షసవంశనాశనునుఁ దలపెట్టిన మదిముత్తైదువయు నా మెను రక్షింపఁ గడంగిపోయిన వైద్యుండును గానరాకుండిరి. వారీపురంబు వెలువడియుందురా? ఆఁ! ముసల ముద్గర భిండివాల తోమర ఖడ్గాది శస్త్రంబులతోఁ గాచియున్న వీరభటనికాయంబు నతిక్రమించి యెట్టివారలైన నీపురంబు నధిగమింపఁజాలుదురె?

క. త్రిజగత్పాలకులగు నా
యజహారులీ పురముజొచ్చి నంతనె వారీ
రజనీచర యోధుల స
ద్భుజ పంజరమందుఁ జిక్కి పొలియరె త్రుటిలోన్.

నా సహచరులలో నేరిచేనైన వారీసరికే పంచత్వంబు నొందియుందురు. ఈసంగతి మహారాజుగారికి నివేదించెదను. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

ప్రద్యు—(వెలికివచ్చి) ఈ దుష్టరాక్షసుండు నే రక్షోవీరులచే, నిహతుండనైతిననియేఁ దలంచుచున్నాఁడు. కానిమ్ము. ఏమిజరుగనైయున్నదో చూచెదఁగాక. (అని కొంచెము ముందరకునడిచి) ఓహో! ఈకేళికోద్యానవన మెంతహృదయాహ్లాదకరంబుగ విరాజిల్లుచున్నయది!

సీ. సురసాల సుమలోల పరిఖేల నరసాళి
మృదుగానములు మది ముద మొలర్ప
నెలమావి బలుతీవి లలితావి గలఫలం
బుల మెక్కు శుకపాళి పలుకు లెసఁగఁ
గురువింద తరుబృంద మురువొందఁ దమిఁజెంది
కలరుతంబులఁ బికంబులు చెలంగ

ననలూని వలపాని కనరాని మలయాని
లుఁడు మెలమెల్లఁగా వెడలుచుండ
గీ. మదమరాళము లెల్లఁ బద్మాకరముల
నలరిబిసములఁ దినుచు నయ్యేలలనూఁగ
నల్లిబిల్లిఁగ నల్లిన మల్లె పొదలఁ
బుప్పొడుల సెజ్జలను వన మొప్పచుండె.

వహ్వా! నే నిప్పుడా పరిమళమిళిత మంజులకుసుమపుంజరంజితంబైన మల్లెపువ్వుటీరంబులోని పుప్పొడి సెజ్జపై యొక్కింతతడవు విశ్రమించెదను. (అని యొకనికుంజంబుఁ జొచ్చి) అన్నా! నేనెంతయవ్యక్తుండనైతిని.

సీ. వైద్యవేషంబున వజ్రపురంబున
కేతెంచినంతనే యింపుఁ గలిగె
వజ్రనాభుని సౌధభాగంబుఁ గనినంత
నడువలేనైతిఁ గాళ్ల్తడఁబడంగ
సౌధంబులోఁ బ్రవేశముఁ గనినంత నే
నిలువెల్ల మేనిపైఁ బులకలెసఁగ
నంతిపురముఁ జేరినంతనే గుండియ
ఝల్లని చెమ్మట వెల్లివిరిసెఁ
గీ. బల్కుతొట్రువడెఁ బ్రభావతిఁ గనినంతఁ
గరముఁ బట్టఁబోవఁ గరము వణఁకెఁ
దనువు మఱచియుంటి గనులీఁదఁజూగె నా
తరుణమందు మోహతమము కప్పె.

ఇప్పుడు నే నేమనుకొన్న నేమిలాభము?

క. పంబుట మోహతమంబున
హంబున వెలుఁగుఁ గని గొంది నడఁగుదివాంధం
బుంబలె స్మితవక్త్రాంబుజ
బింబపు రేవెలుఁగుకోఁడి వెలినైతిఁగదా.

అకటా! నేనెంత మందభాగ్యుండనైతిని!

శా. తానే రమ్మని లేఖ వ్రాసెనుగదా తన్వంగి నాపేర న
త్యానందంబుగ వచ్చియున్నను జెంతం గాంచి రూపింపదో
కానీ చూతమటంచు నూరకొనెనో కామాతురుండంచు నా
పై నింగిన్కవహించెనో జనకుని న్భావించి యట్లుండెనో.

మఱియు నా మోహనాంగి యభిప్రాయ మేమో తెలియరాకున్నది.

మహాస్రగ్ధర.

దరహాసజ్యోత్స్నభూతిన్ దరుణిముఖసుధా ధామబింబోదయంబై
యరుదౌ మోహాంధకారం బణఁగుననుచు నత్యంతము న్వాంగిరా నుం
దరి నన్నుం జూచి వ్రీడా నతముఖియగుచు న్నాపయిన్ గిన్కచేఁ ద
త్కురులం జూపించె వాల్చూ డ్కులఁ బలుకక నా కోకిలాలాపలీలన్.

ఆ కన్యామణియభిప్రాయము రాగసూచకమో సమయసూచకమో తెలియరాదు. అనుభవముచే వియోగసూచకముగాఁ బరిణమించినదికదా. ఒకవేళ నన్ను గుఱుతించి సంభ్రమించినచోఁ గురులెన్ని కలవో యన్ని చిక్కులు కలుగుననియు వానిలోఁ జిక్కినయెడల మరల మోహాంధకారంబున మునుంగవలసి వచ్చుననియు భావగర్భితంబుగఁ దెలిపెఁగాఁబోలు! ఆహా! ఏమి యాకోమలాంగిచాతుర్యము! ఏదైననేమి? మరల నే నాతరుణీమణి నేవిధంబునఁ జూడఁగలుగుదును? అదియునుఁగాక.

ఉ. కాంచి కనత్క్వణ ప్రచుర కంకణకింకిణి తారహారభూ
షాంచితయాచుఁ జెక్కిటఁ గరాబ్జముఁ జేర్చి యొయారమొప్ప నన్
గాంచుచు వాల్కనుంగవ ముఖంబున లేనగ వంకురింపఁ జూ
పించి కురుల్చలద్భ్రుకుటి వీఁకఁ జెలింగనె దీనవక్త్రయై.

ఆచూపు నాహృదయంబునకు వాఁడియైనతూపై నన్నుఁ బరిపరివిధంబుల వేధించుచున్నయది. ఆనన్న నెఱంగియేఁగాఁబోలు శుచిముఖి వెంట నేనివ్వ్రిమించి యట్టియార్తాలాప మొనరించె. హా! నామనోహారిణీ! నన్ను వలచి తపించుచుంటినని లేఖ వ్రాసితివే. ఇప్పు డిట్టివియోగంబుఁ గలిగింప నీమన స్సెట్లొప్పె? కాదు. నేనే యపరాధిని. కామాతురుండనై యుక్తాయుక్తవివేచనంబులేక నీమనోగతం బెఱుంగకయే నిర్భయంబుగ నీకరంబు గ్రహింప సాహసించితిని. అకటా! నీపై మరులుగొనియున్న వాఁడనగుటచే మో

హాతిరేకంబున నేనొనర్చిన యీ యపరాధంబున కింతదారుణమైనశిక్ష విధింపవలయునా? ఇంతనిర్దయ కర్ష్మాండనైతినా?

మాలినీవృత్తము.

కలికి! కరుణలేదా గాసిఁ దూలింపరాదా
పలుకక నను ద్రోయ న్వాడియే చెంతఁ జేరన్
బిలువఁబనుపవేలా వేసటన్ దాళ బాలా!
చెలిమిఁ దలఁచినంతన్ శిక్షకర్ష్మాండనైతిన్.

కటకటా! ఏమి నాదురదృష్టము! (అని నల్గడలఁ జూచి నిట్టూర్పుతో)

చ. కులుకుచు లేఁజిగుళ్లనుఁ గుం జెలి ముక్కునఁ దెచ్చియివ్వ ను
త్కలికను వానిఁ గైకొని పికంబు తమింగొని ముద్దులాడఁ జి
ల్కలు మిథునోత్సవంబులనెకలర్పఁగ గంధవహుండు పూలబం
తులఁగొని కొమ్మలం గవయఁ దూలఁగనయ్యెనె నాకు నక్కటా.

(అని విరహపరవశుండై మూర్ఛిల్లుచున్నాఁడు,)

[అంత శుచిముఖి ప్రవేశించి]

శుచి—(తనలో) వైద్యవేషుండగు ప్రద్యుమ్నకుమారుం డేకతంబ యీ యుద్యానవనంబున విహరింపుచుఁ ప్రభావతిపైఁగల తమిచే విరాళిఁజెందుచుండునని యెఱింగియే వచ్చితిని. ఈ యారామమంతయు వెదకిన నాతఁడు గానరాఁడయ్యె. తిరుగ ద్వారకకేగి యుండునా? అట్లు జరిగియుండదు. ప్రభావతీకన్యానురాగశృంఖలానిబద్ధచేతస్కుండగు నా పురుషవతంసునకు వెనుకకుమరలుటకుఁ గాళ్ళాడునా?

గీ. తనదుచిత్తంబు కన్యపైఁ దగిలియుంట
ద్వారకాపురి కెట్లుపోఁ దలఁచు నితఁడు?
ధర నయస్కాంతమునకు జెంతనుగలట్టి
యినుము దానిని విడనాడి యేగఁగలదె?

ఆతం డీపువ్వుటీరంబుల నెందైన డాగియుండెనేమో బాగుగఁ బరికించి చూచెదఁగాక. (అని యంతటను గలయఁజూచి ప్రద్యుమ్ను నిరీక్షించి) ఇదిగో! ప్రద్యుమ్నకుమారుం డిచ్చోటనే యున్నవాఁడు. (అని సమీపించి చూచి వెఱగందుచు) ఏమి! ఈతండు విరహవేదనా దందహ్యమానమానసుండై మూర్ఛిల్లినట్లున్నదే! ఈసంగతి ప్రభావతికెఱింగించెదను, (అని నిష్క్రమించుచున్నది.)

ప్రద్యు—(మూర్ఛ తెలిసి దిగ్గునలేచి తత్తరపాటుతో) ప్రభావతీ! ప్రభావతీ!!

మ. కలికీ! నన్నరిఁ జేరవచ్చితివి వేడ్కన్గాంచితి న్నన్నుమే
ల్కొలుపన్ లేకఁ దొలంగి నాపయిఁ గటా! కోపించితే యింక నే
నిలుపంజాలుదునే విరాళి ననుమన్నింపంగదే తప్పునా
వలన న్గల్గిన నిట్టినిర్దయకు నేఁబాత్రుండ నైతినే.

ఓజీవితేశ్వరీ!

సీ. దీనచకోరాళి తృష్ణఁదీర్చుచు నుండు
నీదరహాసచంద్రికలటంచు
గతిలేనిశుకపికతతికి విందిడు నీ చి
గురు దొండపండు వాతెఱయటంచుఁ
బేదనెమళ్లను నాదరించుచునుండు నీ
నీలమేఘవేణియెయటంచు
నాఁకొనుహంసల కాసఁగొల్పెడు నీదు
లాలిత భుజమృణాళములటంచుఁ

గీ. దుమ్మెదలఁబెంచు నీకనుఁదమ్ములనుచు
వినివలచివచ్చితినిగాని వెలఁది! యిట్లు
నా యభాగ్యత నిన్నెడఁబాయఁజేయఁ
దోఁడ నేతెంచునని నాకుఁదోఁచదాయె.

మఱియు నో మనోహారిణీ!

సీ. సారంగనయన సుధారసంబును జిల్కు
నీదుకెమ్మోవియాహ్లాదమొసఁగ
చక్రవాకస్థనీ శారికాకలరుతం
బనుముద్దుపల్కులు మనమెలర్ప
కల్యాణి నీవాలుకన్నవబెళ్కుచూ
పులముల్కులెదనాఁటి సొలయఁజేయ

మోహనగాత్రినీ మొల్కనవ్వులమోము
వెన్నెలనెలయన వెతలముంపఁ

గీ. గీరవాణిరో కోర్కెలుమీర నీదు
నాదనామక్రియల్మదిఁ బాదుకొనఁగ
మలయమారుత మిటులపైఁ బొదలుచుండఁ
గన్నడ సహింతునే రావె కనవె నన్ను.

హా! దేవీ! భవానీ!

శా. ఓకాత్యాయని! నిత్యమంగళకరీ! యోశాంకరీ! చండికా!
యోకాళీ! శ్రితకల్పవల్లి! గిరిజా! యోపాప విధ్వంసినీ!
యోకల్యాణి! త్రిలోకపూజితసతీ! యోయర్ధనారీశ్వరీ!
నాకుంజూపఁగదే ప్రభావతినిఁ గన్యారత్నమున్ మ్రొక్కెదన్.

ఓజగజ్జననీ!

శా. తల్లీ! నన్నులిఖించి చిత్రమిడి యాతన్వంగికిన్ బ్రీతిరం
జిల్లన్నేనవిభుండనౌదునని శాసింప న్నీవ న్గాంతుశో
భిల్లన్నేనిటువచ్చి నిష్ఫలమనోభీష్టుండనై యిందు ను
ద్విల్లారన్గని యూరకుండుదువె దేవీ! కన్యకన్గూర్పుమీ.

(అని దృష్టినిగిడించి నల్వలంకులఁ గలయఁజూచి) ఆఁ! ఆదిక్కునఁ బొన్నగున్న క్రిందఁ దళుక్కుమని మెఱయున దేమియోకదా.

క. తొలుకరి మెఱుపో నాయెద
వెలుఁగొందెడు దీపకళికొ విలసితమణిరో
చులబెళుకో రాకాశశి
తళుకో మోహంపుమొలకొ తరుణీమణియో.

ఆయన్నులమిన్న నామనోహారిణియగు ప్రభావతియేఁ గాఁబోలు. ఆహా! కరుణాతిరేకంబుచే నా జగన్మోహిని నన్నారయఁ దానే యిచ్చోటునకువచ్చియుండెనాయేమి? వహ్వా! ఏమి నాయదృష్టము! హృదయమా! సంభ్రమింపకుము. నే నీమాటునఁ గూర్చుండి యీలేమయభిప్రాయం బెఱింగెదను.(అని యొకపొదరింటిమాటున గూర్చొనుచున్నాఁడు.)

[అంత ప్రభావతి ప్రవేశించి]

ప్రభా—(తనలో) హా! దేవి! సర్వమంగళా! నిన్ను నాహృత్పద్మంబున నెలకొల్పి రేయుంబవళ్ళు నిండుభక్తి నారాధించుచున్నను నాపై నీకిసుమంతయైనఁ గరుణకలుగదాయె. నే నట్టిమందభాగ్యనని న న్నిట్లుపేక్షింతివా జననీ?

కవిరాజవిరాజితము.

హిమగిరిరాట్సుత! యిందుకళాధరి! యేణవిలోచని! యీశ్వరి!చి
త్రముఁగని నేనొక రాజితసుందర రాజసుతున్ గుణ రాజినుతున్
రమణుఁడటంచుఁ గ రమ్ము వరించితి రమ్యగతిన్ గన రాఁ డకటా!
కమలదళాక్షి! య ఖండకృపామతిఁ గానఁగఁ జేయవె కాంతునిటన్.

అన్నా! ఈ యుద్యానవన మంతయు వెదకినను నా ప్రాణేశ్వరుండు గానరాఁడయ్యె. ఎందుడాగియుండెనోకదా. ఎవ్వరి నడిగి తెలిసికొనియెదను? జగదేకశరణ్యలగు భగవతీమతల్లులనే వేడుకొనియెదను. (అని కృతాంజలియై.)

సీ. గిరిసుతా! నామనో హరుని వేఁ జూపుమా
పసపు కుంకుమ నీకు బత్తినిడుదుఁ
బద్మాలయా! నాదు ప్రాణేశుఁ జూపుమా
విరిసినపువ్వు లర్పింతునీకు
భారతీ! నాచిత్త చోరునిఁ జూపుమా
తులసీదళంబులఁ గొలుతునిన్ను
నగభేదిరాణి! నా నాధునిఁ జూపుమా
లలిము త్తెముల నిన్న లంకరింతు

గీ. వేల్పుటిల్లాండ్రలార! నా వెతలమాన్ప
నెంచి నాజీవితేశ్వరు నిటకుఁ దెచ్చి
నాకుఁగనులారఁ జూపి సంశ్రీధానగరిమఁ
దాపమార్పుఁడి ననుఁగన్న తల్లులార!

ప్రద్యు—(తనలో) ఈ తరుణీమణికి దేవినిర్ణీతుండైనవరుండను నేనేఁగాఁబోలు. అటులైనచో చెంతనున్నప్పుడు న న్నాదరింపక యిప్పుడు నాకొరకై యువ్విళ్ళూర నేల? న న్నప్పుడు గుఱుతింపలేదుకాఁబోలు. అయిన నింకేమనునో వినియెదను.

ప్రభా—అకటా! నే నెంతభాగ్యహీన నైతిని. వలచివచ్చిన ప్రాణనాథుని చెయిచేతల విడిచిపెట్టుకొంటిని. ఆ నా ఇల్లభండు కురులుచూపింపఁ బరాఙ్ముఖి నైతినని నాపై నలుకవహించెఁ గాఁబోలు. ఏమిచేయుదును? క్షమింపుఁడని వేడుకొందుమన్న నెచ్చోటను గానరాఁడయ్యె. ఓనాథా!

మ. అలుగన్బాడియె నేరమెంచఁ దగ ద•న్యాయంబు రాకాశశిన్
జులకంజూచునె కైరవాంగన యెల•ర్చున్నాక వైముఖ్యమున్
దొలగుంగాదటె పద్మినీసఖికి మి•త్రుంజూడ నే నక్కటా!
కలనైనన్ నినుబాసియుంటినె మనః•కాంతా! ననుంగావవే.

ప్రాణవల్లభా!

* కందద్వయ కమలవిలసిత రుగ్మవతీ గర్భక్రౌంచపదవృత్తము.

ద్వారవతీనా•థా! సదుదారా! • తరుణరుచిరమృదు • ధవళశుభాంగా!
వారిరుహాక్షా! • పాలితవారా! • వరగుణగణనుత • వనరుహచాపా!
సారచరిత్రా! • సత్యవిచారా! • శరరుహజితముఖ • సరసకలాపా!
మారసుధీరా! • మాసుకుమారా! • మఱవఁదరమె నిను • మదిదయ లేదా?

ప్రద్యు—(తనలో) ఈ సుదతీమణికిఁ బ్రత్యుత్తర మొసంగుదమన్న నేమియుపద్రవము సంభవించునో. చెలికత్తియ లెవ్వరైన దగ్గఱ నుండిరేమో.

చ. హృదయమ! తాళుమింక కమ•లేక్షణమానస పంజరంబులో
ముదమున సంచరింపుచు వి•మోహముఁ జెందెదవేల భ్రాంతిచే
నదనిదె సత్ఫలంబుఁగొన • నాదురపిల్లకుఁ డాశలార! సం
పదగనవచ్చు నీరమణి•భావమెఱింగినదాక యోర్చుఁడీ.

ప్రభా—కానిమ్ము. నా హృదయేశ్వరుం డీవనంబున నెందైన డాగియుండెనేమో వీరం దఱిని తెలిసికొనియెద.

---

* ఈ క్రౌంచపదవృత్తములో గర్భీకృతములైన వృత్తములు.

1 క. ద్వారవతీనాథా! సదు, దారా! తరుణరుచిరమృదు•ధవళశుభాంగా!
వారిరుహాక్షా! పాలిత, వారా! వరగుణగణనుత•వనరుహచాపా!

2 క. సారచరిత్రా! సత్యవి, చారా! శరరుహజితముఖ•సరసకలాపా!
మారసుధీరా! మాసుకు, మారా! మఱవఁదరమెనిను?•మదిదయలేదా?

సీ. గౌరీలిఖిత చిత్ర గతు నాథుఁ గంటిరే
మల్లెలార! లతామ తల్లులార!
నాప్రాణవల్లభు నలినాక్షుఁ గంటిరే
సలలిత పుష్పకుంజంబులార!
నామనోహరుని సుందరమూర్తిఁ గంటిరే
సురుచిరతరు సరోవరములార!
నాజీవితేశు సన్మానితుఁ గంటిరే
యళులార! శుకశారి కాళులార!

గీ. వైద్యవేషంబుచే నన్ను వలచివచ్చి
కన్మొఱంగిన నామనఃకాంతునిచటఁ
గాంచినారేమొ చెప్పరే కరుణతోడ
నగములార! మయూర పన్నగములార!

ప్రద్యు—(తనలో) ఏమి! వైద్యవేషంబునవచ్చిన నన్ను గుఱుతించియే యట్లు విముఖియైయుండెనా? ఒకవేళ శుచిముఖిచే తరువాత నెఱింగెఁ గాఁబోలు.

ప్రభా—అయ్యో! ఈ విటపిపటలంబులును నాయవస్థంజూచి కటకటంబడవయ్యే. ఏమిచేయుదును.

త్రిభంగివృత్తము.

కొలఁకులబిసములఁ గొసరితినుచుననుఁ
గలుపరె హంసినులారా! విభు నారామంబునకున్ రా
లలితకిసలయములను మెసఁగుచుననుఁ
గలుపరె కోయిలలారా! విభు నారామంబునకున్ రా
జలదములను గని యలరుచు దయననుఁ
గలుపరె కేకిసలారా! విభు నారామంబునకున్ రా

---

కమలవిలసితవృత్తము

తరుణరుచిరమృదు♦ధవళశుభాంగా!, వరగుణగణనుత♦వనరుహచాపా!
శరరుహజితముఖ♦సరసకలాపా!, మఱవఁదర మెనిను?♦మదిదయలేదా?

రుగ్మవతీవృత్తము.

ద్వారవతీనా♦థా! సదుదారా!, వారిరుహాక్షా!♦పాలితవారా!
సార్థచరిత్రా!♦సత్యవిచారా!, మారసుధీరా!♦మాస్తుకుమారా!.

కలకలములఁ గుజరాములఁజెలఁగుచు నను
గలుపరె కీరములారా! విభు నారా మంబునకున్ రా.

అన్నా! చెలికత్తియ లెల్లెగిరోకదా. ఇంకను రారైరి.

ప్రద్యు—(తనలో) నాకొరకై యిచ్చోటికి నామనోరమ యేకతంబ వచ్చెనుగాఁబోలు. ఇప్పు డేమిమోఁబలుకుచున్నది. వినవలయును.

ప్రభా—ఓప్రాణేశ్వరా!

కల్యాణివృత్తము.

నామనోహరా! కరుణాగుణాకరా!
ననుందయామతిం గనుంగొనంగరా వరా!
కోమలాంగ! నాకోర్కెఁదీర్పరా
కురుల్గనంగఁజేయ నింత కోపమేలరా
కామమోహనాకార! ధీవరా!
కలాకలాప! నాదుచిత్తకంజభాస్కరా!
ప్రేమఁ జూపరా కనికరించవేమిరా
విరాళినై పఁజాల నాదువెతలఁ బాపరా.

ప్రద్యు—(తనలో) ఈనారీరత్నము నాయందుగల మోహాతిరేకంబుచే నన్నిప్పుడు చేరరమ్మని పిలుచుచున్నది. చెంతనున్నప్పుడు నన్నలక్ష్యముఁజేసి పరాఙ్ముఖి యగుట కేమిహేతువో తెలుపదాయె. ఆవిషయమై యీలేమ యభిప్రాయం బెఱుంగుట కాకీరమును సంబోధించి యిట్లనియెదను. (ప్రకాశముఁగా)

ఉ. కోరి రసంబుఁగ్రొన్నఁగఁ గొమ్మనుజేరియు దానిఁబాసి యా
తీరున సిగ్గులేక వినుతింపుచు వెండియు దానిఁజేరఁగాఁ
గోరెదవేమె నీకు సమకూడునె కంటకరాజిలోనఁ బెం
పారుఫలంబు నీదగు ప్రయత్నము వ్యర్థముసుమ్ము కీరమా.

ప్రభా—(విని సంభ్రమాశ్చర్యంబులు మనంబునఁ బెనంగొన లేచి నల్వలంకులఁగలయఁ జూచి తనలో) ఏమిది! ఈ యన్యాపదేశవాక్యం బెటనుండి వచ్చుచున్నది? నామనోహరుండీచెంతనెందైన డాగియుండెఁగాఁబోలు. అటులనే గావచ్చు. కొమ్మనైన నాదరిఁజేరి యధరబింబఫలం బపేక్షించిన కీర మా మోహనాంగుఁడేకదా.

తిరుగ వానికి సమాధానమొసంగ నాతుమ్మెద నుద్దేశించి యిట్లనియెదను. (ప్రకాశముగా)

చ. విరసగతిన్ రవింగనియు ◊ విన్నఁదనంబున వాడియున్న యా
సరసిజమందుఁ ద్రావి మధు ◊ సారముఁ గ్రోలఁ దలంచెదేల? ద
గ్గఱఁగల చంపకంబెనయఁ ◊ గా ఘుటియిల్లదె హాని? యిచ్చటన్
సరసగతిన్ సరోజ మధు ◊ సారముఁ గైకొనరాదె తుమ్మెదా!

ప్రద్యు—(ఉత్కలికఁ దనలో) ఓహో! ఈవాల్గంటి తనతండ్రి చెంతనుండుటచే నన్నుఁగని భయవిహ్వలయై నేను తమిమీర సాహసించినచో నాకుఁ గీడువాటిల్లునేమో యని తలంకవలసివచ్చెననియు నందుచే విన్నఁదనంబుఁ బూనియుంటిననియుఁ జతురముగ వెల్లడించుచున్నది. అయిన మరల నాకీరమునుద్దేశించియే యిట్లనియెదను. (ప్రకాశముగా)

ఉ. రాగముఁ జెందియున్న ఫల ◊ రాజముఁగాంచి విమోహచిత్తవై
చేఁగొనఁజాల కీవిధము ◊ చేడ్పడియుంటివి లక్ష్యపెట్టెదే
బాగుగనీకుఁ గోర్కెగల ◊ పట్టునఁ గంటకరాజి? బేలవై
యీగతి వెండి దానిఁ గొన ◊ నేఁగఁ దలంచెదె వెఱ్ఱికీరమా!

ప్రభా—(తనలో) అయ్యో! నామనఃకాంతుండు నిరపరాధిని నైన నాయెడల నిష్కారణ మలుకవహించియుండె. ఏమిచేయుదును. అయిన నాపై యింకను నొకింత ప్రేమఁ గనఁబఱచుచుండెఁ గావున నాఫలంబు నుద్దేశించి మరల నిట్లనియెదను. (ప్రకాశముగా.)

చ. సరసఫలంబ! కీరమ్మది ◊ చంచుపుటానుభవంబుఁ గోరి త
త్కరగత మాటకుం దలఁపు ◊ గల్గుట నేకద పత్రసంగతిన్
మురియుచుఁ జేరఁదీసి నవ ◊ మోహనకీరముఁ బాయఁద్రోఁతువే
గురుతరకంటకంబు సమ ◊ కూడుట భీతినిఁగాక బేలవై.

మఱియు,

చ. నవరసపూరితంబవు న ◊ నారత మా మురిపెంపుకీర మా
నవమునుఁ గ్రోల ధన్యత నె ◊ సంగుదునంచుఁ దలంచుదాననై

పవలును రేయిఁ దల్లడిలి ♦ భాగ్యవశంబున నేడు చేరరా
నవమతివై యకారణ మఱేహో నిరసించెదవేఫలోత్తమా!

ప్రద్యు-(తనలో)ఈ రామామణి నాపై నిండుప్రేముడిచేత నేయ ట్లూరకుంటినని చెప్పచున్నది. అయినఁ దా నేయభిప్రాయంబుచే నా కయ్యెడఁ దనకురులను జూపించెనో తెలిసికొనవలయును. ఎట్లోఁగదా (కొంచెము మాలోచించి) ఇప్పుడా సరోజాననచెంత విరాజిల్లు జలాశయంబులోని నెత్తమ్మిపై వ్రాలఁగోరియుఁ దొలంగు ప్రమదాళి నుద్దేశించి యిట్లనియెదను. (ప్రకాశముఁగా.)

గీ. చంచరీకమ! సరసిలో ♦ జలరుహంబుఁ
గాంచి తమిఁజెంది కురులను ♦ గనినయంత
వ్యర్థతనుఁ జెంది యెడఁబాయఁవలెనెదాని?
నిర్దయుల చేష్టితముల మఱన్నింపఁదగునె?.

ప్రభా-(తనలో) అయ్యయో! నామనోవల్లభుండు నిర్దోషినగు నాపై యలిఁగి తనకు నేఁ గురులనుజూపించుటచేఁ దా నన్నెడఁబాయవలసివచ్చెననియు నేను వట్టి నిర్దయురాలననియు నే నొనర్చిన యపరాధము క్షమించఁదగినదికా దనియు నుడువుచుండె. నా మనోభావం బెఱుంగకుండెనో యెఱింగియు ననుచితంబని తలంచెనో తెలియరాదు. నా యభిప్రాయంబు తేఁటఁబడ నా బంభరంబు నుద్దేశించియే ప్రత్యుత్తరంబుఁగ నిట్లనియెదను. (ప్రకాశముఁగా.)

ఉ. తుమ్మెద! తమ్మిపైఁ జనకు ♦ దూరమునందున నిల్వకున్న నీ
విమ్మెయిఁజూడు నాదుకురులెన్నితనర్చునో యన్నికష్టముల్
క్రమ్మెడు నంతెకాక విను ♦ క్రమ్మర మోహమహాంధకారమం
దుమ్మలికం జరింప వలెయుంజుమి పిమ్మట సౌఖ్యమబ్బదే.

మఱియు నోరోలంబరాజమా!

గీ. కోపగించకు నాపై నిరపరాధ
ననుచుఁ గంటకసన్నిహితాప్తికమిత
భయముచే నాదునిర్దుష్టభావమిటుల
నెమ్మిఁ దెలిపినతప్పు మన్నింపఁ దగదె?

ప్రద్యు-(సహర్షంబుఁగఁ దనలో)ఓహో! ఈ యబలారత్నము నాపై నిష్కళంకమైన యనురాగము నే కలిగియున్నది. ఈలేమ చకితహరిణాక్షియగుటచే నట్లు తలం

నేగాని నాయెడల నిర్లక్ష్యభావముచేతకాదు. నిర్హేతుకంబుగ నిరపరాధినిపై దోషారోపణంబుఁజేసి నేనే యపరాధినైతిని. కావున నే నిప్పు డీతన్వంగి యెదుటకుంజని తప్పుక్షమింపుమని వేడుకొనియెదను. (అని ప్రభావతియెదుటకువచ్చి ప్రకాశముగా) బాలామణీ!

మ. చపలత్వంబున నిన్నుఁగోరి ఫలకాంక్షుంజేరి వ్యర్థుండనై
విపులార్తిన్వలిగ్రుక్కుచుండి తమిచే విభ్రాంతి కల్గంగ నీ
విపరీతంబు ఘటింపఁ గారణము నీవేయైతివంచంటి నా
యపరాధంబు క్షమించిప్రోవుమిక కోమ్మా! సత్ఫలాభ్యున్నతిన్.

(అని మోకారించుచున్నాఁడు.)

ప్రభా-(చూచి లజ్జావనతవదనయై చిఱునగవుతో నల్లన వెనుకకుఁ జనుచున్నది)

ప్రద్యు-(లేచి సమీపించి) మనోహారిణీ!

మ. తలఁపన్ రాదఁటె నీహృదబ్జమకరందంబాని యున్మత్తయై
యలరంగోరి సతంబు మోహాతమ మత్యంతంబుఁ గన్గప్పను
త్కలికంజేరుటఁ జంపకంబునను లక్ష్యంబుంచునే? నిర్దయన్
వెలిఁద్రోయం జన దీమదాళినిక తన్వీ! సత్కృపన్ బ్రోవుమా.

ప్రభా-(సహర్షయై తనలో) డెందమా! సంభ్రమింపకుము. కాంక్షలారా! తాళుఁడు. (అని క్రీగంటిచూపులు సారించుచు చిఱునగవుతో శిరము వంచుకొనును.)

ప్రద్యు-మోహనాంగీ! నీ యనుగ్రహంబునకు నే నేల పాత్రుండను కానైతిని?

సీ. మోహాబ్ధికాంక్ష వీచీహతిదోఁగునా, కాయంపుతరణిసద్గతియనంగ
విరహనిదాఘప్రపీడితాస్మన్మనో,బర్హిఁదన్పెడునవాబ్దంబనంగ
మదనజ్వరార్తినివిదళించినను దేర్చు, మంత్రబీజాంచితయంత్రమనఁగ
కామాంధకారదుర్గమవనంబున నాకు,గతిఁజూపఁగలదీపకళికయనఁగ

గీ. తరుణి! నీముఖచంద్ర సందర్శనంబు
కలుగునని తెల్ప నొదవు నక్షత్రమనఁగ
నిన్నుఁ గనఁగోరి తపియించుచున్నకతనఁ
గనుల పండువగాల్పె నీకమ్మ నాకు.

ప్రాణేశ్వరీ! ఆ కమ్మమిన్న ప్రభావ మేమనిచెప్పుదును!

ఉ. కన్నులఁగాంచినంతనె ముఖమ్ము ప్రసన్నతఁ జెందె మెండుగాఁ
జెమ్మటలంకురించె నినుఁ జేరెను చిత్తము పొంగుమేనఁ గం
పమ్ము జనించెఁ జీకటులుఁ బర్వెను కన్గవ నిన్ను వైద్యవే
షమ్మునఁ జూడనయ్యె నవశక్యము నేఁ దమి నిల్ప నయ్యెడన్.

సీ. దయకల్గదాయెనే తన్వి! కాంతారంబు, నందు నేమృగయా విహారలీలఁ
జెలఁగుచుఁ శుచిముఖి చేనీ మనోహర, మోహనాకృతి వినిమూర్ఛఁ జెంది
నినుఁ జేరు వెరవు నేఁ గన లేక ద్వారకా, పురి కేగి విరహార్తిఁ బొదలుచుండ
దూతిక వచ్చి సంప్రీతి నీయుత్తరం, బొసఁగంగ హర్షాబ్ధి నోలలాడి

గీ. తోఁడనే వచ్చి నినుఁ గాంచి దుస్సహంపు
వలపు పురికొల్ప నీకు నేఁ దెలుపలేదె
చేరి చిత్రపు టెత్తెలఁ జిక్కుఁ జేపఁ
దీయవచ్చితి వలరాజునైయటంచు.

అటులైనను,

చ. ఎఱిఁగియు నీవెఱుంగకొ గ్రహింపఁగ నీకరమివ్వవైతి దు
ర్భరమగు వాలుచూడ్కులఁ బరాఙ్ముఖివై కనఁ జేయవేకురుల్
దఱియుట తప్పుగాఁదలఁచి తన్వి నను దఱిమింపఁ జేసితే?
మఱువఁదరంబె నీ హొయలు మామకచిత్త సరోజభృంగమా!

ప్రభా - (దీనవదనయై పొదరింటిలోని లతావతంసంబు నుద్దేశించి) ఓలతామతల్లికా!

గీ. క్రూరకంటక నిహితార్తిఁ గూలి తొంత
గతిని వాటిని దాఁట శక్యంబుఁ గాక
పొరలుచుంటివి కల్పకభూజమెట్టు
లల్లికొనఁ గల్గెదవు బిగి యారనీవు?

ప్రద్యు - (సుమాళంబున) చిలుకలకొలికీ! నీ కదియా సందియము!

చ. తరుణిరో! కంటకంబులను దాఁటెను నీ తనువల్లి నేడిటుఁ
గరుణ నురోజగుచ్ఛములు గాఢముగా హృదయంబునాట స
త్వరముగ నాయురస్థలి ముదంబొదవన్బ్రవేయరాదె సుం

దరి! తడవేలచేసెదవె తాలిమినేనిక నిల్వఁజాలనే.

(అని కదియంబోవుచున్నాఁడు.)

ప్రభా-(వ్రీడాభరంబున నల్లనఁ దొలంగి తనలో)ఈ నామనోహరుండు నాపైఁగల మోహాతిరేకంబుచే నతిసాహసం బొనరించుచుండె. నా చెలికత్తియ లెవ్వరైన వచ్చెదరేమో. వీనిమనం బొక్కింత మరలింప నా తుమ్మెద నుద్దేశించి యిట్లనియెదను. (ప్రకాశముఁగా.)

గీ. రసముదొరకు నె కేతకీకుసుమమందు
వలపుఁగొలుపుట భ్రాంతి లోఁ గులుకుచుండి
తమినివ్రాలెదె కంటకంబులగణింప
వకట! యెలతేఁటి! పెరవిరులవని లేవె?

ప్రద్యు-(తనలో)ఓహో! ఈలేమ దివిజకంటకావృతయగుటచే నిరసింతునేమో యని నాభావం బెఱుంగ నిట్లన్యాపదేశంబుగఁ బల్కుచున్నయది. అకటా! ఈ రక్కసుల ఱేఁడైన వజ్రనాభుఁ డీరాకాపూర్ణచంద్రాననకుఁ గృష్టసర్పమువలె దాపరించె.

చ. వినవె సమస్తజీవులును వేడ్కనెసంగుచుఁ బూర్ణిమాహిమాం
శునిఁగని కృష్ణపన్నగము స్రుక్కఁగఁ జేయుటఁ గుందు నయ్యయో!
వనజభవుండు నాకుటిలవర్తను బారిఁదొలంగఁ జేసి చం
ద్రునియకళంకరశ్మి దయతోనెఱపన్ జను లుల్లసిల్లరే?

అయిన నాతండ్రిచేఁ గాళియాహిపని యేమయ్యెనో నాచే వీనిపనియు నంతియే కాఁగలదు. (ప్రకాశముగా) లలనామణీ! నీపైఁగల మోహాతిరేకంబుచే సపస్మారుండనైనే పలికినపలుకుల కలుగఁదగునే? వినుము.

సీ. దరహాసచంద్రికాస్ఫురితాబ్జబింబాననముహ్పొచ్చకోరికానంద మొసఁగ
నకళంకకోదండ భ్రుకుటీచలద్వీక్షణాసారమెదజింక నదరఁజేయ
గండతారుణ్యప్రకాశాస్పదారుణాధరముమానసశుకోద్ధతి నెలర్ప
వరతనూలావణ్యవనబాహుమృదుమృణాళములుచిత్తమరాళి భ్రమియఁజేయ

గీ. నీలజీమూత కబరికానిబిడకాంతి
యంతరంగమయూర నృత్యములఁబెంప
సురుచిరభవత్సదాకృతిజ్యోతిఁగాంచి
పరవశత్వంబుఁజెందు టబ్బురమెనాకు?

మోహనాంగీ! రమ్మని లేఖవ్రాసిన ప్రేమంతయు విడువఁదగినంత యపరాధ మొన రించితినే? వేయేల. నీ ముఖపంకజామృతతుందిలంబైన నా మనోమిళిందము పెరవిరుల కాసించునే?

చ. కలికిరో! సంచలించుచును కాయము గాలిపటంబుఁగా సదా
వెలయఁగఁ జల్వతెమ్మెఱలు వెన్నెలవాకలఁ దోఁగి కోర్కెలన్
బలితపు వీచికానిహతిఁ బొల్పడి కూలెడుదాని రాగర
జ్జులఁగొని వచ్చియుంటి నిటఁ జొన్పఁగదే చెలి నీదుకౌఁగిటన్.

(అని కౌఁగిటఁ గదియింపఁబోవుచున్నాఁడు.)

ప్రభా-(తొలంగి క్రీగంటిచూపుల మందస్మితయై వారింపుచుఁ జిలుకనుద్దేశించి.)

క. చిలుకా! నీకర్థముఁగా, దలిఁగి తొలఁగినట్టికొమ్మ కాసక్తిగొనన్
ఫలమేశిక్షార్థంబది, తలఁచెదె భాగ్యంబులేని దానినెలర్పన్?

ప్రద్యు-హృదయేశ్వరీ! ఇంకను నన్ను నేరస్తునిగానే భావింపుచుంటివా? అటులైనచో మన ముభయులము సమానశిక్షార్హులమే. కావున,

క. కలికీ! నాపై నీకీ, యలుకేలే నిన్నుఁబాయకినటుల విరాళిన్
బలికితి నన్నిట ముద్దుల, చిలుకా! కౌఁగిటనుజేర్చి శిక్షింపఁగదే.

(అని ప్రభావతికరంబు గ్రహించి యొక్కకేల నాశ్లేషింప నిరువురు నొకసంకేతలతానికుంజంబునుగూర్చి నిష్క్రమించుచున్నారు.)

గద్య.

ఇది శ్రీమద్వేంకటరమణకరుణాకటాక్షవీక్షణాసారసమాసా
దితరసబంధురకవిత్వవైఖరీప్రవీణాపస్తంబసూత్ర శాం
డిల్యసగోత్రపవిత్ర హోతృకులకలశార్ణవరాకా
కైరవమిత్ర వేంకటరత్నసుపుత్ర వేంకమాంబా
గర్భశుక్తిముక్తాఫల వివిధవిద్వజ్జనవిధే
య వేంకటకృష్ణనామధేయప్రణీతం
బైన ప్రభావతీప్రద్యుమ్నంబను
నాటకరాజంబున
షష్ఠాంకము.

---



శ్రీరస్తు.

# ప్రభావతీప్రద్యుమ్నము.



## సప్తమాంకము.

రంగము: వజ్రపురోద్యానవనము.

[ప్రభావతీప్రద్యుమ్నులు ప్రవేశించుచున్నారు.]

ప్రద్యు-(ప్రభావతికరంబుగ్రహించి) మనోహారిణీ!

గీ. కంటకవికీర్ణదుర్గమ కాననమునఁ
గుసుమరసమునుఁ గడుపారఁ గ్రోలఁగల్గి
దాని విడనాడఁగాలేక తల్లడిల్లు
తేఁటికిని దారిఁజూపు మిందీవరాక్షి !

నే నిపుడు నీ యనుమతిఁగొని ద్వారకాపురంబున కేగెదను.కతిపయదివసంబులలో నేయుపాయంబుచేనైన సముచితలీలల నిన్నచ్చోటికి రప్పించెదను.

ప్రభా-(దీనవదనయై) అయ్యో! ప్రాణేశ్వరా!

చ. నిలుచునె మేనఁ బ్రాణములు నిన్నెడఁబాసినఁ బంజరంబులోఁ
జిలుకవలెన్నెలంగుచుఁ గృశించితి నీకొరకిన్నినాళ్లు నే
డలగిరిజాకృపన్ గలిగినట్టి మనోహరభోగభాగ్యముల్
కలఁగను సౌఖ్యసంపదలకైవడి నింక నదృశ్యమానొకో.

ప్రద్యు-జీవితేశ్వరీ!ఈ వియోగబాధ నీ కెంతయో నాకు నంతియేసుమా.

చ. నిను విడనాడియున్నరజనీదివసంబులు కృష్ణపక్షముల్
నినుఁగవఁ గూడియున్నఁ దరుణీమణి! నాకవి శుక్లపక్షముల్
మనమును నీపయిన్నిలిపి మైఁ గొనిపోయెద నాజ్ఞనిమ్ముఁ నీ
యనుపమరాగరజ్జులనయంబునునన్నట నిల్వనిచ్చునే.

ప్రభా-ప్రాణవల్లభా!

గీ. కమ్మతేనియలానఁ జిత్తంబునందుఁ
దలఁచిన మధువ్రతంబు మంజులసరోజ
కుసుమసంచయముల వ్రాలఁగోరుఁగాని
యొక్కపద్మిని నేనమ్మియుండునొక్కొ.

ఆకారణంబుచే నా కిప్పట్టునఁ గలిగిన సందియం బేమన,

ఉ. ద్వారక కేగి సౌఖ్యముల భాసిలుచున్ మృగయాప్రసక్తి దు
ర్వారవిమోహపాంథజన భానమృగంబుల వేఁటలాడుచున్
బేరిమిగాంచు నీహృదయ పేటిని నిల్చునొ నిల్వకున్నొ శ్రీ
భారతి దీనురాలగు ప్రభావతి నిన్నెటు బాయనోర్చెదన్.

ప్రద్యు- ధర్మపత్నీవతంసమా! నే నెందున్నను మదీయమనోమిళిందము త్వదీయముఖపంక జంబు నే యాశ్రయించి యుండును. నీ కట్టిసందియం బేలకలిగె? సూర్యచంద్రాదు లును పంచభూతములును సాక్షులుగా నిన్ను గాంధర్వవిధిఁ బరిణయంబైతినన్నటకు నిదర్శనంబుఁగ నీ వీయభిజ్ఞానంబుఁ గైకొనుము. (అని తనవ్రేలినున్న కనకాంగుళీయ మును ప్రభావతి కొసంగుచున్నాఁడు.)

ప్రభా- ప్రాణనాయకా! నాకు మీ పునర్దర్శనము శీఘ్రకాలములో నే లభింపఁజేయ వేఁడె దను.

ప్రద్యు-మంచిది. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

ప్రభా-అకటా! నా ప్రాణేశ్వరు నెడబాయవలసివచ్చె. వాని పునర్దర్శనం బెప్పటికి లభించు నోకదా.

ఉ. దీపములేనియిల్లు రవిదీప్తినెసంగని పద్మముల్ బికా
లాపములేని కాననవిలాసముఁ జంద్రుఁడులేనిరాత్రియున్
బ్రాపగు భూరుహంబు నెడబాసినవల్లియుఁ బ్రాణనాథు స
ల్లాపసుఖంబులేని యబలామణి యౌవనభాగ్య మెంచఁగన్.

(అంత తెఱలో)

చ. ప్రమదమునన్ ఘనుంగనుట రాజిలి సైకతసీమలందు నృ
త్యములొనరించు నీరమణి దగ్గఱఁ జేరఁగ గల్గితే మయూ

రమ ! యిటులేక దాదటికి రానగు నాయకుఁడాత్మనాయికన్
సముచిత లీలఁగూడఁగ భృశంబుఁగ నాటక కైతవంబునన్.

ప్రభా-(ఆలకించి వెఱగందుచు)ఇట్లన్యాపదేశంబుఁగ బల్కువా రెవ్వరోకదా! శుచిముఖియేఁ గాఁబోలు.ఈ వాక్యముయొక్క యభిప్రాయ మేమో తెలియరాదు.

[అంత శుచిముఖి ప్రవేశించి.]

శుచి-(ప్రభావతిని సమీపించి) ప్రియసఖీ!ఏమి నేఁడు నీ వింతప్రసన్నవదనముతో నొప్పు [చుంటివి?

చ. నెలనిరసించునెమ్మొగము నెమ్మినెలర్పఁ బ్రసన్నమాచు వె
న్నెల నిరసించునోయనఁగ నీ నవమాక్తిక దంతకాంతులన్
జిలుకుచు లేఁతనవ్వు జిగి చెక్కులవన్నియ వెట్ట సంతసం
బొలుకఁగ వాత్తెలింగనుల నోరననుంగనె దేలనేచెలీ?

(అని చిఱునగవుతో) వైద్యుని చికిత్సాప్రభావము కాఁబోలు.

ప్రభా-(సిగ్గుచే శిరమువంచి ముసిముసినగవుతో)చాల్లేవే-(అని త్రోసివేయును.)

శుచి-చెలీ! వ్రీడాభరంబుచే నీవు చెప్పకున్నను నీ సోయగ మెఱింగింప దనుకొంటివా?

చ. ప్రమదము మీర వెన్నెలపు పైకొనఁగల్గిన గండపాళిపాం
డిమము గులాబివన్నియఁ గణించెఁ బ్రసన్నతఁ జెందెమోము నే
త్రములు వికాసమొందె విదితంబుఁగనూర్పులు చల్లనయ్యె నో
రమణిరో తెల్పుమిందు ననురాగఫలాభ్యుదయంబుకల్గెనే!

ప్రభా-(సిగ్గుచే శిరమువంచి) సఖీ! శుచిముఖీ! భూతభవిష్య ద్వర్తమాన సంవేదినివియుఁ గామరూపసంచారిణివియు నగు నీ వెఱుఁగరానివిషయం బెందుఁగలుగు? న న్నేల పరిహసించెదవు?

చ. మరుఁడను వేఁటకాఁడడరి మామకవృత్తికశాబకంబుఁ దా
గుఱి విరితూఁపులందఱుమ గొబ్బుననియ్యెడ కెగుదెంచి సుం
దరమగు పువ్వుటీరమున దాఁగిననిల్వక జేరవచ్చి నే
ర్పరియయి పట్టి వే హృదయపంజరమందిడి లేచిపోయె నే.

శుచి.—చెలీ! నీ మనోహరుం డీసరికే ద్వారకకేఁగి యనుచరసహితుండై తిరుగ రాఁ బ్రయత్నించుచుండును. ఇప్పుడు నాటకులు కొందఱు వచ్చి పురబాహ్యంబున శిబిరంబుల నిల్చియుండిరి. నీవు వేవేగఁజని నీతండ్రిగారి యనుమతిగొని వారిని లోనికి రప్పింపఁ బ్రయత్నింపుము.

ప్రభా.—మంచిది. అటులనే చేసెదను. (అని నిష్క్రమించుచున్నది.)

శుచి.—(తనలో).

మ. మిషలెన్నెన్నియొ యెంచి దైత్యునకు నెమ్మిన్గొల్పి కన్గప్పినే
భిషజాకారత నీపురంబునకు రక్షింపన్ రహస్యంబుగా
విషమాస్త్రుండు ప్రభావతీరమణి సంప్రీతిన్గొనం గూడఁడే
కృషిచేఁగాదె నశింపఁజేయనగు దుశ్చేష్టితంబు న్నెల్లప్పుడున్.

ఇప్పటికి నాప్రయత్నము మూడువంతులు నెరవేరినది. కాని.

చ. అనుపమ మోహవారినిధియందుఁ బ్రభావతి చిత్తశుక్తియా
వనమను స్వాతికార్తి వారి పట్టికృపారసవృష్టియోగముల్
గని ప్రసవించె వజ్రపురిఁ గ్రమ్మఁజేరు నతండునైన యీ
దనుజుని క్రోధబాడబము దాకినఁ గీడు ఘటిల్లకుండెడున్.

ప్రభావతిస్థితిఁజూడ నీ రాక్షసాన్వయవృక్షంబునకు వేఱుపురు గంకురించెననియేఁ దోఁచుచున్నది. ఏమన,

చ. రమణికి మోము తెల్లఁబడె రాగిలుచున్న పయోధరంబులున్
గ్రమముగఁ బొంగెఁజూచుక యుగంబు కదున్నలు వెక్కేఁ దన్వితం
బములురువయ్యెఁ గార్శ్యమును బర్వెను భోజన మిందకుండెఁ జి
ట్టుములతియయ్యెఁ గన్ను లదటుంగ నెగర్భముఁ దాల్చియుండుటన్.

ఐహో! నేనింక నతిరయంబున నే సంపూర్ణకృతార్థురాల నయ్యెదను.

ఉ. పూనికఁ గల్గియున్నయెడ బుద్ధికసాధ్యము లేదు రుక్మిణీ
సూనునకా ప్రభావతినిఁ జూపిన నాటక లీల వెండి సం
ధానముఁ గాగ నాహవము నందనకై దువ వజ్రనాభుఁడున్
హానినిఁజెందు నాత్రిదశు లార్తిఁదొలంగుదు రింకిటన్న లే.

(అని పైకిఁజూచి) అదిగో! స్వర్గాధినాథుండగు దేవేంద్రుఁ డిటులనే వచ్చుచున్నాఁడు. ఈయుపాయంబునుఁగూర్చి వానితో నొకించుక ముచ్చటించెదను.

[అంత దేవేంద్రుఁడు ప్రవేశించి.]

ఇంద్రు—(శుచిముఖినిచూచి) ఓహో! హంసనారీ! శుచిముఖీ!

క. స్వాతీవర్షంబునకై, మూతలిడకఁ దెఱచియుండు ముత్తెపుచిప్పల్

భాతిని నీవిజయమువిని, ప్రీతిఁగొనెదు తరుణమునకు వేచితిఁదరుణీ.

నీ ప్రయత్న మెంతవరకుఁగొనసాగినదో వక్కాణింపుము.

శుచి—జే పురందరమహారాజా! (అని నమస్కరించి లేచి) దేవా! నాశక్తి యెంతకలదో యంతవఱకు నేఁ గృతార్థురాలనైతిని. ప్రభావతీప్రద్యుమ్నులకు గాంధర్వవివాహంబైనయది. కొదువకర్జంబునకై తగుప్రయత్నములు మీరే చేయవలయును.

ఇంద్రు—బలె! నీ నైపుణ్య మెంతయైనఁ గొనియాడవచ్చు. పూజ్యురాలా! నీ వింతవర కెట్లు కృతార్థురాల వైతివో యెఱింగింపుము. ఆ వధూవరులకు గాంధర్వవివాహం బైనంతమాత్రమున మనకోరిక లెట్లుఫలించు?

శుచి—దేవా! అట్లుబల్కెదరేమి?

ఉ. ఇమ్ముగవజ్రనాభున కనేకవిధంబులఁ గన్నుఁగప్పి చి
త్తమ్ములరించి యాజ్ఞగొని తన్వియభీష్టముఁదీర్ప వైద్యవే
షమ్మున వాని నాయతివసన్నిధికిన్గొనివచ్చి దైత్యనా
శమ్మునఁ గొల్పితి న్వదనికన్నలియింపవె దానఁగోరికల్.

ఇంద్రు—శుచిముఖీ! ఇంక మనకుఁ గర్తవ్యమెట్టిదియో నీవే యెఱింగింపవలయును.

శుచి—పురందరమహారాజా! అనంతరకర్తవ్యంబు నెరవేర్ప మీరేసమర్థులరు.

ఉ. నాటక కైతవంబున జనార్దనసూనుఁడు మీరుఁ గృష్ణుఁడా
ర్భాటముతోఁడ వజ్రపురబాహ్యమునన్ శిబిరాంతరంబులన్
దీటుగ నిల్చియున్న రజనీచరనాథు ననుజ్ఞవైని వెం
థాటిగ మీరుముగ్వురు ముదంబున లోనికి రానొనర్చెదన్.

పిమ్మటఁ గయ్యంబుఁ గల్పనఁజేసి వజ్రనాభుని సంహరింపవచ్చును. శ్రీకృష్ణప్రద్యుమ్నులు కైతవనర్తకులై వజ్రపురోపకంఠంబున శిబిరంబులలో వేచియుండిరి.

ఇంద్రు—(సహర్షంబుగ) బలే! శుచిముఖీ! నీబుద్ధివిశేష మెంతయైనఁ గొనియాడఁదగు. కడు చక్కనియుపాయ మాలోచించితివి. నే నిప్పుడే జని శ్రీకృష్ణప్రద్యుమ్నులను గలిసికొనియెదను.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

శుచి—(తనలో) నేఁ దలంచుకొన్న కార్యం బిచ్చోటనే నెరవేరినది. నేనింక వజ్రపురంబులోని కేగి యనంతరకర్తవ్యంబు నెరవేర్పఁ దగుప్రయత్నములు చేసెదను.

(అని యిటునటుఁ జూచి) అదిగో! రాగవల్లరి యత్యంతకుతూహలంబుగఁ నిటుల నే వచ్చుచున్నయది. కారణమేమో కదా!

[అంత రాగవల్లరి ప్రవేశించి.]

రాగ—(శుచిముఖినిఁజూచి)సఖీ! శుచిముఖీ! ఇంకను నీ విచ్చోటనే యుంటివా? శీఘ్రంబుగ రమ్ము.

శుచి—అంతిపురంబునఁ గ్రొత్తవింతలు పుట్టెనాయేమి?

రాగ—ఈవజ్రపురోపకంఠంబున నాటకులువచ్చి శిబిరంబుల నిల్చియుండిరన్నవార్త విని మనచెచ్చెలియగు ప్రభావతి తండ్రియొద్దకుఁబోయి నాటకముఁజూడ నభిలషింపఁగా వజ్రనాభమహారాజుగారనుమతించి యానాటకులకు లోనికిరా ననుజ్ఞనొసంగుటచే వారు వచ్చియున్నారు. ఇప్పుడే నాటకముఁ బ్రారంభించెదరు.

శుచి—ఏమి! వజ్రనాభమహారాజుగారాత్మీయమంత్రిభటభృత్యామాత్యవర్గసామంతనికురుంబంబుతోఁ గొలువుదీర్చియుండిరా?

రాగ—సందేహమేమి? అంతయు సర్వసిద్ధముగా నున్నయది. రమ్ము.

శుచి—అటులైనఁ బోవుదమురమ్ము. (అని యిరువురు నిష్క్రమించుచున్నారు.)

ఇది విష్కంభము.





శ్రీ రస్తు.

# ప్రభావతీప్రద్యుమ్నము.

## అంతర్నాటిక.



[అంతఃపురమందు సఖీపరివృతయై ప్రభావతి ప్రాసాదతలంబుననుండ మంత్రిభటభృత్య సామంతనికురుంబంబుతో వజ్రనాభుం డోలగమునఁ బ్రవేశించుచున్నాఁడు.]

వజ్ర.—అరే తామ్రాక్షు! నాటక మింకను ప్రారంభింపకుండిరేమి?

తామ్రా.—ఆఁ! దేవా! అదిగో ప్రారంభించుచున్నారు.

[అంత ప్రద్యుమ్నుఁడు సూత్రధారుఁడై ప్రవేశించి]

నాంది.

ఉ. శ్రీరమణీయమూర్తి కృపచే రతి నిందు ననేకలీలలన్
జేరికృతార్థతాప్తి నవశిష్ట మొకింతయు లేకయుండఁ జే
కూరననార్వఁ బుణ్యజనకోటివిరాజితమైన యీసభా
గారము శంబరారి శరకాండసుమాల లలంకరించుతన్.

(అని సభ్యులపైఁ బువ్వులను జల్లుచున్నాఁడు.)

(నాంద్యంతమున) ప్రస్తావన.

సూత్ర.—(తెరవంకఁజూచి) ఓయీమారిషా! నీ వొకసారి యిటురమ్ము.

మారి.—(ప్రవేశించి) భావా! ఇదిగోవచ్చితిని. ఏమిసెలవు?

సూత్ర.—వినుము.

గీ. అమిత దుష్కంటకావృతమైనయడవిఁ
బటుతరతమిస్రమునఁ జిక్కి పాంథుపగిది
రాజసందర్శనార్థ మీరోజునందు
వచ్చితినిమారిషా! ఫలప్రాప్తికొరకు.

నే నిపు డిచ్చో నొకవిచిత్రమైన నాటకముఁ బ్రదర్శింపఁదలంచి యేతత్కార్యనిర్వాహణార్థమై నీసహాయ మపేక్షించి నిన్నుఁబిలిచితిని.

మారి.—భావా! మీరు దర్శింపఁదలంచిననాటక మేది?

శుచి.—(జనాంతికముగా) చెలీ! ప్రభావతీ! వింటివా సూత్రధారుని పలుకులు?

ప్రభా—(అపవారించి) శుచిముఖీ! రాజశబ్దము సాభిప్రాయగత మని తలంచెదను.
రాగ—(జనాంతికముగా) చెలులారా! సూత్రధారుఁ డిపు డేమియోఁ బలుకుచున్నాఁడు.
సూత్ర—మారిషా! వినుము.

చ. చటుల పరాక్రమస్ఫురణ సర్వసుపర్వుల వేఁచుచున్న యా
కుటిల నిశాచరాన్వయని కుంజమునందునఁ బొల్చుపుష్పసం
ఘటనముఁ గోరి త న్నిశితకంటక ఖండనమున్ బ్రసిద్ధమా
పటుతరనాటకంబు నెఱ పం దలఁపూనితి మారిషా! యిటన్.

మారి—బావా! మహనీయులగు నసితాంగుఁడు నసేకాత్ముఁడు మీకు సహాయులై యుండ
మీకు జయము కలుగకుండునా?

మ. మునువృత్రాసురుఁ జంపి కావ సురలన్ముఖ్యుండెవండయ్యెఁ గం
సునిఁ ద్రుంప న్శిశుపాలునిన్గెడప నేశూరుండు ప్రాపయ్యె నా
ఘనులా నందకుమారశక్రసదృశుల్కల్యాణ మూర్తుల్సమున్
గనిసాహాయ్య మొనర్పఁబూనిరిక మీకార్యంబు గాకుండునే?

వజ్ర—(రోషకషాయితాత్ముండై గద్దెపైనుండి చివాలున లేచి)

పంచచామరము. అరేవృథాభిమాని! మారిషా! పురందరుండుమున్
దురంబునందు నోఁడె నింక తుచ్ఛుఁడైన చక్రికిన్
దరంబెనన్నుఁగెల్వఁ బ్రల్లదంబులిట్లుఁ బల్కెదే?
పరాకిదేల వజ్రనాభు బాహుశక్తి నెంచవే?

తామ్ర—(వజ్రనాభునితో) ఆఁ! దేవా! నాటకమాడుచుండిరన్నమాట మరచితిరాయేమి?
సూత్ర—మారిషా! వినుము.

చ. నవరసపూజితంబు సుమనఃప్రియసంగ్రహణోచితంబు స
ద్భువనమనోహరంబు బహుపుణ్యజనావళిసేవితంబు ద
ర్పవిలసితంబు వజ్రపురరాజవిరాజితసత్పథంబు నా
నవిరళనాటకం బభిమతాప్తికి నాఁడఁ దలంచితిన్ జుమీ.

నీ సహాయంబుచే నే నిక్కార్యంబునఁ గృతార్థుండను కావలయును.
ప్రభా—(జనాంతికముఁగా) సఖీ! శుచిముఖీ! ఈ కుశీలవులమాటలు భావగర్భితములుగాను
న్నయవి. వీర లెవ్వరో నీ వెఱుంగుదువే?

శుచి—(తనలో) శత్రుండును చక్రపాణియుఁ దనకుఁ బాసటయైయుండిరని తెగించి సూత్రధారవేషంబునవచ్చిన యీ ప్రద్యుమ్నకుమారుండు వజ్రనాభునితోఁ జీరి కయ్యముఁదెచ్చుటకుఁ బ్రయత్నించుచున్నాఁడు. ఇట్లు త్వరపడిన నేమియుపద్రవము తటస్థించునోకదా. (అపవారించి) చెలీ! ప్రభావతీ!వీరు నీ వెఱుంగనికుశీలవులు కారు. వారిభావగర్భితంబులు నీ వెఱుంగనివికావు. నన్నేలయడిగెదవు? కొంచెముసేపు తాళితివేని సర్వము నీవే తెలిసికొనఁగలైదవు.

రాగ—(అపవారించి) సఖులారా! ఈసూత్రధారుఁడు వజ్రనాభమహారాజుగారిమోలరాక్షసవంశమును నిందించుచు శత్రుసంహారనాటకంబును బ్రదర్శించెదనని వాక్రుచ్చుచున్నాఁడు. ఈ సాహసికుఁ డెవ్వఁడోకదా!

మారి—భావా! నే నిపుడు చేయవలసినకార్య మేమియో యానతిచ్చెదరా?

సూత్ర—మారిషా! నీవుపోయి వేవేగఁ బాత్రములను సిద్ధము చేయుము. వీరోచితనాటకంబుచేఁ బుణ్యజనులైన యీసభాసదుల సంభావింతుము.

మారి—మంచిది. అటులనే చేసెదను. (అని నిష్క్రమించుచున్నాఁడు)

సూత్ర—(ఆలకించుట నభినయించి) అదిగో! కుశీలవు లప్పుడే గానమున కుపక్రమించుచున్నారు.

(అంత తెఱలో)

గీ. పుణ్యజనులెల్లదక్షిణాంశబునకుఁబోవు
సమయమయ్యెనుసమవర్తిశాసనమున
సాగుసురదైత్యవరవధూయోగమింక
నహహా! కాలప్రభావ మేమనగవచ్చు.

సూత్ర—నేను కూడఁ జని కర్తవ్యమాచరించెదను. (అని నిష్క్రమించుచున్నాఁడు).

ఇది యంతర్నాటికా ప్రస్తావనము.





శ్రీరస్తు.

# ప్రభావతీప్రద్యుమ్నము.

[అంత నసితాంగమహారాజు గారనేకాత్ముఁడను మంత్రితోఁ బ్రవేశించుచున్నాఁడు].

అసి—ఓయీ యనేకాత్మా! సహస్రాత్ముండనని యనిపించుకొనుటకా నీవీపేరుఁ బెట్టుకొంటివి? విశేషవిషయంబు లేమైనంగలవా?

అనే—దేవా! మీకుఁ దెలియని విశేషవిషయంబు లెందుఁగలుగు? అయిన నామనోగత విషయం బెఱింగించెద వినుండు. నామిత్రుం డొకండు కొండొక దైత్యరాజతనూజపై బద్ధానురాగుండై యున్నవాఁడు. ఈ యఘటితఘటనాయమాన భగవతీసంకల్పం బెట్లు నెరవేరునో తెలియరాదు.

ప్రభా—(తనలో) ఆ పురుషుండు నా మనోహరుండే కాఁబోలు

అసి—దైత్యకంటకోల్లుంఠనంబునఁగాని వానిప్రయత్నము కొనసాగునా? ఎక్కడనో గాని నిర్మలమైన యనురాగవాహిని నిరర్గళముగఁ బ్రవహింపనేరదు. మఱియు

గీ. కమ్మతావినొసంగు పుష్పమ్ముఁ గొనఁగఁ
గంటకములుండవే? యట్లె కాకవినమె
కలుగు శ్రేయంబులకును విఘ్నములటంచుఁ?
గాలమొదవిన ఫలసిద్ధిఁ గాంచవచ్చు.

వజ్ర—(మహోగ్రకోపంబుతో గద్దియనుండిలేచి కరవాలమును ఝళిపించుచు) అరే! వృథామంగళపాఠకులారా! శైలూషాధములారా!

ఉ. ఎవ్వఁడురా త్రిలోకములనేర్చెడు దానవకంటకంబులన్
ద్రవ్వఁగఁజాలువాఁడు రణరంగమునన్ బ్రళయాంతకుండనై
నివ్వెఱగందఁగాఁ బెఱుకనిర్జరకంటకకోటి శక్తుఁడన్
గ్రొవ్వి మదాంధులై పలుకఁగూడునె నాయెదుటన్ బ్రతాపముల్.

రోమం—(వజ్రనాభునితో) ఆఁ! దేవా! ఇది నాటకముగాని యదార్థకథనముగాదు. మీ రాగ్రహింప నేల? వారి యభిప్రాయ మేమో పూర్ణముగా వెల్లడికానిండు.

రాగ—(అపవారించి) సఖులారా! ఈ పురుషులు కైతవనాటకులుగాని నాటకులుగారని తోఁచుచున్నది. ఇట్లు దైత్యకంటకోల్లుంఠన సంభాషణంబుల వీర లెట్లు కృతార్థులయ్యెదరు?

శుచి—(జనాంతికముగా) సఖీ! రాగవల్లరీ! వా రీవిధంబుననే కృతార్థులయ్యెదరు. మఱియు,

గీ. ఆత్మగత కార్యనిర్వాహణార్థమైన
పలుకుల కునాగ్రహించుట భావ్యమగునె?
నాటకముఁ జూడనర్హులైనారు వీరు
వారు ప్రత్యర్థులై యట్లు పలుకుచుండ్రి.

అసి- మంత్రివరా! గీ. కుటిలసంచారియును విషఘోరమైన
కృష్ణసర్పంబు మాలి రాగిల్లు మణినిఁ
గైకొనఁదరంబె యా యురగంబుఁ గెడప
కుండ నీమిత్రుఁ డెంతటి కుశలుఁడైన.

అనే—దేవా! దేవరవాక్యం బమోఘంబగుగాక. నామిత్రుండా వజ్రనాభసంహారకార్య సిద్ధికై యనేకవేషంబులు వేయుచుండె. అయినను,

చ. అనయముఁ బాంధలోకము స్వరాతప మేదఁదలంచి కొమ్మలన్
గనుఁగొనఁ గోరుచుందురు సుఖంబొనఁగూడునె కృష్ణపన్నగం
బెనసిననందు దానిఁ బొలియింపమి వ్యర్థులు గారొకో నరేం
ద్రునివలనన్ గృతార్థతఁ గనుం సఖుఁ డంచు దలంచెదన్మదిన్.

వజ్ర—(కోపదందహ్యమానమానసుండై పండ్లు పెటపెటఁ గొఱుకుచు) అరే! దుర్గర్వహతకులారా! నిఖిలలోకభయంకరుండగు వజ్రనాభుని సంహారింప నెవరితరంబురా?

పంచచామరము. దురాత్మ! ప్రేలెదేల యిట్టి దుష్ప్రలాపములరా
సరిన్బెనంగి నన్ను గెల్వఁ జాలువాఁ డెవండురా?
కరంబునందుఁ దాల్చియున్న ఖడ్గధారనిన్ను సం
హరించుఁ జూడు మిన్నకున్న నాఁ డివజ్రనాభుఁడే.

(అని కత్తిని సవరింపుచున్నాఁడు).

కళా—(వజ్రనాభునితో) ఆఁ! దేవా! ఇచ్చోట దేవరవారివినోదార్థమై నాటకమాడు చుండిరి. మీ రిట్లు కోపోద్రగులగుచుండిన వా రెట్లు నాటకమాడఁగల్గెదరు? శాంతింపుఁడు.

ప్రభా—(జనాంతికముఁగా) అయ్యో! సఖులారా! ఈ కుశీలవుల దారుణోద్యోగభావగర్భితవాక్యంబులును నాతండ్రిగారి సంరంభవిజృంభణంబునుఁ జూడ నా కేమో భయముకలుగుచున్నది. ఏమి చేయుదును?

శుచి—(అపవారించి) చెలీ! ప్రభావతీ! ఇప్పుడే నీమనోధైర్యంబును జిక్కఁ బట్టవలయును. (అని రంగస్థలమువంకఁ జూచి) సఖీ! అదిగో! మఱియొక పురుషుఁడు ప్రవేశించుచున్నాఁడు. చూడుము.

[అంతఁ బ్రద్యుమ్నుఁడు పాములబుట్ట శిరంబునఁ బెట్టి మూపున నాగస్వరపు బుర్ర వ్రేల భద్రుండను పేర పాములవానివేషముతోఁ బ్రవేశించును.]

భద్రు—బాబూ! బలే సామంతమైన నల్లతాచుపాము. బహుపొగరెక్కియున్నది. చూడుఁడు. (అని పాములఁబుట్టఁ గ్రిందఁబెట్టి మూతఁదీసి నాగస్వరముఁ బాడుచు నాడించుచున్నాఁడు.)

అనే—ఓరీపాములవాఁడా! ఈకృష్ణసర్పము నెచ్చోటఁ బట్టితివిరా?

భద్రు—బాబూ!

ఉ. నల్లలితప్రసూన మృదుసౌరభ సంపదకాసఁ జెంది నే
నల్లనఁబోయి యొక్కబిలమందునఁగాంచి ఫణాగ్రరత్నమం
దుల్లముజిక్కనక్కటిక మూనకవజ్రపురంబులోని జి
ల్లేళ్ళ పొదన్ గ్రహించితి మఱీమనసరంధను దీనినోప్రభూ.

అసి—అనేకాక్షా! ఈకృష్ణసర్పము తక్షకుఁడేసుమా. ఇంద్రసంరక్షణచే బోతరించి యెట్లుమినమినలాడుచున్నదో చూడుము.

అనే—దేవా! ఇంక నాయింద్రునియుపేక్షచే నది శిక్షింపకుందునా?

భద్రు—బాబూ! సందేహమేమి? ఈతేలిపోనమున న్నెంతయైనఁ జిక్కులుపెట్టినది. (అని సర్పమునుద్దేశించి) ఓకుచ్ఛితవిషోరగమా! ఇంద్రపదంబుఁ జెందితినని గర్వించుచుంటివా?

చ. అనఘుఁడు శంకరుండు గళమందు నినుం ధరియించినంత నా
వినతసుతున్ హసించెదె వివేకమొకింతయులేక నీశిరం
బున హరిపాదచిహ్నమును బూనినయంత నె త్రుళ్ళఁబోకు నె
మ్మిని నిను ఘంటఁగల్ప జనమేజయుఁ డుండఁడె కృష్ణసర్పమా.

మఱియు,

చ. ఘనమకుటాగ్రభాగమునఁ గ్రాలుమణిన్గొని విఱ్ఱవీగదే?
ప్రణుత నరేంద్రుచేత నెక కరండమునందునఁ జిక్కినప్డు బు
గ్రనుపయి కెత్త నీకుఁ దల ప్రాణము తోఁకకు రాకయున్నె? యిం
కను కనుగల్గి వర్తిలుము గర్వము వీడుము కృష్ణసర్పమా.

(అని నాగస్వరపుబుఱ్ఱతో దాని నొకచెంపఁ బొడుచుచున్నాఁడు.)

అసి—అనేకాక్షా! ఈదుష్టోరగజాతి లోకకంటకంబుఁగనే యున్నదిసుమా. ఏమన,

చ. గొనబగు కమ్మతావి నొసఁగుం గదచెంత మెలంగనంచుఁ జం
దనతరుఁ జేర శక్యమగునా యట బుస్సను కృష్ణపన్నగం
బును వెలిఁ ద్రోయకుండ? వల పుంగొని దూరమునందు నిల్చి తృ
ప్తినిగని సజ్జనుల్ జగతిఁ బ్రీతిఁ దలిర్ప నెసంగుచుండరే?

అనే—దేవా! నిశ్చయమే కాని నాకొక్క ధైర్యము కలదు. ఏమన నీకుటిలకుండలి కరండమునం దడంగియుండవలసినదే కాని పైకి తలయెత్తి తిరుగఁజాలదు. ఇంత యేల.

ఉ. ఆరయ దర్భనాకి యమృతాప్తికి నాల్కలు రెండుకాఁగఁ బెం
పారి దురుద్ధతిన్ బిలవిహారము సల్పుచు డంగుఁగాని యా
భైరవి గారుడ ప్రముఖ బంధచయంబులఁ గట్టఁజాలు నీ
ధీరు నరేంద్రుఁ గృష్ణఫణి తేఱి కనుంగొన సాహసించునే?

భద్రు—బాబూ! తగినశక్తి యుక్తులులేక యేమరియున్నచో నీకృష్ణసర్పముచే నరేంద్రునకే గాక చెంతఁజేరువారందఱకు నుపద్రవమే సంభవించును. కాని యీదుష్టోరగము పట్టినకొద్దికాలమువరకు బహుతేజుగనుండి యొకయెడ సురింగె. పిమ్మట మరలఁబట్టి రాఁజేసితిని. బాబూ! ఇప్పుడు లోలోపల రోజుచుండునే గాని మునుపటి పొగరంతయు నడంగినది.

అసి—ఇదివరలో తగిలిన దెబ్బలకుఁ గోఱలూడిపోయెఁ గాఁబోలు.

అనే—ఓరీ పాములవాఁడా! దీని నీ వేలయుపేక్షించుచుంటివి?

చ. కనుపొరగప్పియున్న యెడఁ గాంచఁగ నేరక క్రిందుమీదు ద్రొ
ళ్లును కడతేర్పకున్న నెటులోఁగ ఱవంగఁ దలంచు దీని స్వే
చ్ఛను విడువంగరాదు నుమి చప్పిడిదెబ్బల లత్త్యపెట్టునే?
విను సవరైన దుడ్డుఁ గొని పిండిఁగదంచుము కృష్ణసర్పమున్.

భద్రు—(బుట్టలోనిపాము వెలికిరా మరల నందులోనికిఁ ద్రోచి) ఓతుచ్ఛకాకోదరమా! నీ వేనాడోచచ్చినట్లు పడియుండవేని బాబుగారు సెలవిచ్చినట్లు చేసెదను. నీకింత గర్వమేల?

చ. వనధిజనింప నాయమృతపాత్రనుగాచెద నేరికైనఁ గై
కొనఁదరమానెయంచు నడుగుంబడిత్రుళ్ళెవె? రెండుకళ్లు దు
మ్మునుబడఁజేసి యావినతపుత్రుడు దాని గ్రహింపలేదె? నీ
కనువగుమూలనే యొదుగనోఁదలయెత్తక కృష్ణసర్పమా.

అని—(తనలో) ఈ పురందరుండు తనకు వజ్రనాభునిపైఁగల కోపాతిశయంబుచే వజ్ర నాభ భావగర్భితంబుగ నీకృష్ణసర్పముయొక్క బుర్రను సమగ్రముగఁ జితుకబొడువుమని ప్రద్యుమ్నున కుపదేశించుచుండె. ఆహా! ఏమి వీనిపంకము! (ప్రకాశముగా) ఓరీ పాములవాఁడా! ఈకృష్ణసర్పముయొక్క శిరోమాణిక్యము నూడఁబెఱికితివా లేదా?

భద్రు—బాబూ! సర్వజనకంటకసంచారిణియైన దీనిబుర్ర సమగ్రముగఁ జితుకఁబొడుచకుండ నా కది పూర్ణముగా స్వాధీనమగునా? ఇట్లెన్నిసార్లు పొడిచినను దీనికి సిగ్గులేదు.

అనే—మాటలు చేతనా?

భద్రు—

మ. వినుఁడీ నేనిటవజ్రముం గొనఁగఁ గావింపన్వలెన్వజ్రనా
భనిరోధప్రతికార మేక్రియను బ్రాపై మీరునాకాంక్షితం
బునుసిద్ధింపఁగృతార్థులయ్యెదరొ బాబూ!

అనే— వెఱ్ఱివాఁడా! నరేం
ద్రునిచేఁజిక్కినఁ కృష్ణసర్పమణి నింకదున్ గైకొనన్ రాదొకో.

వజ్ర—(మహోగ్రకోపంబున గద్దెపైనుండి చివాలునలేచి) ఓరోరి కుశీలవాధములారా!

ఉ. బిచ్చముఁగోరివచ్చితిరి భిక్షుకులార! మదీయక్రోధపుం
జిచ్చునఁగూలదుర్మదముచేఁ గడుక్రొవ్వుట బ్రేలుచుండిరే?
ఇచ్చటవజ్రనాభు నెదిరించి ప్రతిక్రియ నాచరింపఁగాఁ
జచ్చుటయా మదీయ పటుశాతకఠోర కృపాణధారచేన్.

భద్రు—(రాక్షస సభవంకదిరిగి వజ్రనాభునితో)

శా. రక్షోవల్లభ ! యర్థి వౌచు నిటులన్ రప్పింపఁగా నేను ప్ర
త్యక్షామోదకర ప్రభావతిని బ్రత్యర్థక్రియావాప్తి బల్
దక్షత్వంబున వజ్రనాభ సదమూల్యంబౌ లసద్రత్నపుం
బిక్షం గైకొనవచ్చినాఁడఁ జుమి పృథ్వీకంటకాగ్రేసరా.

ఇంక చల్లకువచ్చి ముంతదాచనేల? నీ దానధారాపూరంబున.

క. ఆజీవనమునుగొనురవి, తేజంబున వారిజంబు దీపింపదె? నే
నీజీవనమున దానవ రాజాననఁ గైకొనంగ రానయ్యేఁ జుమీ.

రోమం—(అత్యుగ్రకోపంబుతో లేచి) ఆ! దేవా! ఈ నర్తకాధముండు దేవరవారికుమారీమణిని విరోచితంబుగ గైకొనంగోరి విరోధిగా వచ్చెనట. వీని నింక యుపేక్షింపరాదు.

తామ్ర—ఆఁ! దేవా ! ఏలినవారి సెలవైనచో నిప్పుడే యీ నరకీటకంబును బలమైన నా యీ గదాదండమునుచే నలిపిచంపెదను.

కరో—ఆఁ! దేవా! వైద్యవేషమ్మున దేవరవారి శుద్ధాంతంబున కేగిన నరాధముండు వీఁడే కాఁబోలు. వీనిని వేవేగ సంహారింపవలయును.

వజ్ర—(ప్రళయకోప దందహ్యమాన మానసుండై పండ్లు పెటపెటఁగొరుకుచు ఖడ్గంబు నవరింపుచు మహోగ్రంబుగ పైకురికి) అరే! ద్రోహి!

పద్మనాభవృత్తము.

ఓరి ద్రోహప్రచారా! మదోన్మత్త! ఉద్వృత్తిచే బేలవై నాదు ప్రోలన్
సైరింతునే నీవు కోరన్మదీయాత్మజన్ మూర్ఖ ! కాట్రోవ్వి వీతే? వజ్రనాభున్
జేరం దలంపూని తారాఫలభ్రాంతి చేమంట మైవ్రాలుపుర్వన్న బలెన్? వే
రారా యికన్ వేషధారీ! నినున్నే బిరానన్వధింతున్ మహాఖడ్గధారన్.

(అనిఁ ప్రద్యుమ్నుని గదియుచున్నాఁడు.)

ప్రద్యు—ఓరీ! దుర్మదోదగ్రవాచాల! నీ సంరంభవిజృంభణం బికఁగట్టిపెట్టుము. పట్టి బీరము లేలపలెకెదవు? చేతనైననాతో రణంబు సల్పుము. (అని విజృంభించుచు.)

లయగ్రాహి.

రాక్షస! దివౌకసవిపక్ష! నిను నింతదను కక్షతునిఁ జేసితిఁ గటాక్షమున
నీవా, యక్షులజయించి గిరిపక్షముల ద్రుంచుహరి శిక్షయొనరించు

టాక లక్షణమెనీకుఁ, దక్షతనునీమొదటి బిక్షుకుఁడుగాని సిరి వక్ష
మునఁదాల్చు కమలాక్షుఁడునుగానీ, రక్షణముసల్పిన సమక్షమునఁ
ద్రుంచినను నీక్షణమనేను మదిరేక్షణ గ్రహింతున్.

రోమం—ఆఁ! దేవా! ఈ యల్పనరకీటకంబుపై మీరు కడంగవలయునా? ఈ నా ఖడ్గభుజంగంబు వీని ప్రాణవాయువులను గ్రోలుటకుఁ ద్వరపడుచున్నయది. నాకు సెలవొసంగెదరా? మీయెదుటనేఁ వీనిని సంహరించెదను.

వజ్ర—ఆఁ! రోమంధస! మంచిది. వీనిని శీఘ్రంబుగఁ గడతేర్పుము.

రోమం—చిత్తము (అని మహాసంరంభంబునఁ బ్రద్యుమ్నునితోఁ బోరి యోహటించి పలాయితుఁడగును.)

(ఇటులనే తామ్రాక్ష కఠోరదంష్ట్రి లోహటించిన యనంతరంబ)

ప్రద్యు—(ప్రభావతి నుద్దేశించి వజ్రనాభునితో)

క. పూనికనీకై వచ్చితి, సూనాస్త్రుఁడనేనురక్కసులయుప్పరిగన్
రాణించెడు దానవనరు,గా నినుసాధించిగెలుపుఁ గైకొందుఁజుమీ.

(అని రభసంబున విజృంభించుచు వజ్రనాభునితో)

ఓరీ నక్తంచరాధమా!

ఉ. చూచితెనీదుమంత్రులగు శూరుల కేగతి సంభవించెనో?
తోఁచదె? నీవు నావిపుల దోర్యుగ వహ్నికి నిల్వఁజాలదే?
నీచ! పదంబులంబడుము నీయసువుల్వయి నాసగల్గినన్
గాచెద లేనిచో నిపుడ కాలుని ప్రోలున కంపెదన్నినున్.

వజ్ర—(అత్యంతకోప ఘూర్ణమానతారకుండై రోజుచు) అరే దురాత్మ! అరే బాలిశా!

స్రగ్ధర.

ఓరీదుర్గర్వ! మూర్ఖా! యురకపయిపయిన్ హుంకృతుల్మీరనన్నున్
జేరన్నీకెగ్గుకల్గున్ జెనటి! తొలఁగుమ క్షీణదోస్తంభవీరిన్
సారంబైనట్టి నా శస్త్రముగనుమిదిగో సాహసంబూనినిల్వన్
ఘోరాజిన్ ద్రుంతునిన్నుం గుయికుయిమనుచు న్గూయుచున్నేలగూలన్.

(అని యుద్ధమునకు మొనయుచున్నాఁడు.)

అసి—ఓరీవజ్రనాభా! ఈశ్వరవరప్రసాదంబుచేఁ బెచ్చుపెరిఁగి క్రిందుమీదుఁ గానక త్రుళ్ళిపడుచుంటివి. నీపొగరడంగు కాలమాసన్నమైనది. వినుము.

చ. అరయక దుశ్చరిత్ర నబలాంగుఁడు శంకరుఁ డిచ్చినట్టి యా
వరములఁగన్నఁ గానక దివౌకస పీడ నొనర్చినట్టి ము
ష్కరులగు నీదుపూర్వులకుఁ గల్గినశిక్ష యెఱుంగవైతె? దు
ర్భరతర సాధుశాపమున భస్మముగావె వరప్రభావముల్?

వజ్ర—అరే! ప్రేలరీ! ఎవఁడవురానీవు? (అని యసితాంగునిపై విజృంభించుచున్నాఁడు.)

అసి—ఓరీ! దుర్మదాంధా!

ఉ. ఏమిర నన్ను నీవెఱుఁగవే వరగర్వముచేతఁ ద్రుళ్లెదే?
రాముఁడనై వధించితిని రావణునిన్ బలి దైత్యుఁద్రొక్కితిన్
వామనమూర్తినౌచు శిశుపాలునిఁజంపిన కృష్ణుఁడన్ సుర
స్తోమశరణ్యుఁడన్ వినుము దుర్మద! నిన్గడతేర్పవచ్చితిన్.

ప్రద్యు—ఓరీ తుచ్ఛనిశాటా!

ఉ. చేవయొకింత యున్నహత శేషసురారులలోననిల్వుమీ
ఈవిధినిన్నుఁజిత్రవధ నేనొనరించెదఁ బొట్టఁజీల్చి నీ
ప్రేవులదాల్చి నాయుఱుత వెచ్చనినెత్తురు ద్రావి పెండ్లికిన్
బ్రేవుమటంచుఁబోయెద వరించెద నీదుసుతన్ ప్రభావతిన్.

(అని యుద్ధమునకు మొనయుచున్నాఁడు.)

వజ్ర—(శరీరము కంపింప రోషకషాయితాక్షుండై తనలో) ఏమిచెపుమా! నా దేహమంతయు వడంకుచున్నయది. నా వామనేత్రంబు నా వామభుజంబు నదురుచున్నయవి. ఇదియేమి దైవమాయయో తెలియరాదు. అయిన నావంటివీరాధివీరున కిట్టి నిమిత్తమాత్రంబు లొకలెక్కయే? (హుమ్మని యౌడుగఱచి పండ్లు పెటపెటఁ గొఱుకుచు కత్తిసవరింపుచు ప్రకాశముగా) అరేరే ద్రోహీ! కైతవనర్తకాధమా!

ఉ. ప్రేలకుమింక నోరి రణభీరువ! నోటికి వచ్చినట్లు నా
కేలనుఁదాల్చియున్న పటుఖేటకముం గనుఁగొమ్ము దీని చే
నాలములోన నిన్ను దునుమాడెద వ్రేల్మిడి మానుమట్టివా
చాలత నీదుపౌరుషము సాగదు నాయెదుట న్నరాధమా.

(అని పెల్లాగుచు రణంబునకు డీకొనుచున్నాఁడు.)

శుచి—(తనలో) వహ్వా! ఈదైత్యాధమునిఁ గాత్యాయనీదేవి యావేశించెఁ గాఁబోలు. వీనిసర్వాంగములు నెట్టువడంకుచున్నవి!

ప్రద్యు—అరే! దుర్మద! శివెక్కినదాయేమి? ఏలవడెంకెదవు? రారమ్ము. నీగర్వంబిప్పుడే యపనయించెదను. (అని మార్కొనుచున్నాఁడు.)

వజ్ర—(మహార్భాటంబుతో కత్తి ఝుళిపించుచు) ఓరీనరాధమా!

పంచచామరము.

హుటాహుటిన్మదోగ్రభంగి హుమ్మటంచు లేచె దీ
విటుల్మనుష్యకీటకంబ యేర యింక నా సము
త్కటప్రభూతరోషవహ్ని దాకి నిల్వనీకు దు
ర్ఘటంబు ప్రేలకుండుమింక కండకావరమ్మునన్.

(అని కదిసి కొంతతడ వత్యుగ్రంబుఁగ సాహసంబొనరించి యిరువురు నొకవిజనస్థలంబునకు నిష్క్రమింతురు.)

ఇంద్రు—శ్రీకృష్ణా! సుతవత్సల! మనప్రద్యుమ్నుం డతిసాహసంబున నీరాక్షసేంద్రునితో రణంబునకు డీకొనియె. ఎట్లోఁగదా!

పంచచామరము.

వరప్రభావుఁడైన ఘోర వజ్రనాభదైత్యునిం
దరంబె చంపలాతిఖడ్గ ధార నెట్టివానికిన్

శ్రీకృ—ఓయీసహస్రాక్షా! భయపడకుము.

తిరంబుఁగాఁ బెనంగి బార్వ తీకృపన్నిజాసిచే
దురంబులోనఁ జచ్చుఁ గంపితుండుగా నదైత్యుఁడే.

మఱియు నేనిప్పుడే పాలికలనికేగి యదృశ్యుండనై యుండి నామాయచే నా దైత్యాధముని స్వశస్త్రహతునిగాఁ జేసెదను. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

ఇంద్రు—(ఉత్కలికఁ దనలో) వహ్వా! ఇంకనాకు భయమెక్కడిది.

(అంత నుప్పరిగ నొకకలకలంబు వినంబడ నాలకించుచున్నాఁడు.)

రాగ—అయ్యో! ప్రియసఖీ! ప్రభావతీ! ఎంత గాఢమూర్ఛమునింగియుంటివే !

శుచి—(తనలో) ఈలేమ కపటనాటకవేషధారియగు భద్రుండు తనమనోహరుండే యని యెఱింగినతోడనే విషాదానందరసనిమగ్నయై యిట్లు మూర్ఛిల్లె. ఇప్పుడేమిచేయ నగు? (ప్రకాశముఁగా) ప్రభావతీ! ప్రభావతీ!

క. చెలియరో యేమే యిటు మూ
ర్ఛిలియుంటివి? నీమనంబు చెదిరెనె? నీకో

ర్కెలు గొనసాగును నిన్నా
కలన న్నీవిభుఁడు జయముఁ గని గ్రహించుచున్.

ఇంద్రు—(తనలో) అన్నా! పాపము! ఈయుపద్రవమువలన నా కన్నియ కెట్టికీడువాటిల్లునో కదా!

చ. అసురకుమారియయ్యు నసురాంతకపుత్రునిఁ గోరియుంట నీ
బిసరుహనేత్ర నెమ్మనము వెన్కకుఁ బోయిన గొయ్యి ముందుకున్
వెసఁజన నుయ్యి కాఁగ దురపిల్లుచుఁ గ్రక్కను మ్రింగ వీలుఁగా
కుసురుచలింప మూర్ఛిలె నయో! యిది యేమి యుపద్రవంబొకో.

కానిమ్ము. అంతకును భగవంతుఁ డగు శ్రీకృష్ణుఁడేకలఁడు.

ప్రభా—(మూర్ఛ తెలసి లేచి జనాంతికముగా) సఖులారా! నాజనకుండా పురుషవతంసునితో నింకను రణంబు సల్పుచునేయుండెనా?

రాగ—ప్రియసఖీ! వారిరువురకు నింకను సమరంబు జరుగుచునేయున్నది ఏరికిని జయాపజయంబులు తేలలేదు.

ప్రభా—సఖీ! శుచిముఖీ! ఇప్పుడు నేనేమి చేయుదునే?

చ. తనువునొసంగి నన్ను సతతంబును ప్రేముడిఁ బెంచునట్టి నా
జనకునిపైని ప్రేమ విడఁజాలుదునా? యటు చిత్రలీల నా
మనము హరించినట్టి నవమన్మథు నాపతిఁ బాయ నోర్తునా?
వినుటకుమున్న నేరి మృతివీడెద ప్రాణముల న్సఖీమణీ.

(అని మరల మూర్ఛిల్లుచున్నది)

ఇంద్రు—(తనలో) అన్నా! ఈనవలామిన్న దుర్భరమనోవేదనచేఁ బ్రాణపరిత్యాగముఁ జేయుటకు సాహసించుచున్నది. ఎట్లో కదా!

(అంత తెఱలో)

ఉ. ఆగ్రహమూర్తియౌచుఁ బ్రళయాంతకుఁడో యన వజ్రనాభుఁ డ
త్యుగ్రకృపాణపాణియయి యుద్ధమొనర్చుచుఁ గంపితాంగుఁడై
నిగ్రహవృత్తి మే నెఱుఁగనేరకఁ దాఁ డిన ఖడ్గధారచే
నుగ్రగతి న్మృతింగనియె నో రజనీచరులార! వింటిరే.

ఇంద్రు—(సోత్కంఠుఁడై) ఓహో! ఏమి నాభాగ్యము! ఇంక నాకష్టములన్నియుఁ గట్టెక్కె. వహ్వా!

గీ. అఖిలలోకైకకంటకుఁడైన వజ్ర
నాభదైత్యుండు మృతిఁజెందె శోభఁగాంచె
దశదిగంతములెసనుహాస్తములనిలిపి
సర్వజీవులు నిద్రించు సౌఖ్యమెసఁగ.

(అనియిటునటుఁజూచి) అదిగో! సమీపంబునఁ గాళీయాలయంబు కాన్పించుచున్నది. నే సచ్చోటికేగి యా భగవతినర్చించెదను. (అని పరిక్రమించుచున్నాఁడు.)

(అంతతెఱరో) హాహా! హరకేశవులారా! సమస్తదేవతలారా! మా నెచ్చెలియగు ప్రభావతిని రక్షింపుఁడు. రక్షింపుఁడు. ఓముకుందా!

మ. రజితాద్రీశునకైన దుర్లభుఁడవౌ వార్తత్రాణపారీణ! యో
త్రిజగత్పావన! భక్తలోకశరణా! దీనావనా! సత్కృపన్
గజరాడ్గామినియా ప్రభావతిని వేగంగావవే ప్రాణముల్
త్యజియింపన్నమకట్టెరాఁగదవె కృష్ణా! యార్తరక్షామణీ!

ఇంద్రు—(ఆలకించి వెఱఁగందుచు) ఏమి! ప్రభావతీకన్యసాహసము! (అని యిటునటుఁ జూచి) అదిగో! ఆకన్యారత్నము కాళీసందర్శనార్థమై కాఁబోలు ఖడ్గధారిణియై మహోగ్రంబుగ నిటులనే వచ్చుచున్నది. నే నీమాటునడాఁగియుండి యామెప్రయత్న మెట్టిదియో గనిపెట్టెదను. (అనియొకమాటున డాఁగుచున్నాఁడు.)

[అంత నదేప్రకారము సఖీపరివృతయగు ప్రభావతి ప్రవేశించుచున్నది.]

ప్రభా—(భక్తిపూర్వకంబుగ దేవికి దండప్రణామం బాచరించి) ఓదేవి! (అని యంజలి ఘటియించి.)

క. పితృఘాతకురాలనుసీ సుతనుజగజ్జనని!కరుణఁజూడఁగదే యీ
క్షితిలోన నీవదిక్కో సతి! శాంకరి! గర్భగుప్తిఁ సాకవె నన్నున్.

(అని మరల ప్రణమిల్లి లేచి) ఓభవానీ!

కాళీదండకము.

శ్రీమన్మహాదేవి కాత్యాయనీ సర్వమాంగల్యదాత్రీ మదేభానన క్రౌంచ
దారప్రియాత్మోద్భవభ్రాజితోత్సంగ సమ్మోదినీ మోహినీ దుష్ట

సంహారిణీ కేశవాంభోజ సంభూత శక్రాది బృందారకోదారహృత్కి ప్త పాదద్వయాంభోజినీ మోక్షసంధాయినీ యాపదుద్ధారిణీ భ క్తరక్షా మణీ పాపవిచ్ఛేదినీదుర్మదారాతివిధ్వంసినీహంసినీమాహిషోన్మూలినీతత్వవిద్భాసినీ పావనీ ఘోరసంసారవారాశి దుఃఖోర్మికోత్తారిణీ నిత్యకల్యాణి నీరేజపాణీ కనద్ధృగ్గితైణీ లసద్దివ్యరోలంబవేణీ జగత్కారిణీ సర్వభూతావనీ భద్రసంచారిణీ భీమసంగ్రామ భీభత్సరూపిణీ రక్తరసగ్మాంస బల్యాన్నసమ్మోదినీ భూతభేతాళ పైశాచికోల్లాసినీ పూజితామ్నాయసంవాసినీ యన్త్రశస్త్రానుసందానసై పుణ్యనిర్ధూతవిద్వేషిణీ దివ్యకైలాస గోత్రాంతరోత్ఖేలినీ సత్కృపాశాలినీ భూరికాపాలినీ చిత్తజోజ్జీవినీ నిత్యసౌభాగ్యసంధాయినీ సజ్జనధ్యేయినీ భవ్యకారుణ్య లక్ష్మీకటాక్షేక్షణీ చండరుద్రాణి మాయామయీభైరవీ యాదిశక్తి సతీ పార్వతీ చండికా దుర్గ దాక్షాయణీ రాజరాజేశ్వరీ దక్షవాటీ మఖధ్వంసినీ యర్ధనారీశ్వరీ సర్వయోగీంద్ర హృద్వారిజాలోలభృంగీ కపర్ది జటాజూటగంగాసపత్నీ చరస్థావరా శేషబ్రహ్మాండభాండాంతరస్థాయినీ లోకముల్ సృష్టిజేయంగఁ బెంపన్ లయింపన్ త్రిమూర్త్యాత్మకంబైన తేజంబునీయుండ బొల్చు న్నినున్న న్నుతింపంగ నాయాది శేషాహికైనం దరంబానె నే నెంతదాన న్గడుం దీనురాల న్నినున్న మ్మియుంటి న్గురుద్రోహముం జేసి యాపన్న నై తిన్నదే తల్లి దీనార్తిసంత్రాణ కారుణ్యవల్లీ యిటున్నా మొరాలింపనే సత్కృపం జూడవే నాకికం దిక్కు నీవే సుమంబా! కటా! కేలి న్దైరిఁతుం జూవా వరు న్నిష్కళంకంబుగా భర్తఁగాఁగోరుటన్నా దె నాపాంత్రి పంచత్వముం జెందె నాథుండు నన్నెట్టులం గూర్మిఁ జేపట్టునో యిన్నిలక్ష్యంబు చే నావరుం దేర్చి నాకొందలంబెందు డింపింపఁగాఁ జేయు నాకెత్కటించవంగ నే శాంకరీ లేని చోనే నిదే నాదుతంత్రిన్బలె క్షితిధారన్మృతి ముంపు కెర్ష ంబు

ఖండించి నీకునర్పించెదన్ ప్రీతిఁగైకొనఁగదే లోకమాతా
నమస్తే నమస్తే నమస్తే నమస్తే నమః.

(అని నిమీలితనేత్రయై కొంతతడవు ధ్యానించి ఖడ్గంబు చేఁబూని తనకంఠంబు ఖండింపబోవును.)

[అంత మహాశక్తిసాక్షాత్కరించి.]

శక్తి—ఆఁ! కుమారీ! వద్దువద్దు అజ్ఞానురాలవై యతిసాహసం బొనరింపకుము. త్రిలోకకంటకుండైన వజ్రనాభదైత్యుని మరణంబునకు ప్రాజ్ఞురాలవగు నీవు దుఃఖించుట యుచితమగునా? వాని దుర్విచేష్టితంబులు నీ వెఱుంగకుంటివా?

చ. శమదమనిగ్రహుల్ పరమశాంతుల యోగులఁ ద్రుంచి మానిస
త్తములసుఖంబులెల్ల సతతంబును పాడొనరించి బ్రాహ్మణో
త్తములనుజంపి దేవతల దంచి పతివ్రతలంగలంచి దో
సము లొడిగట్టు నీజనకు చావునకుం దురపిల్లఁ జెల్లునే?

ప్రభా—ఓహో దేవీ! సర్వమంగళా! నాతండ్రి యెంతటి దుష్టచిత్తుండైనను;—

శా. "సొమ్ముల్కాన్కఁగఁదెచ్చితిం దొలఁగునిన్ జూడన్ శ్రమంబంత యుక్
గొమ్మా! ముద్దులగుమ్మ! వేడ్కలరఁగైకొమ్మా" యటంచున్నను
సమ్మోదమ్మునఁజూచి మోము దరహాసస్ఫూర్తిశోభిల్లఁగా
నమ్మా! రమ్మనుతండ్రి లేఁడుకద కట్టా! నాకికన్ శాంకరీ!

జగజ్జననీ! నే నొక్కనాడు మదీయాంతఃపురంబున హంసతూలికాతల్పంబుపై శయనించి నిదురింపుచుండ నీ విట్లు నిర్హేతుకజాయమానకటాక్షవీక్షణంబుల నాకు సాక్షాత్కరించి యొక మోహనాకారుని చిత్రపటంబు నాకొసంగి యీ పురుషరత్నంబే నాకు పతికాఁగలండని చెప్పి తిరోహితవైతివి. పిమ్మట నామనం బాసుందరాంగునిపైఁ దగుల మోహాతిరేకంబు చే,

చ. జనకునికన్నుఁగప్పి యనిశంబుఁదపించుచు వెన్విరాలి నా
మనము హరించినట్టి నవమన్మథు పేరను లేఖవ్రాసి రా
నొనరిచి నేరహస్యముగ నుత్సుకత న్వరుఁగూడి నేన కా
రణముగఁ దండ్రిచావుహానరంగ ఘటించితి నాహవంబునన్.

అట్టి పితృహంత్రినగు నన్ను నాప్రాణనాథుం డనుగ్రహించునా? నాకింక సర్వ శరణ్యంబవు నీవ. పతితపావనీ! నన్నురక్షింపుము. (అని ప్రణమిల్లుచున్నది.)

ఇంద్రుడు—(తనలో) ఓహో! ఈసాధ్వీమణియోగ్యత జగదేకవర్ణనీయంబుగ నున్నయది.

క. జనకుని మరణమునకుఁ గా
రణమై పితృహంత్రినైతి రమణుఁడు కూర్మిన్
గనునో యను మానించునొ
యనిపరితాపమున నాత్మహత్యకుఁ దొడరెన్.

ఏపతివ్రతాతిలకంబునకైనఁ బతిభక్తియుఁ బితృభక్తియు నిట్లుండవలదా?

శక్తి—ప్రభావతీ! నిష్కారణము నీ వేల యాత్మనింద చేసికొనియెదవు? నీ తండ్రిచావునకు నీ వెంతమాత్రమును కారణభూతురాలవు కావు. వినుము.

గీ. తన కరాంగుళిఁ బరులనేత్రములు పొడువఁ
బూను దుర్మతి తన కన్నెపొడిచికొనుట
కిదియ దృష్టాంత మనఁ బరికింపఁగోరి
యబల! నీతండ్రి తనకుఁ దానంతమొందె.

మఱియు దుష్టచిత్తులు దుర్వ్యసనాసక్తులు సాధుహింసాపరతంత్రులు క్రూరకర్ములు నగు దైత్యుల దుష్కులంబున గంజాయివనములో తులసిమొక్క మొలచినట్లై [illegible] కుమ్మరియావములో భర్మకలశంబు లభించినపగిది దేవతాంశచే జన్మించిన నీవు [illegible] పహతుండగు నీతండ్రిమరణంబునకు దుఃఖింపఁ బనిలేదు. "అవశ్యమనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభం" అను న్యాయము తెలుంగకుంటివా? నీతండ్రి [illegible] తిగా స్వశస్త్రహతుండై యాత్మద్రోహం బొనరించుటంజేసి యధఃపతితుండు [illegible] నన్ను భగవంతుండును నీ మామగారునగు శ్రీకృష్ణునిమాయచే నావహింపఁబడి [illegible] వున వానికిఁ బుణ్యలోకమే ప్రాప్తించును. నీవువరించిన పురుషుఁడు నీకన్న [illegible] గులు నీపై యనురాగపూరితుండై యున్నవాఁడు [illegible] నలుంగఁడు. అతఁడు జయోత్సాహుండై వచ్చి నిన్ను [illegible] యుల దాంపత్యంబు దైవ [illegible] కావున నీవింక [illegible] రుండగు ప్రద్యుమ్నుని చెట్టపట్టి [illegible] యుం దారోగ్య పుత్రపౌత్రాభివృద్ధి నెసంగుము. [illegible]

నరనస్ఫూర్తినెసంగి నీదుగుణశీలస్నేహయోగాప్తి భా
స్వర సత్కీర్తి మయూఖము ల్దిగుడదిక్కూల్భాసిలన్ జేయుతన్.

మఱియు, శా. నీగర్భస్థకుమారశేఖరుఁడు నిర్నిద్ర ప్రభావుండు బా
హాగర్వాంచదసమానరూపగుణ విద్యాశాలియుం సంతతం
బా గౌరీకృపచేత వజ్రపురమర్త్యాంతంబు బృందారకో
ద్యోగుండై యురుకీర్తినేలుచుఁ జిరాయుష్మంతుఁడై వర్ధిలున్.

శుచి—దేవా! పితృమరణ సంజాతచింతాకులస్వాంతయగు ప్రభావతి దేవరవారితో నొక సంగతి విన్నవించుకొనఁ గోరుచున్నయది.

శ్రీకృ—ఏమని?

శుచి—దేవా! వినుండు.

"గీ. జనని చిన్ననాడె చనిపోయె ననుఁ బ్రోచు
కన్నతండ్రి లేఁ డుర్గతివినీవ
నీదు గర్భగుప్తి నెగడింప నీపాద
ములకుఁ జేరఁదీయ మ్రొక్కుచుంటి" అని.

శ్రీకృ—ప్రభావతీ! నీ వెంత వెఱ్ఱిదానవు!

చ. మృతుఁడగుతండ్రికై వగవనేల? యతండు వరప్రభావుఁడై
యతులితభోగభాగ్యముల నందియు మోక్షపదంబుఁ జెందె నీ
పతి యనురక్తిఁజూచు నిను భాముని రుక్మిణి యాదరించెడున్
గుతుకముఁ జెందుమమ్మ మదిఁ గొందలమందకుమమ్మకోడలా.

మఱియు-గీ. రిక్క చెలికత్తియలతోడ రేవెలుంగుఁ
గవయఁబోయెడు రోహిణీకాంతరీతి
నువిద నీ భర్తయైన ప్రద్యుమ్ను చెంత
కరుగు శుచిముఖి రాగవల్లరులతోడ.

(అని ప్రద్యుమ్నునితో) కుమారా! ఈ ప్రభావతీరమణి గాంధర్వవిధి నిదివరకే పంచభూతములు సాక్షిగా నీకు ధర్మపత్నియైనది. ఇప్పు డీయింద్రునిసమక్షంబున మరల పాణిగ్రహణ మాచరింపుము.

[అంత మంగళతూర్యనాదంబు లెసంగ ప్రభావతీప్రద్యుమ్నులకుఁ
బాణిగ్రహణ మహోత్సవము జరుగును.]

ఇంద్రు—సర్వలోక శరణ్యుండవగు నో శ్రీకృష్ణా!

మ. మునువారాశిమునింగి మందరనగంబు న్వెన్నుపైఁ దాల్చి భూ
మినిఁ గోడంబున నెత్తి కంబమునఁ బేర్మిన్ బుట్టి మిన్ముట్టి బ్రా
హ్మణ సంప్రీతినొనర్చి సీతఁగొని శేషాఖ్యన్ వ్రతోద్ధాపకుం
డన ధర్మ ప్రతిపాదకుండనఁగఁ గృష్ణా! కావవే వేల్పులన్.

శా. నాపుణ్యంబున నిన్నుఁగాంచితిని కృష్ణా! సత్కృపన్నీవు నా
ప్రాపై నాదు పరాభవంబుఁ దొలఁగింపం జేయవే నాకృత
జ్ఞాపారీణతఁ దెల్ప నీకిదె నమస్కారంబుఁ గావింతు నో
యాపద్బాంధవ! ప్రీతిఁగైకొనినను న్హర్షాంబుధిన్ దేల్పవే.

(అని ప్రణమిల్లుచున్నాఁడు.)

శ్రీకృ—నాకాధిపా!

శా. నీకాంతుల్ఫలియించె నేటికి సురానీకంబు హర్షించె నీ
నాకంబేలుచు నోలలాడు మిక నానాభోగభాగ్యంబులన్

మఱియు నీవే నాకు మహోపకారివైతివి. ఏమన,

నాకుంగోడలుఁగాఁ బ్రభావతినిఁ గన్యారత్నమున్ సాధ్వినిన్
రాకాచంద్రముఖిన్ ఘటించు టుపకారంబయ్యె నిప్పట్టునన్.

ఇంద్రు—శ్రీకృష్ణా! ఈదాంపత్యంబు సమకూర్ప శుచిముఖియే ముఖ్యకారకురాలు.

శ్రీకృ—అవును. ఆసంగతియు నేనెఱుంగుదును. (అని శుచిముఖితో) ఓశుచిముఖీ!

చ. పలుమరు వేషభాషలఁ బ్రభావతికిన్ సఖివై మెలంగి వే
ల్పుల పనిఁదీర్పఁ దద్వరునిపొం దొనఁగూడఁగఁ జేయలేదె కౌ
శలమున వజ్రనాభుఁడనిఁ జావఁగఁ గారణ మీవయైతి మి
క్కిలి నినుమెచ్చితిన్ శుచిముఖీ! వరమొక్కటిఁ గోరు మిచ్చెదన్.

శుచి—(సహర్షయై) దేవా! మహానుభావా!

గీ. దాసురాలను నే నంతకు దాన బ్రహ్మ
రుద్రులంతటివార లెఱుఁగఁగరాని
నీ పదాంభోజయుగ్మంబు నేను గంటి
చాలదే సఫలమయ్యె నా జన్మ నేఁడు.

మహాత్మా! భక్తవత్సలా! నీ కృపకు జాయమానకటాక్షంబుచే నాకొకవరంబుఁ బ్రసాదింప ననుగ్రహింపవలెను. కావున నే వేఁడున దేమన;—

భరతవాక్యము.

మ. నిరతశ్రీమణి సర్వపాలన నశోఖుండుండు నీభక్తుఁడు
ర్వ్యాపిశేషోన్నతిరాజ్య సేలనలయున్ శ్రీవత్సవాయాన్వయా
గ్ణసరాకారశశి కీర్తిచంద్రికలు బర్వన్ దిక్కులన్ సంతతో
త్సవుఁడై వేంకటసింహగోత్రపతి యా చంద్రార్కతార ప్రభన్.

మఱియు, మంగళ మహాశ్రీవృత్తము.

సిరిగను సర్వధరణీపతులు రాజ్యముల నిమ్ముఁబరిపాలనమొనర్పన్
ఖ్యాతిఁగ ఘనాఘనుఁడఖండ సమవృష్టికలుగంగనొనరింప సతతంబున్
క్ష్మాతలము సస్యఫలసంపదగనన్ రుజలు క్షామములు లేకనలరారన్
చేతములరన్ సకలజీవులు సుఖించి నినుఁ జేరవలె మంగళమహాశ్రీ.

శ్రీకృ—
ఇంద్రు— } తథాస్తు, తథాస్తు, (అని యందఱు నిష్క్రమించుచున్నారు.)

గద్య.

ఇది శ్రీమద్వేంకటరమణకరుణాకటాక్షవీక్షణాసారసమాసాదిత రసబంధుర
కవిత్వవిఖరీప్రవీణాపస్తంబసూత్ర శాండిల్యసగోత్రపవిత్ర హో
తృకులకలశార్ణవరాకాకైరవమిత్ర వేంకటరత్నసుపుత్ర
వేంకమాంబాగర్భశుక్తిముక్తాఫల వివిధవిద్వజ్జనవిధే
య వేంకటకృష్ణ నామధేయప్రణీతంబైన ప్రభా
వతీప్రద్యుమ్నంబను నాటకరాజంబున సర్వం
బును సప్తమాంకము సంపూర్ణము.

---

మ. అమలక్షత్రియవంశజాత! గుణరత్నాలంకృతా! ధీయుతా!
సమదద్వేషవిభంజనా! ప్రియముతో సాలంకృతంబైన దా
నముగా మీకు నొసంగియుంటిఁ గృతికన్యారత్నము స్సద్వరో
త్తమ! సింహాద్రి జగత్పతీ! కొని ననుం ధన్యాత్మునిం జేయుమా.

ఉ. వేంకటసింహగోత్రపతి! విద్యలభోజ! జగత్పతీంద్ర! య
ద్భంకపకీర్తి! మీఘనసభాస్థలి సత్కవికోటిలోఁ గవి
త్వాంకుఁడనం బ్రశస్తిఁగని యర్థిలి నేమిముఁ జేరి కొల్చుచే
యుంకువగా నొసంగెద నరోహా నృప! నాకృతి కన్యనేలుమా.

# కృతిప్రదానము.

